ఉచితం

తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నె

క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం

రెండు టిన్నులు కొన్నప్పుడు

క్రొత్త ఫారెక్స్ అధిక రుచికరం
క్రొత్త ఫారెక్స్ అధిక సంపూర్ణం

ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు
మీ పాపాయి పెరుగుదలకు మంచిది.




ఈ కానుక ఎంపిక చేయబడిన పట్టణాలలో ప్రత్యేక కానుక టిన్నులపై సరుకు వున్నంత వరకు లభ్యం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం—గ్లాక్సో

CLARION/B/GX/5/173 TEL

# చతుర

సంపుటి : 8 మే 1985 సంచిక : 4

## ఈ నెల సమగ్ర నవల

ఊహాతీతమైన ఒక నవసమాజం కోసం కలలు కన్నాడతను. ఆ సమాజంలో అంతా నిత్యయవ్వనులుగానే ఉండిపోతారు. రోగాలు ఉండవు, జనాభా సమస్యలేదు, అన్నీ యధేచ్ఛగా అనుభవించినా వారికి పిల్లలు పుట్టరు, గర్భధారణ బాధపడలేదు. సంతానం కావాలనుకున్నవారికి వారి స్వంత బిడ్డలే, వారి పోలికలతోనే లేబరేటరీల్లో పుడతారు, పెరుగుతారు...ఈ నిత్య సమస్యలేవీ ఉండవు గనుక అక్కడి పౌరులు తమ కాలాన్నంతా కళలు, శాస్త్రపరిశోధనలు, గ్రహాంతర యానాలకే అధికంగా వెచ్చిస్తారు.... చరాచర జగత్తులోని ఆటుపోట్లకు మూలమైన సృష్టి...






వారి స్వాధీనంలో ఉండి, ఆదేశించినట్లు నడుస్తుంది. వారిది ఒక దేవ సమాజంగా మారుతుంది. మనిషి మృత్యుంజయుడవుతాడు. అది ఎలా సాధ్యం? అలాంటి సమాజాన్ని కోరుకోవటమేగాక అందుకు సకలసన్నాహాలు చేసిన ఆ అపూర్వ వ్యక్తి ఎవరు? ఏమిటి అతని ఆశయం??

## పురాణపండ రంగనాథ్

ఆశ్చర్యకర సంఘటనలతో ఆధునిక శాస్త్రవిజ్ఞాన పురోగతిని నవలా రూపంలో అందజేసిన అద్భుత సైన్స్ నవల 'లయ' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : రమేష్







**సూపర్ రిన్ తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# చతుర ప్రపంచం

## అమెరికా ఆస్పత్రులు

అమెరికాలో ప్రభుత్వాసుపత్రులు వుండనే వుండవు. అక్కడ ఆస్పత్రులన్నీ ప్రైవేటు కంపెనీలు, సంస్థలచే నడపబడేవే! అందువల్ల సహజంగానే రోగులకయ్యే ఖర్చు చాలా అధికంగా వుంటుంది. ఆస్పత్రిలో పడకకి మాత్రమే రోజుకి 125 నుంచి 200డాలర్ల దాకా ఛార్జిచేస్తారు.



అయితే అక్కడ లభించని సౌకర్యమంటూ వుండదు. పేషెంట్లకు బోరుకొట్టకుండా టెలివిజన్ వుంటుంది. ఆస్పత్రిలో వున్నంతకాలం టూత్‌బ్రష్ దగ్గర్నుంచీ అన్నీ వాళ్లే అందజేస్తారు.

ఆ ఆస్పత్రులలో ఇంజెక్షన్ సూదులు, ప్లాస్టిక్ చేతితొడుగుల్లాంటివి ఒకే ఒకసారి ఉపయోగిస్తారు. తర్వాత వాటిని ఆటోమేటిక్ క్లీనింగ్ యంత్రంలో పడేస్తారు.

ప్రత్యేక నిపుణుడైన డాక్టరు ఆస్పత్రి నుంచి కారులో వెళ్లిపోయి 40 మైళ్లదూరంలో ఉన్నా ఎమర్జెన్సీ కేసు అయిన పక్షంలో వైర్లెస్ టెలిఫోన్ ద్వారా అతన్ని పిలవచ్చు.

చాలా ఆస్పత్రుల పైన హెలికాప్టర్లు దిగడానికి వీలుగా హెలిపాడ్స్ వుంటాయి. కొన్ని ఆస్పత్రుల డాక్టర్లకు ఎమర్జెన్సీ కేసులకి హాజరయేందుకు సొంత హెలికాప్టర్లు కూడా వుంటాయి.

అమెరికా ఆస్పత్రులలో రోగుల నుంచి వసూలుచేసే ఛార్జీలు చాలా అధికంగా వుండటంతో అక్కడ 'మెడికల్ ఇన్సూరెన్సు' కూడా చాలా ప్రాచుర్యంలో ఉంది.





# చేతుల్లేని చిత్రకారుడు

మద్రాసులోని 'ప్రెజెంటేషన్ కాన్వెంట్'లో బాలబాలికలకు బహుమతీ ప్రదానోత్సవం జరుగుతోంది. వేదికమీద నుంచి 'సుబ్రమణ్యన్' అని పిలిచారు. ప్రేక్షకులలోంచి ఓ పదేళ్ళ బాలుడు లేచి వేదిక వైపు నడిచాడు.

"మొదటి బహుమతి పాంటూ, షర్టూ" అని ప్రకటించారు. ముఖ్యఅతిథి తారా చెరియన్ చేతుల్లోంచి సుబ్రమణ్యన్ బహుమతి అందుకున్నాడు. చేతులతో కాదు...నోటితో! ఎందుకంటే, అతనికి చేతులు లేవు.

సుబ్రమణ్యన్ వాటర్ కలర్స్ ఉపయోగించి కాళ్ళతో అందమైన పెయింటింగ్ చిత్రించినందుకు ఆ మొదటి బహుమతి పొందాడు.

సుబ్రమణ్యన్‌ని అతని స్వస్థలమైన 'పొల్లాచి'నుంచి, మద్రాస్‌లో వికలాంగుల కోసం వుద్దేశింపబడ్డ సంస్థ 'మిత్రా సెంటర్'కి మూడేళ్ళ క్రితం తీసుకు వచ్చారు. అతని తల్లిదండ్రులు ఇళ్ళ నిర్మాణాలలో కూలీలుగా పనిచేస్తున్నారు. సుబ్రమణ్యన్‌కి ఓ సోదరుడు, సోదరి వున్నారు.

మద్రాస్ రాగానే అతన్ని ట్రీట్‌మెంట్‌కై ప్రభుత్వాసుపత్రికి తీసుకెళ్లారు. అక్కడ సుబ్రమణ్యన్‌కి కృత్రిమ చేతులు అమర్చారు. కాని, వాటితో ఇబ్బందిగా వుండటంతో, కొన్నాళ్ళ తర్వాత సుబ్రమణ్యన్ వాటిని తొలగించి, కృత్రిమ చేతుల అవసరం లేకుండానే బతకాలని నిర్ణయించుకున్నాడు.

'మిత్రా హేండీకేప్ సెంటర్'ని నిర్వహిస్తున్నది ఆస్ట్రేలియన్ మహిళ అయిన సిస్టర్ మేరీ థియోడర్. ఆవిడ గత 32 ఏళ్ళ నుంచీ భారతదేశంలో ఈవిధమైన సాంఘిక సంక్షేమ కార్యక్రమాల్లో నిమగ్నమైవుంది. ఆవిడ సుబ్రమణ్యన్‌తో



తమిళంలోనే మాట్లాడుతుంది.

సుబ్రమణ్యన్ తండ్రి అతనికి నెలకి 30 రూపాయలు పంపిస్తాడు. మిత్రా సెంటర్‌వాళ్ళే అతని ఆహారం, దుస్తులు, నివాసం, చదువు గురించి చూసుకుంటారు. వాళ్ళకి సంవత్సరానికి ఒక్కొక్క బాలుడికి దాదాపు 2,500 నుంచి 3,000 రూపాయల వరకూ ఖర్చవుతుంది.

సుబ్రమణ్యన్ అక్కడికి దగ్గిరలోని ఓ బడిలో రెండవ తరగతి చదువు తున్నాడు. టీచర్లు చెప్పే నోట్సులను అతని కోసం సిస్టర్ మేరీయే రాసి పెడు తుంది.

సుబ్రమణ్యన్ కాలివేళ్ళతో బ్రష్ పట్టుకుని పళ్ళు తోముకుంటాడు. కాళ్ళతో పట్టుకున్న చెంచాతో భోంచేస్తాడు. తాను భోంచేయడమేకాక తనలాంటి దురదృష్ట వంతులయిన చిన్నపిల్లలకి, వాళ్లా అవిధంగా తినేట్టు సాయపడతాడు.

అతను స్కూల్ బాగ్ భుజాలకి తగి లించుకుని వేళ తప్పకుండా బడికి వెళ తాడు. ఏ పనినయినా చేయగల ఆత్మ శక్తిని పెంపొందించుకున్న అతను బట్టలు మాత్రమే తనంతట తాను వేసుకోలేడు!

## క్రికెటర్ రైటర్

ఈమధ్య రచన, సంపాదకీయ రంగాల్లో అడుగిడుతున్న క్రికెట్ క్రీడాకారులు ఎక్కువయ్యారు. ప్రముఖ క్రికెట్ క్రీడా కారుడు పటౌడి ఓ పత్రికకు సంపాదక బాధ్యతను చేపట్టడం ఈ పరిణామానికి నాంది పలికింది. అదే మార్గంలో సునీల్ గవాస్కర్ రచయితగా మారి స్వీయ చరిత్రాత్మకమైన రెండు పుస్తకాలు వెలువరించాడు. ఇప్పుడు సందీప్‌పాటిల్ రాసిన 'సేండీస్టారమ్' అనే పుస్తకం కూడా ప్రచురితమైంది.

భారతీయ క్రికెట్‌రంగం గురించి తెల్సివున్న వారెవరూ, "ఈ పుస్తకం రాసేంత తీరిక సందీప్‌పాటిల్‌కెక్కడుం టుంది?" అని ప్రశ్నించరు. ఎందుకంటే, అతను నాలుగు టెస్టుల్లో ఆడితే, మరో ఎనిమిది టెస్టుల్లో ఆడడు. ఆ ఖాళీ సమయంలో రాసిందే ఈ పుస్తకం.

1981 జనవరిలో భారత-ఆస్ట్రేలియా జట్లమధ్య జరిగిన అడిలాయిడ్ టెస్టులో సందీప్ సాధించిన మొదటి సెంచరీ అతని వృత్తి జీవితంలో మైలురాయి లాంటిది. క్రికెట్ రంగంలో అద్భుతమైన ఖ్యాతి గల సర్‌బ్రాడ్‌మన్ ఆసందర్భంలో పని గట్టుకుని డ్రెస్సింగ్‌రూమ్‌లోకి వెళ్ళి మరీ సందీప్‌ను అభినందించాడు.

"నా ముందుకొచ్చి నిలబడ్డ ఆ గొప్ప క్రీడాకారుణ్ని చూస్తే నాకు వణుకు పుట్టింది. అంతక్రితం ఆయనతో ఏదో మాట్లాడాలనుకున్న వాణ్నే, అంతా విస్మ రించి ఏమీ మాట్లాడలేకపోయాను. కాని, ప్రపంచంలోని అతి గొప్ప క్రికెటర్‌తో కరచాలనం చేశాననే సంతృప్తి మాత్రం పొందానప్పుడు" అంటూ తన పుస్తకంలో ఆ ఘట్టాన్ని వర్ణించాడు సందీప్‌పాటిల్.

6 అడుగుల 1 అంగుళం ఎత్తుండే సందీప్‌పాటిల్‌కి అనేక రంగాల్లో ప్రవేశ ముంది. అతను నటుడు, రచయిత, సంపాదకుడు, గాయకుడు, పారిశ్రామిక వేత్త, హోటల్ డైరెక్టరేకాక వేటగాడు కూడా. ఆయారంగాల్లో తన అనుభవాల్ని పుస్తకంలో పేర్కొన్నాడు.

"క్రికెటర్లకి క్రీడా విశేషాలు రాసే రచయితలు, ప్రాతికేయులనుంచి అనేక సూచనలు,సలహాలు ఉచితంగా లభిస్తాయి.





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా, ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే, వారికది యివ్వడం అంటే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటె దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




GK&E B84.55 Tel

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

వాళ్లు క్రికెట్ ఎక్కువగా చూస్తుంటారు గనక, ఆవిధంగా తాము ప్రతి క్రికెటర్‌కీ సలహాలివ్వగలమనుకుంటారు"

"నేను, అవినాశ్ కార్నిక్ కలిసి ఓ చిన్న పరిశ్రమ ప్రారంభించాము. అతను ఉత్పత్తి గురించి చూసుకుంటుంటే నేను వ్యాపార వ్యవహారాల్ని నిర్వహిస్తుంటాను. క్రికెట్ ద్వారా అయిన పరిచయాలు మా వ్యాపారాభివృద్ధికి చాలా తోడ్పడుతున్నాయి. టెస్ట్ క్రికెటర్లు మంచి పరిచయాలు పెంపొందించుకుంటారుగాని వాటిని నేర్పుగా వుపయోగించుకోవడం తెలియదు"



సింథాల్
రోజంతా మిమ్మల్ని
తాజాగా ఉంచడమే కాకుండా
శరీర దుర్గంధ రహితంగా కూడా
ఉంచే ఒకే ఒక సబ్బు.

రోజుకు అర లీటర్ చెమట కారుస్తాం మనందరమూనూ. అంతే ఏమవుతుందో మీకు తెలిసిందే. తప్పనిసరిగా వచ్చే ఆ శరీర దుర్గంధాన్ని ఒక్క సింథాల్ మాత్రమే నివారించగలదు. సింథాల్, 30 ఏళ్లగా విశ్వసించబడుతున్న పేరు, చర్మంపైని సూక్ష్మక్రిములను నాశనం చేసే ఒకే ఒక కుటుంబపు సబ్బు. దీనితో మీకు రోజంతా దుర్వాసనలేని తాజాదనం.







గోద్రెజ్
సింథాల్ దుర్గంధ నివారక సబ్బు

అందరి శరీరాలకూ
కావలసిన అంగరక్షకుడు

CHAITRA-B-284 TEL

"నా స్నేహితుల సలహాలననుసరించి 'ఏ కచ్ శత్కార్' అనే మరాఠీ క్రీడల పత్రికకు సంపాదక బాధ్యత చేపట్టాను. ఆ పత్రిక నా గురించి, ఇతర క్రికెటర్ల గురించి ఆసక్తికరమైన వివరాలిస్తుంది. నేను దానిలో సంపాదకీయం, ముఖచిత్ర కథ రాస్తాను. ఇతర రచయితలు రాసే వివాదాస్పదమైన వ్యాసాలలో నేను జోక్యం కల్పించుకోను"

"బాల్యం నుంచీ నాకు వన్యమృగాలపై ఆసక్తి వుండేది. అడవుల్లో తిరుగుతుండగా ఎన్నోసార్లు పులి కంటపడటం జరిగింది. నాగపూర్‌కి సమీపంలోని 'తాడోబా' అనే అరణ్యంలో జరిగిన ఓ సంఘటన ఎప్పటికీ మర్చిపోలేను. రాత్రి 9 గంటల సమయంలో ఓ ఫ్లాస్కునిండా కాఫీతో, ఫారెస్ట్ అధికారులతో కలిసి అడవిలో తిరిగేందుకు ఓ జీప్‌లో బైలుదేరాము. వారితో ఎడ తెగకుండా మాట్లాడుతున్న నేను అరణ్యం మధ్యలో ఒకచోట టక్కున మాటలు ఆపేశాను. నా కళ్లు విశాలమయినై. గుండె అతి వేగంగా కొట్టుకోసాగింది. మేము అప్పటికి అడవిలో వృక్షాలు దట్టంగా అలముకున్న ప్రాంతానికి చేరుకున్నాము. నాతోపాటు అందరూ నిశ్శబ్దమయ్యారు. జీప్ ఇంజను చప్పుడు మాత్రమే వినబడుతోంది. దీనంతటికీ కారణం, మాకు 25 మీటర్ల దూరంలో ఓ పులి గుర్రుమంటూ మాకేసి చూస్తుండటమే!"

"1979లో మనోజ్‌కుమార్ ఇచ్చిన ఓ పార్టీలో పాల్గొన్నానంతే! దాని తర్వాత సినిమారంగంతో నాకు ఎలాంటి సంబంధాలూ లేవు. కొంతకాలం గడిచాక విజయసింగ్ పట్వర్ధన్ అనే ఓ నిర్మాత క్రికెట్ కథాంశంతో సినిమా తీయబోతున్నట్టు చెప్పి, నాయకుడిగా నటించమని నన్ను అర్థించాడు. నేను ఏం చేయాలో తెలీక తర్జనభర్జనపడ్డాను. ఇంట్లోవాళ్ళు నా సినీరంగ ప్రవేశాన్ని వ్యతిరేకించారు కూడా.

విజయ్ మర్చంట్‌తోసహా క్రికెట్ రంగంలో దీర్ఘకాలంగా వున్న అనేక మంది, నేను డబ్బుకోసం నటిస్తున్నానని విమర్శించారు. నాకు లభించిన సినిమా పారితోషికం తెలిపి, ఈ విమర్శకుల్ని మరింత కలవరపెట్టటం నా అభిమతం కాదు.

సినీతారలు పడే కష్టంతో పోలిస్తే వారి సంపాదన శ్రమకు తగిన ప్రతిఫలం కాదు. నేను నటిస్తున్న రోజుల్లో ఉదయం 9 గంటలకి షూటింగుకి వెళితే రాత్రి 1 గంటకిగాని తిరిగి ఇంటికి చేరుకునేవాణ్ని కాదు. దేవశ్రీరాయ్‌తో ఓ పాట చిత్రీకరణ కోసం చేసిన నిరీక్షణను ఎప్పటికీ మర్చిపోలేను. అప్పుడు ఓ ప్రొడక్షను వేను కోసం, కృత్రిమంగా కురిపించే వర్షం కోసం ఒక రాత్రంతా వేచి చూస్తూ కూర్చున్నాము"

"సరిగ్గా నటించలేని కారణంగా నేను సినీరంగం నుంచి విరమించుకున్నట్టు ఓ పుకారు పుట్టింది. నిజానికి అది కారణం కాదు. నేను జోడుగుర్రాల స్వారీ చేయలేను. క్రికెట్, సినిమారంగాల్లో ఒకదాన్ని మాత్రమే ఎన్నుకోవాలి. క్రికెట్ వల్లనే నాకు సినిమా అవకాశం వచ్చిందని తెలుసు. ఆ విధంగా నాకు అన్నీ సమకూర్చిన క్రికెట్‌ని నేనెలా మరవగలను. అందుకే క్రికెటర్‌గానే వుండి పోదలచాను" అంటూ 'సేండీ స్టారమ్' పుస్తకమంతా తన 'చిన్నతనపు, కళాశాల, క్రికెట్ రోజుల్లోని' అనేక ఆసక్తికరమైన సంఘటనలను వర్ణించాడా క్రికెటర్ రైటర్!

క్లబ్బంతా కోలాహలంగా ఉంది. అది మామూలు క్లబ్బుకాదు... తాగి పడిపోయే వాళ్ళు గానీ, పేకాడేవాళ్లుగానీ అక్కడకు రారు. అది 'నియోహ్యూమన్ సొసైటి' సభ్యుల క్లబ్! అంటే మేధావుల క్లబ్బు! శాస్త్రవేత్తల క్లబ్బు. ప్రపంచాన్ని గుప్పిట బంధించాలనుకొనేవాళ్ళ ఆలోచనలకు ఆకారాలువచ్చే క్లబ్బు. నవమానవుణ్ణి, నవ ప్రపంచాన్ని సృష్టించడానికై రకరకాల అసాధారణ ప్రయోగాలు చేసే శాస్త్రవేత్తల క్లబ్బు.

రాజకీయ శాక్తేయులూ, విజ్ఞానోన్మాదులూ పరస్పరం ఆలోచనలు విప్పి చెప్పుకొనే సంకేత స్థావరం కూడా అదే!

అక్కడ ఆరోజు రాత్రి అద్భుతమైన వ్యూహం రూపొందుతోంది. అందుకే అంత హడావుడి.

ఎరుపురంగు దుస్తుల్లో కెప్టెన్ రాయ్ ఉన్నాడు. ఖద్దరు బట్టలు వేసుకొన్న పార్లమెంటు సభ్యుడు మాలవీయా ఉన్నాడు. మార్వాడి దుస్తులు ధరించిన చందన్‌లాల్ ఉన్నాడు. బెంగాలీ కట్టు బొట్టుతో మిస్ సుధ వారందరి మధ్య అందంగా మెరుస్తోంది.

వారుగాక ఇంకా ఎందరో అక్కడ తమ తమ కుర్చీలలో కూర్చుని దేనికో ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. హడావుడిగా, ఆడంబరంగా మాట్లాడుకొంటున్నారు. ఇంతలో వారిని ఏకాగ్రం చేస్తూ 'బెల్' మోగింది. మరుక్షణం అందరూ నిశ్శబ్దం అయ్యారు.

ఆ చివర ఒక చిన్న తలుపు తెరుచుకొంది. ఆ ద్వారంలోంచి ఆజానుబాహువైన ఓ అందగాడు ఠీవిగా వచ్చాడు. అతణ్ణి చూస్తూనే అందరూ లేచి నిలబడ్డారు. అతను వారివైపు అభివాద పూర్వకంగా చూసి, తన ఉన్నతాసనంపై కూర్చున్నాడు. తర్వాత అందరూ కూర్చున్నారు. పది సెకనులు నిశ్శబ్దం.

"ఇంకా ఆలస్యం దేనికి?" ఆ యువకుని కంఠం ఆజ్ఞాపూర్వకంగా వినిపించింది.

మిస్ సుధ లేచి గొంతు సవరించుకొంది. అందరూ ఆమె మాటలు వింటూనే ఆమె శరీర లావణ్యాన్నీ పరిశీలిస్తున్నారు.

"ప్రియ మిత్రులారా! మన పథకం గురించి ఇదివరకే మీకు వివరించాం. మీ అందరూ సహకరించడానికి ముందుకు వచ్చినందుకు కృతజ్ఞతలు.

"మన పథకాన్ని ఇక అమలుజరపబోతున్నాం. అయితే ఇంతటి సువిశాలమైన ప్రపంచంలో ఇది సాధ్యమయే పనేనా అని మనవారిలోనే కొందరికి అనుమానాలున్నాయి. అవి నివృత్తి చేసి మనవారందరికీ పూర్తి విశ్వాసాన్ని కలిగించడానికే ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశాం. మన వ్యూహం అమలుకై 'బాస్' సృష్టించిన 'అసాధారణమైన మనిషి' ఒకరు ఇపుడు మీ ముందుకు రాబోతున్నాడు"

మిస్ సుధ ఈ మాటలు అని క్షణకాలం మౌనం వహించింది. అంతా నిశ్శబ్దం. వారి ఆత్రాన్నీ, అక్కడి నిశ్శబ్దాన్నీ భంగపరుస్తూ ఒక మరమనిషి వారికి ఎదురుగా వచ్చాడు.

ఆ మరమనిషిని చూసి వారు నిశ్చేష్టులయ్యారు. అచ్చంమనిషిలాగానేవున్నాడు. కాని కొంచెం పొట్టి, అంతే!

అతను వస్తూనే "గుడ్ మార్నింగ్ బాస్! గుడ్ మార్నింగ్ జంటిల్‌మెన్" అని అందరినీ విష్ చేశాడు.

"ప్రియ మిత్రులారా! నా శక్తియుక్తులు

మీకు ముందు ముందు తెలుస్తాయి. బాస్ చేసిన అద్భుత సృష్టులలో నేను ఒకడిని. ఆయన దగ్గర ఇంకా ఎన్నో శక్తులు వున్నాయి"

మరమనిషి ఇంకా ఏదో అనబోయాడు గానీ బాస్ అతడిని వారించాడు.

"రొబో! నీ నియమాలు ఏమిటి?" అని ప్రశ్నించింది మిస్ సుధ.

ఆ మరమనిషి సన్నగా నవ్వాడు.

"నాకు మూడు ప్రధాన నియమాలున్నాయి"

''ఏమిటవి?"

మరమనిషి అందర్నీ పరిశీలించాడు.

అందరూ తనవైపే ఆత్రంగా చూస్తున్నారు.

"నేను పాటించే నియమాల్లో మొదటిది: మనిషిని గాయపరచరాదు. అలా అని మనిషికి ఆపదవస్తే వూరుకోరాదు.

రెండు: ఈ సూత్రానికి భంగంకలగని రీతిలోనే మనిషి ఇచ్చే ఆజ్ఞల్ని పాటించాలి.

మూడవది: మొదటి రెండు నియమాలకు భంగం రాకుండా నన్ను నేను కాపాడు కోవాలి''

మరమనిషితననియమాలు వల్లించాడు.

''ప్రపంచంలోని అన్ని రకాల మర మనుషులకు వర్తించేవే ఈ సూత్రాలు! వీటిని ఎవరు రూపొందించారు?'' సుధ ప్రశ్నించింది.

"అసిమోవ్ అనే అమెరికన్. దాదాపు సలభైయేళ్ళనాడు ఈ సూత్రాల్ని అందించాడు. అవే నేటికీ మా జాతికి వర్తిస్తున్నాయి" రొబొ బదులు చెప్పాడు.

"నాలుగు దశాబ్దాలనాటి పాత నియమాలతో రూపొందించిన ఈ మరమనిషి మనకెలా ఉపకరిస్తాడు?" ఎవరో ప్రశ్నించారు.

మరమనిషి కిసుక్కున నవ్వాడు. అందరూ ఆశ్చర్యపోయారు.

"మిత్రులారా! అసిమోవ్ సిద్ధాంతాలు వర్తించే ఆ మరమనుషులు కేవలం చేతనా మాత్ర జీవాలు. నేను అలాకాదు... మీవలె మంచీ చెడూ ఆలోచించగలను. అవసరం అయితే నా అణునేత్రాలు తెరిచి మృత్యుజ్వాలలు వెదజల్లగలను" మరమనిషి గర్వంగా అన్నాడు.

"నీకు జ్ఞాపకశక్తి ఉందా?''

"ఉంది. నాలుగురోజుల క్రితం మిస్ సుధ నన్ను ఒక అడవిలోకి తీసుకు వెళ్ళింది. అక్కడ జరిగిన సంగతి చెప్తా... వినండి" మరమనిషి చెప్పసాగాడు.

* * *

అది ఒక అరణ్యం. చుట్టూ దట్టమైన చెట్లు పెరిగి ఉన్నాయి. ముళ్ళడొంకలు చిందరవందరగా అల్లుకొని పెరిగాయి. క్రూరమృగాలు అక్కడ స్వైరవిహారం చేస్తుంటాయి. రకరకాల ఔషధాలు తయారుచేయడానికుపకరించే మొక్కలు అక్కడ పెరుగుతున్నాయి. ఒకచోట మాంసాహారాన్ని తినే చెట్టు ఉంది. ఆ సంగతి తెలియక సుధఅటువైపు వెళ్ళింది. ఆమె స్పర్శ తగలగానే ఆ చెట్టు కొమ్మలు చాచి ఆమెను బంధించసాగింది. అది గ్రహించి ఆమెకూడా ఉన్న మరమనిషి అణునేత్రాలు తెరిచాడు. ఆ చెట్టు బూడిదై పోయింది. సుధ మూర్ఛపోయింది. మరమనిషి ఆమెకు ఉపచారాలు చేశాడు. ఆమె కోలుకుంది.

ఇద్దరూ నడకసాగించారు. కొంతదూరం వెళ్ళేసరికి వారికి ఒక యువకుడు కనిపించాడు.

సుధ ఆ యువకుణ్ణి ఆశ్చర్యంగా చూసింది. అతను ఆమెను మరీ వింతగా




priya

చూశాడు. మరమనిషి మౌనసాక్షిగా నిలిచాడు.

"ఎవరు నువ్వు?'' సుధ ప్రశ్నించింది.

''మనిషిని" అతను సమాధానం ఇచ్చాడు.

"నీ ఆకారాన్నిబట్టి నువ్వు మనిషివని తెలుస్తూనే ఉంది. ఇక్కడికెలా వచ్చావు? నీ పేరేమిటి?'' ఆమె గద్దించి అడిగింది.

"నేను సైనికశిక్షణపొందుతున్నవాణ్ణి. నా శిక్షణ విమానం కూలిపోయింది. నేను అదృష్టవశాత్తూ ప్రాణాలతో బయట పడ్డాను. పదిరోజులనుంచి దారీతెన్నూ తెలియక ఇలా తిరుగుతున్నాను" అతను సమాధానం చెప్పాడు.

"మాతో వస్తావా?"

"ఎక్కడికి?"

''మా లేబరేటరీకి"

"ఈ అడవిలో ప్రయోగశాలా?"

"ఏం ... ఎందుకు ఉండకూడదు? ప్రాచీనకాలంలో గురుకులాలు అడవుల్లోనేగా ఉండేవి!"

"కానీ మనం ఆధునికయుగంలో ఉన్నాం"

"ఇది కాలుష్యయుగం. అణుధార్మిక శక్తికూడా కలుషితం అవుతున్న తరుణం ఇది. అందుకే మేం ఈ అడవి మధ్య ప్రయోగాలు నడుపుతున్నాం"

"అయ్‌సీ. నేను శాస్త్రవేత్తనుకానే. నావల్ల మీకేం ప్రయోజనం ఉంటుంది?''

"నువ్వు తెలివైనవాడివి. నీ తెలివి తేటలు చాలు. మాతోవస్తావా? రావా?''

"రాకపోతే?"

ఆమె అతని ప్రశ్న విని పగలబడి నవ్వింది. అంతవరకు ఆమె చేతిలో ఉన్న హాండ్‌బ్యాగ్‌లోనుంచి పిస్టలు తీసి అతనికి గురిపెట్టింది.

"మిస్టర్! మాతో వచ్చి చేయి కలిపితే సరేసరి. లేకపోతే ఈ పిస్టల్‌తో నీ ప్రాణాలు తీస్తాను..."

ఆమె మాటలు కర్కశంగాఉన్నాయి. గులాబి పూలలాలిత్యాన్ని సంతరించు కొన్న ఆమె చేతివేళ్ళ కొసలమీద పిస్టల్ గిరగిర తిరిగింది.

"మీతో వస్తే ఏం లాభం?" అతను మనసు మార్చుకొని, ప్రాణాలు దక్కించు కోవాలని నిశ్చయించుకొని ఈ మాట అడిగాడు.

ఈసారి ఆమె సుతారంగా నవ్వింది.

"నిత్య యవ్వనుడవవుతావు. నిరంతర సుఖభోగివవుతావు. ముసలితనం రాగల భయం ఉండని అమృతలోక పౌరుడివి అవుతావు''

''అందే...?"

"అర్థంకాలేదా? మాతోరా... అన్నీ తెలుస్తాయి" ఆమె అడుగు ముందుకు వేసింది. అతను అనుసరించాడు. మర మనిషి అంగలు వేశాడు.

* * *

అది పెద్ద లేబరేటరి. ఎందరో శాస్త్ర వేత్తలు హడావుడిగా ప్రయోగాలు చేసు కొంటున్నారు. ఎవరూ ఎవరితోనూ మాట్లాడటం లేదు. ఆ లేబరేటరీకి ద్వారం ఎటు ఉందో తెలియడంలేదు.

అక్కడ ఒకచోట మానవ శరీరపు వివిధ అంగాలు గాజుబీరువాలో అందంగా అమర్చి ఉన్నాయి. అవన్నీ సజీవ అవయవాలే! ఊపిరితిత్తులు,ఉదరపిత్తాశయాలు, కాలేయాలు, గుండెలు, మూత్రపిండాలు, క్లోమాలు, వృషణాలు, స్త్రీ అండకోశాలు, మెదడులు...ఒకటేమిటి?మనిషి శరీరంలో సప్తధాతు సంచారంచేసే సమస్త



అవయవాలూ ఉన్నాయక్కడ!

సుధ నడుస్తోంది. ఆమె వెనుక ఆ యువకుడు అవాక్కయి చూస్తూ అనుసరిస్తున్నాడు. వారి వెనుక మరమనిషి ఉన్నాడు.

"చూశావా? ఈ మానవ అవయవాల సజీవ కర్మాగారం?" ఆమె ప్రశ్నించింది.

అతను మౌనంగానే "చూశాను" అన్నట్లు తలవూపాడు.

"ఇవన్నీ ఆరోగ్యవంతుల శరీర అవయవాలు. ఎవరికి కావాలంటే వారికి అతికిస్తాం"

"అంటే అంగాల మార్పిడి అన్నమాట''

"అంతకన్నా మరో విశేషం ఉంది. ఈ అవయవాలు తమ నకళ్ళను సృష్టించుకోగలవు. అంటేత ఇవి చిరంజీవాలు''

"ఆ! మెదడు కూడా తన నకలును సృష్టించుకోగలదా?"

"ఆఁ!ఏం...చూస్తావా?'' అని ఆమె అంటూనే అక్కడ మెదడు వున్న ఒక గాజు బీరువా దగ్గరగా వెళ్ళి ఒక 'స్విచ్' నొక్కింది. బీరువా అంతా వింతకాంతి వ్యాపించింది.

మరునిముషంలో అందులోని మెదడు ఉబ్బసాగింది. అద్దంలోనుంచి ప్రతిబింబం కదలివచ్చినట్లు, ఆ మెదడునుంచి మరొక మెదడు అవతరించింది.

అతని ఆశ్చర్యానికి అవధులు లేవు. ఆ నకిలీ మెదడు మరొక గాజు అరలోనికి దానంతటదే వెళ్ళిపోయింది.

"వీటితో ఏంచేస్తారు?"

"మనుషుల్ని నిత్యయౌవనుల్ని చేస్తాం. నవీన మానవజాతిని సృష్టిస్తాం" ఆమె గర్వంగా అంది.

"ఈ ప్రయోగాలకు ప్రభుత్వ అనుమతి ఉందా?"

ఈ ప్రశ్నతో ఆమె పకపక నవ్వింది.

"ఏ ప్రభుత్వం అనుమతి? మేం ప్రపంచంలోని ఏ ప్రభుత్వాన్ని గుర్తించం. మాది మా ప్రభుత్వమే. అందుకే ఇక్కడ ఇంత ఏకాంతంలో ఈ ప్రయోగాలు చేస్తున్నాం"

"నాతో ఇన్ని సంగతులు నిర్భయంగా చెబుతున్నారు. నేనెవర్నో తెలుసా?"

"నువ్వు ప్రభుత్వ ఏజంటువని,నీ పేరు రణధీర్ అని మాకు తెలుసు. నువ్వు చాలా తెలివయినవాడవని మాకు తెలుసు.మిస్టర్! మేం ఏ సంగతీ రహస్యంగా ఉంచం. ఇక్కడకు వచ్చినవాళ్లు ఆటోమేటిక్‌గా మాలో కలిసిపోతారు. లేదా ఇలా జడ చైతన్యమూర్తులై మ్యూజియం వస్తువులుగా మారిపోతారు"

"అంటే...?"

"మా మాట విని ఇక్కడ మాలో ఒకడివిగా ఉండిపోతే సకల రాజభోగాలు అందుబాటులో ఉంటాయి. వ్యతిరేకించి, పారిపోవాలని చూస్తే నీ శరీరంలో అవయవాల్ని మేం తీసేస్తాం. వాటిని ఈ గాజు పేటికలలో సజీవంగా ఉంచుతాం. నకళ్లు తయారుచేస్తాం. బుద్ధిహీనులకి మెదళ్లు ఇస్తాం. అంధులకు నేత్రదానం చేస్తాం. యవ్వనంకోరే కాముకులకు కొత్త జీవం అందిస్తాం. క్రమంగా నవసమాజాన్ని నిర్మిస్తాం"

"ఇదొకరకం వ్యాపారమా?"

"కాదు...ప్రయోగాలు. సృష్టి పై, మృత్యువుపై యుద్ధం"

"సరే! నేనూ మీతో చేయి కలుపుతాను" రణధీర్ అన్నాడు. అతని మనసులో ఓ సంకల్పం రూపుదిద్దుకోసాగింది.

"వెరీగుడ్! కమాన్" ఆమె అడుగే




సింది.

ముగ్గురూ ప్రత్యేకమయిన ఒక గది లోకి వచ్చారు. మరమనిషి దూరంగా నిల బడున్నాడు. ఆమె ఆ గదిలోని ఒక కుర్చీలో కూర్చుంది. రణధీర్‌ని గది మధ్య నిలబెట్టారు. కళ్లుమూసుకోమనగానే అతను కళ్లు మూసుకున్నాడు.

"మిస్టర్ రణధీర్! ఇప్పుడు నీకు నీ శరీరంలో జరిగే సమస్త జీవరసాయన చర్యలు కనిపిస్తాయి. నీ గుండె నీ ఎదురుగా 'డబ్‌డబ్' శబ్దవిన్యాసం చేస్తుంది. నీ మెదడు నీకు కనిపిస్తుంది. నీ వెన్నుపాములో ప్రతిక్షణం జరిగే జీవవిద్యుదయస్కాంత తరంగకేళీవిలాసం నీముందు లాస్యం చేస్తుంది. స్వరపేటికలో సప్త స్వరాల లయవిన్యాసం కనిపిస్తుంది"

సుధ కామెంటరీ చెప్పినట్లుగా ఇవన్నీ అంటోంటే అతనికవన్నీ అలాగే కనిపిస్తున్నాయి. ఎముక మజ్జలో నిశ్శబ్దంగా తెల్లరక్తకణాలు తయారయి రక్తప్రవాహంలో కలుస్తున్న జీవక్రియ కనిపిస్తోంది. వృషణాలలో వీర్యకణాల ఉత్పత్తి క్రమం కనులముందు సాక్షాత్కరిస్తోంది. ఊపిరితిత్తులలో వాయుమార్పిడి కనిపిస్తోంది.

* * *

మరమనిషి చెప్పడం ముగించాడు. ప్రేక్షకులందరూ నెమ్మదిగా ప్రస్తుతంలోనికి వచ్చిపడ్డారు. అప్రయత్నంగానే కరతాళధ్వనులు చేశారు. క్రమంగా నిశ్శబ్దం అయింది.

ఈ మరమనిషికి ఎంతటి జ్ఞాపకశక్తి ఉన్నదో వారికి అర్థం అయింది.

"ప్రియమిత్రులారా! రణధీర్ మనతో చేయి కలిపాడు. మన ప్రయోగాలలో అతనూ పాలుపంచుకొంటున్నాడు. ఇక నుంచి మన ప్రణాళిక అమలు జరుగుతుంది. ఎవరికి వారు క్రమశిక్షణతో సహకరించాలి" సుధ నెమ్మదిగా అంది.

అందరూ "అలాగే" అని ముక్తకంఠంతో ఆమోదం తెలిపారు. బాస్ లేచి వెళ్ళిపోయాక మిగతావారు నెమ్మదిగా ఒకరొకరే వెళ్ళిపోసాగారు.

క్షణాల మధ్యగల అగాథంలో క్షణక్షణం మృత్యువువైపు పరుగుపెడుతున్న జీవకణాలకు అమరత్వాన్ని, నిత్యయవ్వనాన్ని ప్రసాదించాలని శాస్త్రవేత్తల బృందం ప్రారంభించిన వినూత్న యజ్ఞం అది. నిరంతర "జీవ-కాల"లయవిన్యాసం ఈ ప్రయత్నానికి నిశ్శబ్ద సామగానం. ఇది ఆరంభం మాత్రమే అనుకోసాగారు వారు.




"ఎవరో అమ్మాయి...!" నౌకరు మాట ఇంకా పూర్తికాలేదు.

"ఎవరామె" అడగాలనుకొన్న శేఖర్ నోట పలుకురాలేదు.

స్వింగ్‌డోర్ తెరుచుకొని చాలా 'స్పీడు'గా లోపలకు వచ్చిందామె!

'స్వింగ్ డోరు' మూసుకొన్న చప్పుడుకు శేఖర్, నౌకరూ ఒకేసారి ఆశ్చర్యంగా అటు తిరిగారు.

ఆమె వైపు ఆత్రంగా, ప్రశ్నార్థకంగా చూసినా ఆమె ఏమీ మాట్లాడకుండా సరాసరి వచ్చి అక్కడవున్న ఓ సోఫాలో

కూర్చుంది. ముఖానికి పట్టిన చెమట బిందువులు ఒత్తుకొంటూ గదంతా పరికించింది.

ఏమీ మాట్లాడకుండా కనీసం తన పరిచయం అయినా చేసుకోకుండా ఇలా లోపలికి వచ్చి గదంతా పరిశీలిస్తున్న ఆమె ఆరా తీయాలని నౌకరు, శేఖర్ కూడా ఒకేసారి "మీరు..." అని ఆగిపోయారు.

ఆమె ఫకాలున నవ్వబోయి ఆగింది.

"సారీ! మీ అనుమతి లేకుండానే లోపలకు వచ్చేశాను.మీరేనా జగన్నాథ్?"

ఆమె ప్రశ్నతో శేఖర్, నౌకరు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు. ఆమె జగన్నాథ్ కోసం వచ్చిందని వారికి అర్థం అయింది. అంటే ఏదో సలహాకోరి వచ్చిందన్నమాట!

"నా పేరు శేఖర్! జగన్నాథ్ స్నేహితుణ్ణి. వాడికోసమే నేనూ అరగంట నుంచి వెయిట్ చేస్తున్నాను" శేఖర్ సమాధానం చెప్పాడు.

"నేనూ వెయిట్ చేస్తాను" అందామె.

"తప్పకుండా. నాకూ కొంత కాలక్షేపం" అని శేఖర్ రెండు కాఫీ తెమ్మని నౌకరుకు పురమాయించాడు. వాడు వెళ్ళిపోయాడు.

ఆమె గదంతామరోసారి పరిశీలించింది. అందంగా, ఆడంబరంగా అలంకరించి ఉందా గది. గోడలకు ఫ్రాయిడ్‌వంటి శాస్త్రవేత్తల చిత్రపటాలున్నాయి. ఒక వైపు అలమారానిండా మనోవైజ్ఞానిక శాస్త్ర గ్రంథాలున్నాయి. రెండవవైపుసోఫా సెట్, ఫోన్. ఎడమవైపున పడకకుర్చీ! కుడివైపు గుమ్మం. ఆమె అలా గదిని పరికిస్తుంటే శేఖర్ ఆమె శరీరాన్ని కొలుస్తున్నాడు.

ఆమె వయస్సు పాతిక సంవత్సరాలు పైన ఉంటుంది. పచ్చటి శరీరఛాయ. నునుపుతేరిన జబ్బలు.బిగుతైనవక్షోజాలు. అయస్కాంతంలాంటి చూపులు. అంత సన్నం, అంత లావూ కాని నడుము. చక్కగా రూపుదిద్దుకొన్న పిరుదులు. సన్నని పెదాలు, పెదాలకు లిప్‌స్టిక్. మెడలో ఒంటిపేట ముత్యాలహారం. చేతికి వాచి. చిటికిన వేలికి ఉంగరం. బాబ్డ్ హెయిర్.

ఆమె స్నోవైట్ శారీ కట్టింది. ఆ రంగుదే స్లీవ్‌లెస్ జాకెట్ వేసింది. కట్టు చూస్తే హిందువులాగానే ఉంది. కాని ముఖాన బొట్టులేదు.అందుకే ఆమె అందం వెలవెలపోతున్నట్లు అనిపించింది శేఖర్‌కు.

"మీ పేరు?" శేఖర్ ప్రశ్నించాడు.

"శారద" ఆమె నెమ్మదిగా చెప్పింది.

ఇంతలో నౌకరు కాఫీ తెచ్చి ఇద్దరికీ ఇచ్చాడు. ఇద్దరూ కాఫీ ముగించాక నౌకరు ఖాళీ కప్పులు తీసుకొని వెళ్ళిపోయాడు.

ఆమె ముఖంలో చెప్పరాని భయం, చూపులలో తీరని వెత ద్యోతకం అవుతూండటం శేఖర్ గమనించాడు.

"మీరేదో భయపడుతున్నట్లున్నారు"

"మీకెలా తెలుసు?" ఆమె ప్రశ్నించింది. శేఖర్ ఫకాలున నవ్వాడు. అంతలోనే తమాయించుకొన్నాడు.

"భయమో, అనుమానమో ఉన్న వాళ్ళే మా జగన్నాథ్ దగ్గరికి వస్తారు. భయం ఒక రోగం, అనుమానం ఒక రుగ్మత. అవి లేనివారికి ఇక్కడ పని లేదు. మీరూ ఆ బాపతే అయింటారు, అనుమతి కూడా లేకుండా అంత దొరవగా లోపలకు వచ్చారంటే మిమ్మల్ని పెద్ద భయమేదో వెంటాడుతోందన్న మాట!"

అతని వాగ్ధాటిని ఆమె అవాక్కయి

పించి.

"మీ వూహ నిజమే! ఈమధ్య రెండు నెలల్నుంచి నన్నెవరో నీడలా వెంటాడుతున్నారు?"

"మీ ప్రియుడా?"

ఈ ప్రశ్నతో ఆమెకు కోపం వచ్చింది. అయినా సంబాళించుకొంది.

"నేను మిసెస్ శారద రామనాథన్‌ని" అంది.

"అంటే మీరు వివాహిత అన్నమాట"

''అవును. కాని విధినన్ను వంచించింది. అన్నీ ఇచ్చిన దేవుడు నాకు తీరని లోటు కల్పించాడు. ఆయన ఆరు నెలల క్రితం మరణించారు" ఆమె కళ్ళు అశ్రుపూరితాలయాయి. గొంతు జీరపోయింది.

"వెరీ సారీ! రామనాథన్ అంటే సైన్స్ రిసెర్చ్‌స్కాలర్ రామనాథన్...అవునా?" శేఖర్ అడిగాడు.

ఆమె రుమాలుతో సన్నగా కళ్ళు ఒత్తుకొంది. పొడిగా దగ్గి గొంతు సవరించుకొంది. శేఖర్ వైపు సూటిగా చూసి-"ఆయన మీకు తెల్సా?" అని ప్రశ్నించింది.

"తెలీకపోవడమేమిటి? విజ్ఞాన శాస్త్ర ప్రపంచంలో రామనాథన్ పేరు సుపరిచితం. అతడి పరిశోధనలు గురించి చదివాను. ఒకటి రెండు సందర్భాలలో ఏవో సైన్స్ కాన్ఫరెన్సుల్లో కలిశాను. స్వల్ప పరిచయం" శేఖర్ అన్నాడు.

"అంటే మీరూ శాస్త్రవేత్తేనా?"

"అవునండీ. రహస్యాలు అన్వేషించడం నాకు సరదా. అందుకని సైన్స్ ప్రపంచంలో ప్రవేశించాను"

"మరి జగన్నాథ్‌గారితో మీ స్నేహం?"

"ఓ...అదా! వాడూ రహస్యాలు అన్వేషించేవాడే. నేనూ రహస్యాలు పరిశీలించేవాడినే. అందుకే ఈ స్నేహం" శేఖర్ సన్నగా నవ్వాడు.

''సైంటిస్టు కాకపోతే మీరు డాక్టర్ అయేవారన్నమాట'' శారద కాంప్లిమెంట్ చేస్తున్నట్లుగా అంది.

శేఖర్ బదులు చెప్పలేదు. ఆమె భయానికి కారణం తెలుసుకోవాలన్న ఆత్రం అతనిలో పెరిగింది.

"మమ్మల్ని ఎవరో నీడలా వెంటాడుతున్నారన్నారు" అతను సాభిప్రాయంగా ఆమెవైపు చూశాడు.

తన భయంఏమిటో, ఎందుకో అతనికి చెప్పాలా వద్దా అని ఆమె ముందు తటపటాయించింది. తర్వాత చెప్పాలనే నిశ్చయించుకొంది.

"మీకు ప్రేతాత్మలమీద, దయ్యాల మీద నమ్మకం ఉందా?'' శారద సూటిగా ప్రశ్నించింది.

ప్రయోగశాలలో అన్ని రకాల పరీక్షలకు నిలిచిన సిద్ధాంతాలే తారుమారవుతున్న రోజులివి. అలాంటిది ఒక ఆధునిక యువతి, సైంటిస్ట్ భార్య ఆ ప్రశ్న వేయడం శేఖర్‌కి విడ్డూరం అనిపించింది.

"శాస్త్రవేత్తగా దయ్యాల్ని, ప్రేతాత్మల్ని నేను నమ్మను. మనిషిగా వాటిగురించి ఆలోచించగలను. అంతే'' అన్నాడు శేఖర్.

"నేనూ నమ్మేదాన్ని కాను. కాని సొంత అనుభవం ఆ నమ్మకాన్ని వమ్ము చేసింది" శారద గంభీరంగా అంది. కళ్ళెదుట ఏదో అమూర్తమైన ఆకారం నిలబడిన భయం ఆమె కళ్ళలో కనిపించింది.

"హ్వాట్! సొంత అనుభవమా?





దయ్యాన్ని మీరు చూశారా?'' శేఖర్ ఆశ్చర్యం అవధులుదాటింది.

"సొంత అనుభవమే. రెండు నెలల నుంచి ప్రతి రాత్రి నాకు ఇదే పీడకల లాంటి అనుభవం. పన్నెండు, ఒంటిగంట మధ్య ఎవరో నన్ను పిలుస్తున్నారు'' శారద ఆ దృశ్యాన్ని నెమరువేసుకొంటున్నట్లు అంది.

"ఎవరు?''

''తెలియదు"

''ఆ కంఠస్వరం ఎవరిది?" శేఖర్ సవాలు.

''అదొక మిస్టరీ! ఆ ధ్వని మా ఇంటి తోటవైపునుంచి వస్తుంటుంది. ఆ కంఠం నాకు పరిచయం అయినదికాదు. కాని.." శారద అర్ధోక్తిలో ఆగిపోయింది. క్షణ కాలం నిశ్శబ్దం తర్వాత ఆమె మరల చెప్పసాగింది.

"మావారు 'శారూ!' అని పిలిచేవారు. అదీ ఏకాంతంలో ఉన్నప్పుడు మాత్రమే. మా ఇద్దరికీ తప్ప ఆ పేరు మరెవరికీ తెలీదు. కాని ఇప్పుడు ఈ అజ్ఞాత కంఠం నన్ను 'శారూ!' అని పిలుస్తోంది''

''ఆ కంఠం మీవారి కంఠంతో సరిపోలుతోందా?'' శేఖర్ ప్రశ్నించాడు.

''లేదండీ. ఆయన స్వరంవేరు. నన్ను వెంటాడుతున్న ధ్వని వేరు. అక్షరాలు మాత్రం అవే!'' ఆమె అంది.

శేఖర్ కొంచెంసేపు మౌనంగా ఆలోచించాడు. ఆమె అతనివైపే చూస్తూండి పోయింది.

''మీ ఇంట్లో ఎవరెవరుంటున్నారు?" శేఖర్ ప్రశ్నించాడు.

"నేనూ, ఆయా! ఇద్దరమే"

''పిల్లలు లేరా?''



''లేరండీ!" శారద ముఖంలో అసంతృప్తి మిళితమైన సిగ్గు కనిపించింది.

"ఆయాకు కూడా ఆ ధ్వని వినిపించిందా?''

''వినిపించింది''

''ఆ ధ్వని వినిపించినప్పుడు లేదా తర్వాత తోటలోకి వెళ్ళి పరిశీలించారా?"

"ముందు భయపడ్డాం. క్రమంగా పరిస్థితి అలవాటయింది.ఒకటి రెండుసార్లు ధైర్యంచేసి, తోటలోకి వెళ్ళి పరిశీలించాం. అక్కడ ఏ జాడలూ మాకు కనిపించ లేదు"

''అయ్ సీ. ఆ పిలుపు రోజూ వినిపిస్తోందా?''

''మొదటి నెలలో వారానికి ఒకటి రెండుసార్లు వినిపించేది.ఇప్పుడు....అంటే నెల్లాళ్ళుగా ప్రతిరోజూ వినిపిస్తోంది. దీనితో భయపడిన నేను నిద్రమాత్రలు మింగుతున్నాను''

శారద అతని ముఖంలోని భావాలు చదవాలని చూసింది. అతనిలో ఏ వికారమూ లేదు. ఆమె చెబుతున్న సంగతుల్ని శ్రద్ధగా వింటున్నాడు.

''ఇదంతా విన్నాక మీరు నన్ను పిచ్చిదాన్ని అనుకుంటున్నారా?'' శారద నిశితంగా ప్రశ్నించింది.

''నో! అలాంటిదేం లేదు. ఈ సంఘటనలకు ఎవరైనా బాధ్యులని మీరు భావిస్తున్నారా?''

"నాకేమీ తోచడంలేదు. ఎవర్నీ నిందించి ప్రయోజనం లేదుకదా"

''ఎవరికైనా ఈ సంగతి చెప్పారా?"

"ఇద్దరు, ముగ్గురు స్నేహితురాళ్ళకి చెప్పాను. వాళ్ళు నవ్వారు. నన్ను గేలి చేశారు. వాళ్ళకు నా బాధ అర్థంకాలేదు. నిన్నరాత్రి జరిగిన సంఘటనతో నేను కలతచెందాను. అందుకే జగన్నాథ్ గారి

సహాయం కోరి వచ్చాను"

"నిన్న రాత్రి ఏం జరిగింది?

"యధాప్రకారం నిన్న రాత్రి పడుకునేముందు నిద్రమాత్రలు వేసుకొన్నాను. ఆయన ఉన్నప్పుడు మా బెడ్‌రూమ్ మేడమీద. ఆయన పోయిన తర్వాత నేను కింది రూమ్‌లోనే పడుకొంటున్నాను. ఆ గదికి రెండు కిటికీలున్నాయి. అవి తోటవైపే ఉన్నాయి. నిన్నరాత్రి ఆ మాటా ఈ మాటా చెప్తూనే ఆయా నిద్రపోయింది. మాత్రలు మింగినా నాకు అంత తొందరగా నిద్ర రాలేదు. నిద్రపోదామని నేను శతవిధాలా ప్రయత్నిస్తున్నాను.

కనురెప్పలు బరువుగా ఉన్నాయి. నా మెదడు నిద్రకు ఉపక్రమిస్తోంది. శరీరం తేలికగా ఉన్నట్లనిపించింది. ఇంతలో ఆ కంఠస్వరం వినిపించింది.

తోటలోని నిశ్శబ్దాన్ని ఛేదించిన పిలుపు అది. చల్లటి గాలి తెరలమధ్య అపశ్రుతి అది.

నా కనురెప్పల్ని బలవంతంగా తెరిపించిన శబ్ద రాక్షసి అది. మెదడు పొరల్ని కల్లోల పరిచిన పిలుపు అది.

'శారూ... శారూ!' అని ఆ స్వరం తెరలు తెరలుగా చెవుల్ని ఛేదించింది. మనసుని మేలుకొలిపింది. శరీరాన్ని కంపింపజేసింది. అది ఆయన కంఠధ్వని కాదు... కాని ఆ పిలుపు ఆయనదే!

'శారూ! అయ్ లవ్‌యూ' ఆ ధ్వని మారుమోగుతోంది.

కనులు తెరిచిచూశాను. భయం నన్ను నిలువునా ఒణికించింది"

శారద హఠాత్తుగా ఆగిపోయింది.

"ఏం... ఎందుకని?"

"కళ్ళముందు కనిపించిన దృశ్యం అలాంటిది"

"ఏం కనిపించింది?"

"అది అమావాస్యరోజు. పైగాఆకాశం మేఘావృతమై ఉంది. అంచేత బయటంతా కారుచీకటి. పైగా గదిలో దీపాలు లేవు. ఒకమూల బెడ్‌లైట్ మసక వెలుతురు ప్రసరిస్తోంది. ఆ సమయంలోనే అజ్ఞాతకంఠం వినిపించింది. కళ్లు తెరవకూడదని చాలాసేపు మొండికెత్తాను. కాని ఆ కంఠధ్వనిలోని లాలన, ఆర్తి నన్ను చలింపజేశాయి. అల్లంతదూరాన ఎవరో నిలిచి నన్ను ఆహ్వానిస్తున్నారనే అనుభూతి అది. కళ్లు తెరిచాను. కిటికీ అవతల రెండు కళ్ళు మెరుస్తూ కనిపించాయి. ఆ కళ్ళు ఎర్రగా వెలుగుతున్నాయి. ఆ చూపులలో కోరిక జ్వలిస్తోంది. ఆ చూపులలోతులలోనుంచి అనూహ్యమయిన ఆర్తి వెలువడుతోంది.నేను భయవిభ్రాంత నైస్తంభించిపోయాను"

ఆమె వివరించి చెప్తూంటే శేఖర్ అవాక్కయి వింటున్నాడు. ఆమె మాటలాపింది. అతను ఆమెవేపు ఆత్రంగా చూశాడు.

"ఆ ఎర్రటి కళ్లను ఎంతసేపు చూశానో నాకు తెలియదు. నా కళ్ళుఅలసిపోయేవరకు చూశాననుకొంటాను. మెదడు మొద్దుబారిపోయేవరకు చూశానను కొంటాను.తర్వాత నాకు స్పృహ తప్పింది. మెలకువ వచ్చి చూసేసరికి ఆయా నాకు ఉపచారాలు చేస్తోంది.నేను మూర్ఛపోయానని తర్వాత ఆయా చెప్పింది.

నేను మళ్ళీ సందేహంగా, భయంగా కిటికీవేపు చూపులు సారించాను. అక్కడంతా చిక్కటి చీకటి. కనుపాప ఆ చీకటిని చీల్చలేకపోయింది. కిటికీ అవతల ఇందాకటి ఎర్రనికళ్ళులేవు.అంతా అలుముకొనిపోయిన చీకటే. నేను మంచినీళ్లు తాగాను. గుండె దడదడ తగ్గింది. మనసు

క్రమంగా కుదుటపడింది. అప్పుడు ఆయాకు జరిగిన సంగతి చెప్పాను''

"ఆమె ఏమంది?"

"నా పరిచయస్థులెవరో నన్నిలా ఏడిపిస్తున్నారంటుంది ఆమె"

''అంటే?"

"నన్ను పెళ్ళిచేసుకోవాలనుకొంటున్న వాళ్ళే నన్నిలా భయపెడుతున్నారని ఆమె భావం''

''మిమ్మల్నెవరయినా పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నారా?" శేఖర్ నిశితంగా చూశాడు.

"కాలేజీలో చదువుకొనేటపుడు విద్యాసాగర్ అనే యువకుడుండేవాడు. అతను నన్ను ప్రేమించాడు. అయితే పెళ్లయినాక అతని సంగతే మరిచిపోయాను"

"మీరు మరచిపోయారు... సరే! అతని సంగతి?"

"విద్యాసాగర్‌ని ఒక స్నేహితుడిగా మాత్రమే నేను భావిస్తున్నాను. అతను నన్ను ప్రేమిస్తున్నాడని తెలిశాక నా అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పేశాను. అతను ఆ తర్వాత నన్ను మరచిపోయాడనే అనుకొంటున్నాను. మొదట్లో అతను కొంత వ్యథచెంది ఉంటాడు. కాలం, అనుభవాలు, అవసరాలు అతనిలో మార్పుతెచ్చి ఉంటాయి. పైగా విద్యాసాగర్ విదేశాలకు వెళ్ళిపోయాడని విన్నాను"

"ఆ తర్వాత విద్యాసాగర్‌ని మీరు కలవలేదా?''శేఖర్ ప్రశ్నకి శారద కొంచెం సేపు ఆలోచించింది.

''ఈమధ్య అతన్ని కలవలేదు. కాని అతను విదేశాలనుండి వచ్చాడని విన్నాను... దట్సాల్!''

శేఖర్ ఆమె సమాధానం విని రెండు నిముషాలు మౌనం వహించాడు. కళ్ళు మూసుకుని ఏదో ఆలోచించి, ఫోన్ దగ్గరకు వెళ్ళి ఒక నంబరు తిప్పాడు. అవతలనుంచి జగన్నాథ్ పలికాడు.

''హలో...జగన్నాథ్! నేను.... శేఖర్‌ని మాట్లాడుతున్నాను. నీకోసం ఒక పేషంట్ వచ్చారు. ఎంతసేపట్లో వస్తావ్?" శేఖర్ అడిగాడు.

"అర్జంటుపనులున్నాయి. సాయంత్రం కాని రాలేను. వారిని తర్వాత కలవమను" అవతలనుంచి జగన్నాథ్ అన్నాడు.

''సరే! నేను మరలా కలుస్తా" అని అతను ఫోన్ పెట్టేశాడు.

"జగన్నాథ్‌గారు ఎంతసేపట్లో వస్తారు?" శారద అడిగింది. శేఖర్ వివరం చెప్పాడు. ఆమె నిరాశగా తల వూపింది. జగన్నాథ్‌వచ్చి, తన కష్టం విని తగిన నివారణోపాయం చెప్తాడని ఆశించిన ఆమె అంచనాలు తారుమారయ్యాయి. ఆమె ముఖంలో పేరుకొన్న నిర్లిప్తతను, అసంతృప్తిని శేఖర్ పసిగట్టాడు.

"నేను మీ ఇంటికి వచ్చి ఒకసారి అక్కడి పరిస్థితుల్ని పరిశీలించాలి... రమ్మంటారా?''

శేఖరం వేసిన ప్రశ్న శారదలో ఉత్సాహాన్ని కలిగించింది. తన బాధని, భయాన్ని అర్థంచేసుకొన్న ఒక మనిషి అందునా సైన్స్ చదివిన ఒక మగాడు లభించినందుకు ఆమె తృప్తిపడింది.

''ష్యూర్... ష్యూర్!'' అని శారద లేచింది. శేఖర్ ఆమెను అనుసరించాడు.

* * *

నగరానికి వెలుపలవుంది శారద మేడ. ఆమె భర్త రామనాథన్ భావుకుడు, రసపిపాసి, సౌందర్యోపాసకుడు. తన భావాలకు, సరదాలకు అనుగుణంగా ఆ భవనాన్ని నిర్మింపజేశాడు. మేడ చుట్టూ




తోటుంది. మెట్లు,హాలు,కారిడార్ మొజైక్ చేశారు.

శారద ముందు నడవగా శేఖర్ అనుసరించాడు. ఆమె సరాసరి తన బెడ్‌రూమ్‌లోకి తీసుకువెళ్ళింది. ఆ గదికి అటువైపు రెండు కిటికీలున్నాయి. అవి తోటవైపు తెరిచి ఉన్నాయి. శేఖర్ ఆ గదంతా కలియతిరిగాడు. సరాసరి కిటికీల దగ్గరకు వచ్చాడు. కిటికీలోనుంచి తోటలోనికి చూస్తూ "శారదగారూ! మీరు చెప్పిన ధ్వని ఈవైపునుంచే వచ్చేదికదూ" అని ప్రశ్నించాడు.

"అవును" ఆమె రెండవ కిటికీదగ్గర నిలబడి అంది.

శేఖర్ పదినిమిషాలసేపు అలా తోటలోనికే చూసి ఏమనుకున్నాడో తటాలున కిటికీలోనుండి అవతలి తోటలోకి దూకాడు. అక్కడనుంచి నేలను సునిశితంగా పరిశీలిస్తూ నడిచాడు. అలా నలభై యాభై అడుగులు నడిచి వెనకకు తిరిగి వచ్చాడు. కిటికీద్వారా మళ్లీ లోపలకు దూకాడు.

అతని చర్యల్ని ఆమె ఆశ్చర్యంగా చూస్తుండిపోయింది.

"నిన్నరాత్రి మీకు కళ్ళు ఏ కిటికీ దగ్గర కనిపించాయి?" శేఖర్ ప్రశ్న వేశాడు.

"ఈ కిటికీదగ్గర" అని శారద ఒక కిటికీ చూపింది. శేఖర్ గోడవారగా నడిచి ఆమె చూపిన కిటికీ దగ్గరకు వెళ్ళాడు. అక్కడ నిలబడి తోటలోనికి చూశాడు. అక్కడ తోటలో గడ్డి బాగా పెరిగి లేదు. తోటమాలి గడ్డి చెక్కినట్లున్నాడు... ఎర్రటినేల కనిపిస్తోంది.

శేఖర్ నిశితంగా పరిశీలించాడు.

అక్కడ నేలపై రెండు విచిత్రమైన చిహ్నాలు కనిపించాయి.

అతను వెంటనే ఆ కిటికీ దూకి అవతల పక్క నేలపై ఆ గుర్తుల దగ్గర కూర్చుని పరిశీలించాడు.

అవి మనిషి పాద చిహ్నాలవలెనే ఉన్నాయి. కాని చాలా పెద్దవిగాఉన్నాయి. పాదం పొడవు అడుగున్నర ఉంది. వెడల్పు ఎనిమిది, పది అంగుళాలుంది. అలాంటిపాదాలు మామూలు మనుషులకు ఉండవు. మరి ఈ చిహ్నాలు ఎలా వచ్చాయి. తోటమాలిదగ్గర ఇలాంటి ఆకారంలో పాత్ర ఏదైనా ఉండాలి. దానిలో అతడు ఎరువులు వంటివి తెచ్చి మొక్కలకు చల్లుతుండవచ్చు. ఆ పాత్ర పెట్టిన చిహ్నాలై ఉంటాయవి.

అయితే చాలా బరువైన వస్తువైతే తప్ప అంత బలంగా లోతుగా, స్పష్టంగా ఆ చిహ్నాలు ఏర్పడవు. కనీసం వంద నూట యాభై పౌనుల బరువున్న వస్తువైవుండాలి అది. ఏదో అసాధారణమైన వస్తువు వలనే ఆ చిహ్నాలు ఏర్పడి ఉండాలి. అదే వస్తువు?

ఆలోచిస్తున్న శేఖర్‌కి మరో సంగతి తట్టింది. శారదపై ఎటువంటి మనో వైజ్ఞానిక ప్రయోగం జరగలేదనిపిస్తోంది. ఈ వింత చిహ్నాలుచూశాక అతని భావం దృఢమైంది. కేవలం ఆమెను ఎవరో భయపెడుతున్నారంతే.

మరికొంచెం సేపు శేఖర్ ఆ పరిసరాలు పరిశీలించి లోపలకు వచ్చాడు. ఇంతలో శారద అతనికి బిస్కట్లు, కాఫీ తెచ్చింది.

అతను ఆ అల్పాహారం సేవించి, విశ్రాంతిగా కూర్చున్నాడు. శారద అతని ఎదురు సోఫాలో కూర్చుంది.

"అక్కడంతా తిరిగారు...ఎందుకు?"

"ఆ వాతావరణాన్ని పరిశీలించాను.




నేను వచ్చినపని పూర్తి అయింది" శేఖర్ నవ్వుతూ అన్నాడు.

"నా భయం తీరుతుందా?" ఆమె ఆత్రంగా అడిగింది. శేఖర్ ఈసారి పకపక నవ్వాడు.

"శారదగారూ! నేను సి.ఐ.డి.ని కాను. డిటెక్టివ్‌ని కాను. జగన్నాథ్ సాంగత్యం వల్ల ఇలాంటి పనులు అలవాటయాయి... అంతే! అంతేకాదు శాస్త్రవేత్తనవడంవల్ల ఇలాంటి పరిశీలనలు నాకు సహజం. ఇక్కడ చూసినదంతా జగన్నాథ్‌కి చెప్తాను. మనం రేపు కలుద్దాం''

శేఖర్ లేవబోయాడు.

కాఫీ ట్రే తీసుకువెళ్ళడానికి ఆయా వచ్చింది. ఆమె వయస్సు 35 లోపు ఉంటుంది. అందంకన్నా ఆకర్షణ ఎక్కువ. ఆమె ట్రే తీసుకొని వెళ్ళిపోయింది.

"ఈ ఆయా మీదగ్గర ఎన్నాళ్ళనుంచి ఉంది?"

''రెండేళ్లనుంచి" శారద సమాధానం.

''బాగా నమ్మకస్తురాలా?''

"ఆ...చాలా మంచిది. నిజాయితీపరురాలు"

"ఆల్‌రైట్! విద్యాసాగర్ ఎక్కడ ఉంటాడో మీకు తెలుసా?''

''కాలేజీలో చదివేటప్పుడే హాస్టల్లో ఉండేవాడు. అతనిదీవూరుకాదు''

''మీ కుటుంబం గురించి అతనితో ఎప్పుడైనా ఏమైనా చెప్పారా?''

"లేదు''

''మీవారు సహజ మరణం చెందారా?''

ఈ ప్రశ్నతో శారద ముఖం వివర్ణమైంది. చూపులలో కలత చెలరేగింది. అంతలోనే ఆమె తమాయించుకొంది. ఈ ప్రశ్న ఎదురవుతుందని ఆమె వూహించలేదు.

''ఆయన పోవడం మా కుటుంబానికి తీరని వెత. అదొక దుర్ఘటన" ఆమె నెమ్మదిగా అంది.

''ఆయన సహజ మరణం పొందారా?" శేఖర్ రెట్టించి అడిగాడు.

శారద దీర్ఘంగా శ్వాసతీసుకొంది. ఆమె కనులలో అనాటి సంఘటన కదలాడుతోంది.

''ఆయన పోవడానికి ఒక వారం రోజులు ముందువరకు బాగానే వున్నారు. ఒకనాటి సాయంత్రం తల బరువుగా, దిమ్ముగా ఉందన్నారు.సీజన్‌మారిందికదా రొంపపడుతుంది అనుకొన్నాము.డాక్టర్‌కి చూపించాను. ఆయన మందేదో ఇచ్చారు. నాలుగురోజులు మామూలుగానే గడిపారు. అయిదోరోజు ఉదయం ఆయన్ను లేపుదామని ప్రయత్నించాను. లేవలేదు. ఆయనలో చలనం లేదు. భయపడి డాక్టర్‌కి ఫోన్‌చేశాను. ఆయన వచ్చి పరీక్షించాడు. 'మాసివ్ హార్ట్ ఎటాక్'వల్ల ఆయన మరణించినట్టు ఆయన చెప్పాడు"

ఈ మాటలు అని శారద కళ్ళనీళ్ళు పెట్టుకొంది. శేఖర్ ఆమె విషాదవదనాన్ని చూడలేకపోయాడు. కొంచెంసేపు ఇద్దరి మధ్యా కాలం భారంగా సాగింది.

''రామనాథన్ మిమ్మల్ని పూర్తిగా విశ్వసించేవారా?'' శేఖర్ ప్రశ్న ఆమెను కుదిపింది.

''అంటే...?''

''ఆయన వ్యక్తిగత విషయాలన్నీ మీకు చెప్పేవారా?''

''నాకు తెలిసినంతవరకు ఆయన ఏ విషయాన్ని ఎప్పుడూ దాచలేదు''

"ఆల్‌రైట్! విద్యాసాగర్ స్వదేశానికి

వచ్చినట్లు మీకెవరు చెప్పారు?"

"గుర్తులేదు. సూపర్ బజార్‌లో కలిసిన ఎవరో పాత స్నేహితురాలు చెప్పిందను కుంటాను. ఖచ్చితంగా చెప్పలేను"

"ఇంక నేను వెళతాను" శేఖర్ లేచాడు.

"నన్నేం చేయమంటారు?" తన భయం ఎలా తీరుతుందని ఆమె ప్రశ్నలోని అంతరార్థం.

"ఆ కంఠ ధ్వని, ఆ కంటి చూపులు పగటిపూట మిమ్మల్ని వెంటాడి, భయ పెట్టడం లేదా?"

"పగలు ఆ ధ్యాసే ఉండదు ... రాత్రిపూటే నరకం అనుభవిస్తున్నాను" శారద నిస్సహాయంగా అంది.

"అయితే ఇవాళ రాత్రి నేను మీకు సాయం ఉంటాను. ఆ కంఠస్వరం వింటాను"

"సరిగా ఎన్ని గంటలకు వస్తారు?"

"ఎన్ని గంటలకు రమ్మంటారు?"

"భోజనానికి ఇక్కడకు రండి"

"వీల్లేదు. జగన్నాథ్‌తో డిన్నర్ చేసి పది పదకొండు మధ్య వస్తాను ...ఓకే" శేఖర్ వెళ్ళిపోయాడు.

సగం భయం తీరినట్లు శారద ఊరట చెందింది.

* * *

ఖరీదైన ఆ హోటల్ డైనింగ్‌రూమ్‌లో గుడ్డి వెలుతురు ప్రసరిస్తున్న దీపాల వెలుగు-నీడలలో మనుషులు ఆకొన్న పులుల్లా ఆహార పదార్థాలు సేవిస్తున్నారు.

ఒకవైపు మాంసాహారులు, మరొక వైపు శాకాహారులు, మధ్యగా ఉభయా హారులు. వంకాయ కూరలో కోడిమాంసం రుచిని అనుభవిస్తున్నవారు కొందరు. మేక కార్జంలో చివరి వరకు మసాలా రుచి పీలుస్తున్నవారు మరికొందరు.

సాంబారూ అన్నం కలుపుకొనితింటూ ఎదురుగా నాలుగు వరసల అవతల కూర్చున్న అమ్మాయి అందం తాగు తున్న బ్రహ్మచారి ఒకడు. ఆ పైవరసలో తెల్లగులాబిలావున్న పంజాబీడ్రెస్ ప్రౌఢపై కనుదోయి నిలిపిన మధ్యవయస్కుడిం కొకడు. వేరువేరు ఆకారాలు. వేరువేరు ఆలోచనలు. వేరువేరురుచులు,అభిరుచులు.

అందరికీ దూరంగా శేఖర్, అతనికి ఎదురుగా కుర్చీలో జగన్నాథ్. ఇద్దరి ముఖాలమీద లైటు వెలుగు. ఒకరిలో ఆత్రం. రెండవవారిలో జిజ్ఞాస. ఎవ్వరూ మాట్లాడటంలేదు. ఇంతలో బేరర్‌వచ్చాడు. శేఖర్ మెనూ కార్డు చూసి ఆర్డర్ ఇచ్చాడు. బేరర్ వెళ్ళిపోయాడు.

"ఆ అమ్మాయి ఎవరు?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"అమ్మాయి కాదు"

"మరి ఈ ఘోటక బ్రహ్మచారిగారు ఎందుకు వెంటబడ్డారట!"

"నేనేం వెంటపడలేదు. ఆవిడే నా దగ్గరకు వచ్చింది. అపుడు అక్కడ నేను ఉన్నాను"

"ఇంతకీ ఎవరామె?"

"ప్రసిద్ధ యువశాస్త్రవేత్త రామనాథన్ భార్య"

"అతను పోయాడుగా!"

"అవును...అతనేవుంటే ఆమె మన దగ్గరకు ఎందుకు వస్తుంది?"

"ఆ!"

"అదే...మన సహాయం ఎందుకు కోరుతుంది?"

"అసలేమైందట?"

"ఆ సంగతి చెప్తాను. కాని ముందు ఓ ప్రశ్న?"

 

"ఏమిటో?"

"నువ్వు దయ్యాల్నీ, భూతాల్నీ నమ్ముతావా?"

శేఖర్ ఈ ప్రశ్నవేసి జగన్నాథ్ ముఖంలోకి, అతని విశాలనేత్రాల లోతు లోనికి చూడసాగాడు.

"నమ్మకం సంగతలా ఉంచు. కొన్ని అతీంద్రియశక్తుల్ని వైజ్ఞానికులు ఇ.ఎస్.పి అంటారు. జీవరసాయనాలసంపుటి అయిన మనిషి శరీరానికి, మెదడుకు అంతటి విలక్షణశక్తి ఉన్నప్పుడు 'ప్రేతాత్మ'ను విశ్వసించడంలో ఆశ్చర్యం లేదేమో"

''సిద్ధాంత చర్చ తర్వాత! సరేగానీ ప్రతిరోజూ అర్ధరాత్రి నువ్వు ఒంటరిగా ఉన్నప్పుడు ఏ ప్రేతాత్మో నిన్ను పిలిస్తే, అగ్నిగోళాల్లా జ్వలించే రెండు కళ్ళు నీవైపే చూస్తుంటే నీవేం చేస్తావ్?''

''వెంటనే చచ్చిపోతాను" అని జగన్నాథ్ ఆ సీరియస్ వాతావరణాన్ని సడలించాడు.

ఇంతలో బేరర్ భోజనం తెచ్చి అక్కడ సర్ది వెళ్ళిపోయాడు.

"భోజనం చెయ్యి'' జగన్నాథ్ అన్నాడు.

"చేస్తా కాని ... ఈమధ్య అతి దారుణాలు జరిగాయి''

''ఏమిటవి?''

''ఇదిగో... ఈ లిస్టు చూడు'' అని శేఖర్ ఒక జాబితాను జగన్నాథ్ ముందు పెట్టాడు. అది శేఖర్ రాసిన జాబితా. అందులో ఇలా ఉంది.

ఇంగ్లండ్: జాన్‌డగ్గస్ అనే శాస్త్రవేత్త మరణించాడు. విన్‌స్టన్‌విల్లీ అనేశాస్త్రవేత్త అదృశ్యం అయ్యాడు.

జర్మనీ: హుర్‌గోల్బ్జ్ అనే శాస్త్రవేత్త విషాదాంతం. రేనాల్డ్ సేవలాక్ అదృశ్యం.

ఇండియా: డాక్టర్ వెంకట్రావు అపహరణ. డాక్టర్ రామనాథన్ మృతి.

ఫ్రాన్స్: డాక్టర్ మైఖేల్‌సన్ దుర్మరణం. డాక్టర్ పెయిరీ అదృశ్యం.

''ఏమిటీ... ఇలా రాశావు?" జగన్నాథ్ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"నేను సైంటిస్ట్‌ని కదా! అందుకని ప్రపంచంలో ఎక్కడ ఏ యువశాస్త్రవేత్త ఏం చేస్తున్నా, అలాగే వాళ్ళకేం జరిగినా నోట్ చేస్తుంటాను. ఈ లిస్టులో ఓ విచిత్రం ఉంది. రెండేళ్ళలో ఏదేశాలకు చెందిన ఆరుగురు శాస్త్రవేత్తలలో ముగ్గుర్ని అపహరించారు. ముగ్గురు అనుమానాస్పద పరిస్థితిలో మరణించారు. భారతదేశంలో ఒకరు అపహరించబడ్డారు. మరొకరు మరణించారు. మరణించిన వారందరూ గుండెపోటుతోనే అంతిమశ్వాస తీసుకొన్నట్లు వార్తలు వచ్చాయి. ఇదంతా పరిశీలిస్తే నాకోఅనుమానం కలుగుతోంది. ఈ శాస్త్రవేత్తల్ని ఎవరోగానీ ఒక పథకం ప్రకారం చంపారనీ, ఒక వ్యూహం ప్రకారం అపహరించుకొనిపోయారనీ" శేఖర్ ఆ కాగితం మడిచి జేబులో పెట్టుకొన్నాడు.

"శారద కథ" జగన్నాథ్ అడిగాడు. భోజనం చేస్తూ శేఖర్ 'ఆమె భయం, తాను ఆ ఇంటి తోటలో చూసిన విశేషాలు వివరించాడు. జగన్నాథ్ అతను చెప్పిన సంగతులు శ్రద్ధగా విన్నాడు.

"అయితే ఈ రాత్రి నీ అన్వేషణ అక్కడన్నమాట" అన్నాడు జగన్నాథ్ భోజనం ముగిస్తూ.

"అవును. శారదను భయ విభ్రాంతం చేస్తున్న ఆ ప్రేతాత్మ ఏమిటో పరిశీలిస్తాను. రేపు నిన్ను కలుస్తాను" శేఖర్

పట్టుదలగా అన్నాడు.

"గో ఎహెడ్! శాస్త్రవేత్తల మృతి, అపహరణ గురించి నేనూ ఆలోచిస్తాను" జగన్నాథ్ లేచాడు.

"ఇన్నాళ్ళకు నా ఆలోచనకు విలువ ఇచ్చావు నువ్వు" శేఖర్ లేచాడు.

ఇద్దరూ కలిసి బిల్లు చెల్లించి బయట పడ్డారు.



## 3

శారదకిచ్చిన మాట ప్రకారం శేఖర్ వచ్చాడు. ఇద్దరూ చాలాసేపు హాలులో కూర్చుని రకరకాలవిషయాలపై మాట్లాడుకొన్నారు. అయితే ఎక్కడ ఏ అంశం మొదలైనా చివరికి ప్రేతాత్మలు, దయ్యాలు, భూతాలు దగ్గరకు చేరేది. ఎంత వద్దనుకొన్నా మాటలు అక్కడకే వచ్చి ఆగేవి.

దయ్యం ప్రసక్తి వచ్చినప్పుడల్లా శారద ముఖంలో భయం, విహ్వలత కొట్టవచ్చినట్లు కనిపించేది. వారి కబుర్లలోనే గడియారం పదకొండున్నర కొట్టింది. అప్పటికే ఆయా నిద్రపోయింది. శారద ఒకటి, రెండుసార్లు ఆవులించింది. ఇవాళ ఆమెలో రోజూ ఉన్నంత భయం లేదు. శేఖర్ దగ్గర ఉన్నాడన్న భరోసా ఆమెలో కొంత ధైర్యాన్ని ప్రోది చేసింది.

"ఇంక మీరు పడుకోండి" శేఖర్ లేచాడు.

"మరి మీరు?" శారద ప్రశ్నించింది.

"నేను తోటలోకి వెళ్ళి పరిశీలిస్తాను. మీకే భయం అక్కరలేదు...నిశ్చింతగా పడుకోండి" అని శేఖర్ లాంగ్‌కోట్ వేసుకొని, తలుపు తీసుకొని తోటలోనికి వెళ్ళిపోయాడు.

శారద అలవాటు ప్రకారం నిద్ర మాత్రలు మింగి పక్కమీద వాలింది. ఆమె ఎదురుగా మడత మంచం మీద ఆయా గుర్రుపెట్టి నిద్రపోతోంది. శారద కొద్ది సేపట్లోనే నిద్రపోయింది.

బయట అంతా చీకటి. శీతాకాలం కావడంవల్ల చలి ఎక్కువగానే ఉంది. సన్నగా మంచు కూడా పడుతోంది. శేఖర్ చెవుల దాకా మఫ్లర్ చుట్టుకొని తోటలోని ఒక చెట్టు కింద దాగొన్నాడు. అతను వేసుకొన్న నలుపు 'లాంగ్‌కోట్ చీకటి రంగులో కలిసిపోయింది. అక్కడ మనిషి ఉన్నట్లే అనిపించడంలేదు. అతనికి ఎదురుగా శారద పడక గది కనిపిస్తోంది. గదిలో మసక వెలుతురు ఉంది. కిటికీల కర్టెన్లు తెల్లగా కనిపిస్తున్నాయి. ఏ చిన్న శబ్దం అయినా వినిపించేటంత నిశ్శబ్దం. ఏ చిన్న వెలుగైనా బ్రహ్మాండంగా కనిపించేటంత చీకటి. శేఖర్ నిరీక్షిస్తున్నాడు.

గడియారం స్తంభించినట్లుంది. కాలం కదులుతున్నట్లు లేదు. కదులుతున్నా అది కుంటివాడి నడకలా ఉంది. సెకన్లు నిమిషాల్లా, నిమిషాలు గంటల్లా కదులుతున్నట్లుంది. దూరంనుంచి టవర్ క్లాక్ పన్నెండుగంటలు కొట్టిన చప్పుడయింది.

శేఖర్‌లో ఆత్రం పెరిగింది. ప్రతి రోజు క్రమం తప్పకుండా శారదకు వినిపించే ఆ కంఠధ్వని ఏది? ఆమెను నిన్న రాత్రి భయపెట్టిన అగ్నిగోళాలవంటి

ఆ కళ్ళు ఏవీ??

చిరుగాలికి ఆకుల చప్పుడు, కీచు రాళ్ళ గీశబ్దం తప్ప మరో ధ్వని ఏమీ వినిపించడమే లేదు. ఒకటి అరా మిణుగురు పురుగులు ఎగురుతున్న కాంతి తప్ప భయపెట్టే దయ్యం కళ్ళ కాంతి ఏమీ కనిపించడం లేదు. అతనిలో ఆత్రానికి బదులు ఆలోచన పెరిగింది.

ఒకవేళ శారద పిచ్చిది గానీ కాదు కదా? రోజూ సరిగా పన్నెండు గంటలకు తనను ఆ కంఠ ధ్వని విపరీతంగా భయ పెడుతోందని చెప్పిన ఆమె ఇవాళ అంత నిశ్చింతగా ఎలా నిద్రపోతోంది? దయ్యాల్ని నమ్మని తను వెర్రివాడై ఇలా రావడమేమిటి? ఆమె అందంవైపు తాను ఆకర్షితుడైనాడా? తనకు ఆడవాళ్ళని ఆకర్షించే తెలివితేటలు లేవని ఎన్నోసార్లు రుజువైంది. మరిప్పుడు ఇలా రావడం, అర్ధరాత్రి, ఈ చలిలో ఈ నిరీక్షణ? పీటికర్థం ఏమిటి? దయ్యాల్ని, ప్రేతాత్మల్ని తను నమ్మకపోయినా ఆ కిటికీ దగ్గర కనిపించిన విచిత్రమైన అడుగుజాడల సంగతేమిటి? అవి ఎవరివి?ఆ ఆచూకీ తీయాలన్న తపనతోనే తను ఈ అన్వేషణకు వచ్చాడు. వాటి ఆచూకీ తీస్తే రెండు ఉపయోగాలు ఉంటాయి. శారదను వంచించి, భయ పెడుతున్నవారి బండారం బట్టబయలవు తుంది. ఇది మొదటి ఉపయోగం. దయ్యాలు లేవని తను చేస్తున్న వాదన బలపడుతుంది. ఇది రెండవ ప్రయోజనం. అందుకైనా తాను ఓరిమితో వేచి ఉండాలి. శేఖర్ గడియారం వైపు చూశాడు. రేడియం ముల్లు 12 గంటల 45 నిమిషాలు చూపిస్తున్నాయి. సెకన్ల ముల్లు నిలిచిపోయినట్లుంది. అది చలించడం లేదని అతను నిర్ధారించుకొన్నాడు. ఆశ్చర్యంగా గడియారం చెవిదగ్గర ఆనించి వినాలని ప్రయత్నించాడు.

ఇంతలో గదిలోనుంచి భయంకరమైన కేక వినిపించింది. అతను కళ్ళు అటు తిప్పి చూశాడు. అంతే! నిశ్చేష్టుడయాడు. రెప్పపాటు మరిచిపోయాడు. అక్కడ ఎర్రటి రెండు కళ్ళు మెరిశాయి. గబగబ ఎవరో పెద్ద పెద్ద అంగలు వేసిన చప్పుడయింది. శేఖర్ ముందుకు రెండడుగులు వేశాడు. అంతే! స్పృహ తప్పి పడిపోయాడు.

క్షణాలు సెకనులయాయి. సెకనులు నిమిషాలయాయి. నిమిషాలు గంటగా మారాయి. ఆకాశం, నక్షత్రాలు స్థానాలు కదిలాయి. మంచు తగ్గింది. శేఖర్‌కు మెలకువ వచ్చింది. అతను వెంటనే గడియారం వైపు చూశాడు. సరిగా కనిపించలేదు. జేబులోంచి టార్చి తీసి వెలిగించి, టైము చూశాడు. రెండున్నర కావస్తోంది. అంటే తను దాదాపు గంటన్నరసేపు స్పృహ కోల్పోయి ఉన్నాడన్నమాట.

శేఖర్ లేచి నిలబడ్డాడు. టార్చిలైటు వెలుతురులో గబగబ అడుగులు వేస్తూ కిటికీ దగ్గరకు వచ్చాడు. ఆశ్చర్యం! కిటికీ ఇనుప ఊచలు వూడి పడివున్నాయి గబగబ లోపలకు వెళ్ళాడు. అక్కడ మంచం మీద శారద లేదు. ఆయా మంచం వైపు చూశాడు. ఆమె చలనం లేకుండా పడి ఉంది. దగ్గరగా వెళ్ళి పరిశీలించాడు. ఆమె చచ్చిపోయింది. శేఖర్‌లో భయం, ఆశ్చర్యం, ఆసక్తి ముప్పిరిగొన్నాయి.

తడబడుతున్న కాళ్ళతోనే అతను





శారద కోసం ఇల్లంతా గాలించాడు. ఆమె ఎక్కడా కనిపించలేదు. పైగా ఇంటి వెనక ఇనుప గేటు వూచలు వూడి పడి ఉన్నాయి. ఆ ప్రాంతం అంతా ఏదో విచిత్రమైన వాతావరణంలా తోచింది శేఖర్‌కి.

అతను హాలులోని ఫోన్ దగ్గరకు వచ్చాడు. ఒక నంబరు డయల్ చేశాడు. అవతలనుంచి జగన్నాథ్ కంఠంఆవులిస్తూ వినిపించింది. గబగబ అతనికి సంగతి వివరించి, వెంటనే రమ్మని చెప్పాడు. ఫోన్ పెట్టేసి మరల రిసీవర్ ఎత్తి మరొక నంబరు డయల్ చేశాడు. అది పోలీసు కంట్రోల్ రూమ్. శేఖర్ వివరం చెప్పి,వెంటనేతగిన సన్నాహాలతో రమ్మని చెప్పాడు.

శేఖర్ ఆ మేడచుట్టూ లైట్లు వేశాడు. కారిడార్‌లోనికి వచ్చి నిలబడ్డాడు. అంత వరకు జీమూతాల్లా ఉన్న చెట్లు . దీపాల కాంతికి ఆకుపచ్చటి కాంతులు వెదజల్లుతూ అందంగా మెరుస్తున్నాయి. ఇంకో విచిత్రం శేఖర్ దృష్టిని విపరీతంగా ఆకర్షించింది.

తాళంవేసిన గేటు కూడా ముక్కలుగా విరిగిపడి ఉంది. ఇనుప వూచలు కరిగి నట్లున్నాయి. శేఖర్ గేటుదగ్గరకు పరుగున వచ్చాడు. ఇనుపగేటు వూచల్ని గ్యాస్ కటింగ్ సాధనంతో కరిగించినట్లు తోచింది అతనికి. అయితే ఆ పనిచేయ డానికి కొంత వ్యవధి కావాలి. పరికరాలు కావాలి. ఎవరైనా పనికట్టుకొని వచ్చి వాటిని కోయాలి: కాని మనిషి వచ్చి ఆ చువ్వల్ని కోసిన జాడలేమీ అక్కడలేవు. మరి ఇదంతా ఎలా జరిగింది?

అతనికి అంతుపట్టలేదు. ఇంతలో జగన్నాథ్ స్కూటర్ మీద దిగాడు. శేఖర్ అతన్ని చూడగానే ఎదురువెళ్ళి సంగతంతా వివరంగా చెప్పి హాలులోనికి తీసుకువచ్చి కూర్చుండబెట్టాడు. జగన్నాథ్ సిగరెట్ వెలిగించుకొని దీర్ఘంగా ఆలోచిస్తుండిపోయాడు.

"ఇది దెయ్యంపని అని నేననుకోవడం లేదు'' శేఖర్ అన్నాడు.

''మరి నీ అభిప్రాయం ఏమిటి?" జగన్నాథ్ ప్రశ్న.

''ఇది అణుశక్తి ప్రయోగం ద్వారా జరిగిన భీభత్సం. అణుశక్తి ద్వారానే ఇనుప చువ్వల్ని కరిగించే అధికోష్ణం ఉత్పన్నం అవుతుంది''

''ఎలా చెప్పగలవు?"

"ప్రస్తుతం నా అంచనా విను. నేను ఆ చెట్టుదగ్గర నిలబి ఉన్నాను.హఠాత్తుగా నా రిస్టువాచి ఆగిపోయినట్లు గుర్తించాను. ఇంతలో గదిలో నుంచి శారద అరుపు వినిపించింది. అటు వెళ్ళబోయాను. నా గుండె స్పందన ఆగినట్లనిపించింది. మెదడు స్తంభించినట్లు ఫీలయ్యాను. అడుగు కదపలేకపోయాను. క్షణకాలంలో స్పృహ కోల్పోయాను. మెలకువ వచ్చి చూసేసరికి మంచంమీద శారదలేదు. ఆయా చచ్చిపోయి ఉంది. అణుశక్తి ప్రసారం జరిగినప్పుడు ఇటువంటివి జరుగుతాయి"

"అణుబాంబు గురించి విన్నాం కాని, ఇలా సూక్ష్మప్రమాణంలో అణుశక్తి పాతం గురించి తెలియదే. అణుశక్తిని ఇలా తక్కువ మోతాదులో ప్రసరింపజేసే సాధనం ఏదైనా వచ్చిందా?"

"అలాంటి అణుపిస్తోలు తయారై ఉండాలి! అవసరమైనంతమేరకే అణు ధార్మికశక్తిని ప్రసరించే పిస్తోలన్నమాట అది. నేను ఆ ధార్మికశక్తి ప్రసారం

పరిధికి వెలుపల ఉన్నాను కనక బతికి బయటపడ్డాను. లేకపోతే నేనూ ఆ శక్తి ప్రసరించిన విషకీలలకు చచ్చిపోయి ఉండేవాడిని" శేఖర్ భారంగా నిట్టూర్చాడు.

ఇంతలో పోలీసు వ్యాన్ వచ్చింది. ఫోరెన్సిక్ వ్యాన్ దానివెనక వచ్చి ఆగింది.



బిలబిలమంటూ పోలీసులు, నిపుణులు దిగారు. కెమేరామన్ ఫొటోలు తీయనారంభించాడు. పోలీసులు అంతా గాలించసాగారు.

పోలీసు ఉన్నతాధికారి ఒకరు శేఖర్, జగన్నాథ్‌ల వద్దకు వచ్చారు. ఆయనకు శేఖర్ జరిగినదంతా వివరించాడు.

ఫోరెన్సిక్ నిపుణులు తమ పని పూర్తిచేశారు. ఫొటోలు తీశారు. రేడియేషన్ ఎక్స్‌పర్ట్ ఒకరు గైగర్ కౌంటర్ పెట్టి పరిశీలించారు. కిటికీదగ్గర, గదిలోనూ రేడియో ధార్మిక శక్తి ప్రసారం జరిగినట్లు ఆ కౌంటర్‌లో ముల్లు స్పష్టంగా చూపింది. ఆయా శరీరం మీద దానిని పెట్టారు. అప్పుడు కూడా గైగర్ కౌంటర్ ముల్లు గిరగిరా తిరిగింది. శేఖర్ దానిని తన మెడలో వేసుకొని చూశాడు. ముల్లు

కొద్దిగా కదిలింది. అంటే అతనిపై కూడా స్వల్పంగా రేడియోధార్మికశక్తి ప్రసరించిందన్నమాట.

పోలీసువారి పనులన్నీ అయ్యాయి. ఆయా శవాన్ని వ్యాన్‌లోనికి తరలించారు. ఇక ఎవరికివారు వెళ్ళిపోవాలి.

"ఈ వార్త పత్రికలలో ప్రచురించకూడదు" జగన్నాథ్ అన్నాడు పోలీసాఫీసరుతో. ఆయన "అదేమిటి? ఇంత జరిగాక ఈ విచిత్రం బయటి ప్రపంచానికి తెలియకపోతే ఎలా?" అన్నారు.

"వార్తవేయడం సులభమేకాని, ఆతర్వాత ప్రజల్ని, వచ్చే వేనకు వేల ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వలేక మనం చావాలి. అదీకాక శారద ఏమైంది? అణుపిస్తోలు ద్వారా రేడియో ధార్మికశక్తిని ప్రసరించినవారెవరు? ఈ ప్రశ్నలకు జవాబులు మనదగ్గర లేవు" జగన్నాథ్ అన్నాడు.

"మనం వార్త ప్రచురించకపోయినా ప్రజలకు తెలుస్తుంది. ఈ గేటు ఇలా విరిగి కరిగిపోవడం, ఆ పక్కగోడలకు పడిన చిల్లులు" పోలీసాఫీసర్ అర్ధోక్తిలో ఆగాడు.

"మీ పోలీసుబలగాన్ని ఉపయోగించి రాత్రికి రాత్రే మరమ్మత్తులు చేయించి, ఎవరికీ ఏ అనుమానంరాకుండా చేయండి.. దట్సాల్!" జగన్నాథ్ అన్నాడు. ఇంత ఖరాకండిగా తమకు ఆదేశాలు ఇస్తున్న అతను ఎవరా అని పోలీసాఫీసర్ ప్రశ్నార్థకంగా చూశాడు.

ఆయన ఆంతర్యాన్ని గుర్తించినట్లు, జగన్నాథ్ తన పాంటు జేబులోంచి ఒక అయిడింటిటీ కార్డు తీసి అందించాడు. దానిమీద ఇలా ఉంది–

"ఆర్. జగన్నాథ్, సి.బి.ఐ."





పోలీసాఫీసరు జగన్నాథ్‌కి శాల్యూట్ చేశాడు. తెల్లవారేలోగా పనులన్నీ పూర్తి చేయిస్తానని హామీ ఇచ్చాడు.

జగన్నాథ్ శేఖర్‌ని స్కూటర్ ఎక్కించుకొని తన ఇంటికి చేరాడు. ఇద్దరూ వేడి వేడి కాఫీ సేవించారు.

"ఇంకపడుకో!" జగన్నాథ్‌అన్నాడు.

"నాకు నిద్రరావడంలేదు. బుర్రనిండా ఆలోచనలు, మెదడునిండా తీరని సందేహాలు. మధ్య మధ్య కొన్ని అంచనాలు. ఇంక నిద్రేం వస్తుంది"

"అయితే కబుర్లు చెప్పుకొందాం?"

"కబుర్లు కాదు. శారద అదృశ్యం కావడం, అణుధార్మికశక్తిప్రసారం, వీటి వెనుక శక్తుల గురించి ఆలోచించాలి" శేఖర్ అన్నాడు.

"ఆల్ రైట్!" జగన్నాథ్ ఒకసోఫాలో కూర్చున్నాడు. అతనికి ఎదురుగావున్న సోఫాలో శేఖర్ ఉన్నాడు.

ఇద్దరూ నిమిషకాలం ఒకరినొకరు సాభిప్రాయంగా చూసుకొన్నారు.

"ఇదంతా ఏదో కుట్ర అని నా విశ్వాసం" శేఖర్ ప్రారంభించాడు.

"ఎలా చెప్పగలవు?" జగన్నాథ్ ప్రశ్న.

"శాస్త్రవేత్తల్ని అపహరిస్తున్నారు. లేదా చంపివేస్తున్నారు. ఇదివరకు కూడా ఇలాగే జరిగింది"

"ఎక్కడ? ఎవరిని??"

"డాక్టర్ వెంకట్రావ్ అనే గణిత శాస్త్రవేత్తని అపహరించుకొనిపోయారు. అతను అసాధారణమయిన మేధావి. నేను అతని పరిశోధనా వివరాలు కొన్ని చదివాను. అతన్ని కలవాలనుకొన్నాను. ఈలోగానే అతను అదృశ్యం అయ్యాడు"

"అతను సేఠ్ చందన్‌లాల్‌కి మంచి మిత్రుడు కదూ!"

"అవును. చందన్‌లాల్ పెద్ద స్మగ్లర్. అతనికి బోలెడు బలగం ఉంది. పలుకుబడి ఉంది. కొందరు మంత్రులు కూడా అతని చేతిలో ఉన్నారు. అతనే వెంకట్రావ్‌ని అపహరించి, ఎవరికో అప్పగించివుంటాడు. అతనే శారద భర్త, విజ్ఞానశాస్త్రవేత్త రామనాథన్ చంపించి వుంటాడు. ఇప్పుడు శారదను అపహరించుకొనిపోయి వుంటాడు"

"నీ ఆరోపణలకు ఆధారాలేమిటి?

"కొన్ని వాస్తవాలు! మరికొన్ని అంచనాలు!"

"అవేమిటని?"

"వెంకట్రావ్ అదృశ్యం అయాక అతని పరిశోధనా పత్రాలకోసం నేను అన్వేషణ ప్రారంభించాను. చందన్‌లాల్ దగ్గర కొన్ని పత్రాలు దొరికాయి. అయితే అవి అసంపూర్ణంగా ఉన్నాయి.' మధ్య మధ్య కొన్ని కాగితాలు లేవు.. చివరి కాగితాలులేవు. అంటే వెంకట్రావ్ ఆమధ్య కాగితాల్ని ఎక్కడో దాచివుండాలి. అతని పరిశోధన పూర్తి అయివుండదని నేను వూహించాను. వెంకట్రావ్ చెల్లెలు సరళ ఉంది. ఆమె దగ్గరకువెళ్లాను. వచ్చినపని చెప్పాను. ఆమె ఎవరో వచ్చి ఆ కాగితాలు అడిగి తీసుకువెళ్లారని చెప్పింది. పైగా వేయిరూపాయలు ఇచ్చారని చెప్పింది. వచ్చినవాళ్ళ రూపురేఖల్ని ఆమె తనకు గుర్తున్నంతవరకు చెప్పింది.

నేను ఆ తర్వాత కొంత అన్వేషణ చేశాను. రిటైర్డ్ కెప్టెన్ సుందర్‌రాయ్ ఆ కాగితాలు సంపాదించినట్లు తెలిసింది. ఆయన చందన్‌లాల్‌కి సన్నిహితుడు. వీళ్లంతా ఒక ముఠాగా ఏర్పడి ప్రజల కళ్లు, ప్రభుత్వం కళ్లుకప్పి శాస్త్రవేత్తల్ని స్మగ్లింగ్ చేస్తున్నారని అందులో భాగంగానే డాక్టర్ రామనాథ్‌ని చంపారని నా అనుమానం"

"మరి శారదను అపహరించడం దేనికి?"

"ఈమాత్రం వూహించలేవా? రామనాథన్ పరిశోధనారహస్యం ఏదోశారదకు తెలిసివుంటుంది. అది రాబట్టుకోవడానికే ఆమెను ఎత్తుకొనిపోయివుంటారు"

జగన్నాథ్ ఆశ్చర్యంగా విన్నాడు.

"విజ్ఞాన విశేషాల్ని, శాస్త్రవేత్తల జీవిత వివరాలను, వారి పరిశోధనాంశాలను కూలంకషంగా తెలుసుకోవడం నీ హాబీ అనుకొన్నాను. కాని ఇంత ఆలోచనచేస్తావని వూహించలేకపోయాను"

"నీతో స్నేహం చేసిన ఫలితం ఇది"

"నీ అనుమానాలు గురించి ఇన్నాళ్ళూ నాతో ఎందుకు చెప్పలేదు?" జగన్నాథ్ అడిగాడు.

"ఆ అవసరం, అవకాశం ఇప్పుడే వచ్చాయి. ఇంతకుముందు చెప్పినా నువ్వు నా మాటలకంత విలువ ఇచ్చేవాడివి కాదేమో! శారద ఇంటి దగ్గర సంగతులు నీకూ కొంత ఆసక్తిని రేకెత్తించి ఉంటాయి. అందుకే ఇంత వోపిగ్గా ఈ సంగతులు విన్నావు"

"మన కర్తవ్యం ఏమిటంటావ్?"

"శాస్త్రవేత్తల ప్రాణాలతో, వారి జీవితాలతో చెలగాటాలాడుతున్న చందన్‌దాస్ ముఠా ఆట కట్టించడం" శేఖర్ పట్టుదలగా అన్నాడు.

"ఆల్ రైట్! ఇక ఈ రహస్యం వెల్లడి అయ్యేవరకు మనిద్దరం కలిసి పనిచేద్దాం. యూ ఆర్ మై అన్ అఫీషియల్ అసిస్టెంట్!" జగన్నాథ్ సోఫాలోంచి

లేచివచ్చి శేఖర్ భుజాలు కుదిపి ప్రశంసా పూర్వకంగా అన్నాడు.

శేఖర్ కళ్ళలో వింతకాంతి వెలిగింది.

* * *

శేఖర్ తన రూమ్‌లో కూర్చుని రామనాథన్‌కు సంబంధించిన డైరీలు, ఉత్తరాలు పరిశీలిస్తున్నాడు. అవన్నీ అతను వాళ్ళ ఇంటిలో సేకరించినవే! రామనాథన్ పేరొందిన శాస్త్రవేత్త. అతనికి పలు విదేశీ పరిశోధనాలయాలతో సంబంధాలున్నాయి. ఎందరో శాస్త్రవేత్త లతో స్నేహాలున్నాయి. శాస్త్రవేత్తకది సహజం, అనివార్యం కూడా. అందుచేత అదేమీ వింతగా అనిపించలేదు శేఖర్‌కి.

రామనాథన్ నవీన విజ్ఞానాన్ని ఎంతగా ఆరాధించేవాడో అంతకన్నా ఎక్కువగా మత విశ్వాసాలుండేవి అతనికి. తు.చ. తప్పక ప్రతి రోజూ ఉదయం సంధ్యావందనం చేసేవాడు. ఏ రోజునైనా చేయడం కుదరకపోతే అందుకు కారణాన్ని డైరీలో రాసే అలవాటుంది అతనికి. అలాంటి సందర్భాలు ఇరవై వరకు అతనికి డైరీలో కనిపించాయి. అంతటి మత, సంప్రదాయవాది అయిన రామనాథన్ మూడేళ్ళ క్రితం క్రైస్తవ మతాన్ని పుచ్చుకోవడం ఆశ్చర్యం అని పించింది శేఖర్‌కి.

అతని డైరీలో ఒకచోట హిందూ మతం, భారతీయ సంప్రదాయాలు చాలా విశాలమైనవని, వాటికి సెక్యులర్ తత్వం ఉందని రాశాడు. పైగా "మతం మార్చు కొనడం కన్నతల్లి ముఖాన నువ్వు నా తల్లివి కావని కించపరచడం" అని అతను అభివర్ణించాడు.

అటువంటి రామనాథన్ హఠాత్తుగా మతం మార్చుకొనడానికి బలమైన కారణా లేమైనా ఉన్నాయా – అని శేఖర్ అతని డైరీల్ని, లేఖల్ని బాగా పరిశీలించాడు. అతని అన్వేషణ ఫలించింది. అతని ప్రశ్నకు సమాధానం లభించింది. మతం మార్చుకొనడానికి కొన్ని రోజులుముందు అప్పటికి పుట్టింట్లో ఉన్న భార్య శారదకు అతను ఒక లేఖ రాశాడు. ఆ లేఖలో ఇలా ఉంది...

"శారదా! జీవితంలో పైపైకి పోవా లంటే కొన్నింటిని వదులుకోవాలి. కొన్నింటిని ఆశ్రయించాలి. ఇప్పుడు నేను చేయబోతున్నది అదే. మతాన్ని మార్చుకోబోతున్నాను. పుట్టి పెరిగిన హిందూ ధర్మాన్ని విడిచి పాశ్చాత్యుల మతం తీసుకొంటున్నాను. నా పరిశోధన లకు, నా జిజ్ఞాసకు మరింత దోహదం చేసే అవకాశం దీనివల్ల నాకు లభిస్తుంది. ఇంతకన్నా నీకు వివరించి రాయనవసరంలేదనుకొంటాను. నన్ను సహృదయంతో అర్థంచేసుకొని, అనుస రిస్తావని ఆశిస్తున్నాను. ఇకనుంచి నా పేరు జాన్ రామనాథన్ అవుతుంది.

నీ రాకకు ఎదురుచూస్తున్నాను"

ఆ తర్వాత రామనాథన్‌కు విదేశీ ఆహ్వానాలు అనేకం అంది వచ్చాయి. ఒక విదేశీ కంపెనీకి అతను గౌరవాచార్యు డయినాడు. అయితే ఇంతలోనే అతన్ని గుండెపోటు మింగేసింది. గౌరవాల్ని, హోదాల్ని పదికాలాలపాటు అనుభవించి ఆనందించాలనుకొన్న అతని ఆశలు అడి యాసలయాయి. మృత్యువుకువయస్సుతో, తెలివితేటలతో, ఆశయాకాంక్షలతో నిమిత్తం లేదు. నిర్దాక్షిణ్యంగా తన చేతులు చాపి, నవనవోన్మేషమైన జీవితాన్ని అదిమివేస్తుంది.

ఆ ఉత్తరాలు, డైరీలు ఒక కట్టగాకట్టి





భద్రపరిచి, శేఖర్ కొంచెం లోతుగా ఆలోచించాడు. అతనికి ఒక అనుమానం కలిగింది. వెంటనే జగన్నాథ్‌కి ఫోన్ చేశాడు. అవతలనుంచి అతను పలికాడు– ''ఏమిటి సంగతి" అని అడిగాడు.

"రామనాథన్ శవాన్ని చూడాలి" శేఖర్ అన్నాడు.

"నీకేమైనా మతిపోయిందా? సమాధులు తవ్వితే తప్ప అది కుదిరేపని కాదు" జగన్నాథ్ మందలింపుగా అన్నాడు.

"అందుకే నీ సహాయాన్ని కోరుతున్నాను. రామనాథన్ సమాధి తవ్వే ఏర్పాటుచెయ్యి"

"నా ఉద్యోగం పోతుంది"

"మనిద్దరికీ, పనివాళ్ళకి తప్ప ఎవరికీ తెలీకుండా ఈ పని జరగాలి. చాలా అవసరం"

"అంటే?''

"ఇవాళ అర్ధరాత్రి ఆ పనిచేద్దాం. నువ్వు తగిన ఏర్పాట్లు చెయ్యి. నేను కార్పొరేషన్ ఆఫీసుకు వెళ్ళి రామనాథన్ శవాన్ని ఏ శ్మశానంలో ఖననంచేశారో కనుక్కువస్తాను"

"ఆ సమాధి తవ్వితే మనకు కనిపించేవి ఎముకలు!"

"అవే చూద్దాం!" శేఖర్ ఫోన్ పెట్టేశాడు.

* * *

జనన మరణాలు చక్రభ్రమణక్రమాలు. పేట్లు, వీధులు, పూళ్ళు, నగరాలు ఆ భ్రమణంలో కొన్ని గుర్తులు. ఇది లోక వృత్తం. ఈ వృత్తక్రమానికి మౌనసాక్షి ఆ రికార్డులగది. అక్కడ ఎన్నో కాగితాల దొంతరలు, ఉచ్ఛ్వాస, నిశ్వాసాల ఒరిపిడితో సాగిపోయే జీవితచరిత్రలకు రాతభాష్యాలు. కొన్ని విరామాలు, కొన్ని ఫుల్‌స్టాపులు.

శేఖర్ అతికష్టంమీద జాన్ రామనాథన్‌ని ఖననంచేసిన శ్మశానం వివరాలు, ఏ ప్రదేశంలో ఖననంచేసినదీ స్పష్టంగా తెలుసుకోగలిగాడు. ఈ వివరాలు చెప్పడానికి ముందు బెట్టుచేసిన రికార్డు రూమ్ గుమాస్తా పదిరూపాయలు ఇచ్చేసరికి మెత్తబడ్డాడు.

"చావు వివరం రాసుకోవాలన్నా, పుట్టుక సంగతి నమోదుచేయాలన్నా బోలెడు తతంగం ఉంది. ఆ వివరాలు మళ్ళీ చెప్పాలన్నా అంత తతంగం పూర్తి చేయాలి. వెళ్ళి అప్లికేషన్ పూర్తిచేసి చలానాకట్టి, రసీదు తీసుకురా!" రికార్డు రూమ్ క్లర్కు కసిరాడు మొదట్లో.

శేఖర్‌కి ఆ ప్రొసీజరంతా తెలుసు.కాని ఇప్పుడంత టైములేదు. పైగా ఈ సంగతులు పైకి తెలియడం అతనికి ఇష్టంలేదు. అంతా రహస్యంగా, వేగంగా జరిగిపోవాలి. అందుకు డబ్బు ఎరకన్న దగ్గరదారి లేదు.ఆ పనే చేశాడు. క్లర్కు ముందు "అదేం కుదరద"ని భీష్మించాడు. కాని నుంపటిమీదపెట్టిన నెయ్యిలా, డబ్బు చూసేసరికి అతనూ కరిగిపోయాడు.

శేఖర్ శరవేగంతో జగన్నాథ్ దగ్గరకు వచ్చాడు. అతను దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. శేఖర్‌ని చూసి కొంత స్థిమితపడ్డాడు. నౌకరు ఇద్దరికి కాఫీ తెచ్చి ఇచ్చాడు. అది తాగేసరికి ఇద్దరికి ఆలోచనల అలసట కొంత తీరినట్లయింది.

"నీ అంతర్యం నాకు అంతుపట్టడం లేదు" జగన్నాథ్ సిగరెట్ వెలిగించుకొని అన్నాడు.

"ఇంతకీ సమాధి తవ్వించడానికి మనుషుల్ని పురమాయించావా? లేదా?" శేఖర్ ప్రశ్నించాడు.

"ఆ ఏర్పాట్లు రహస్యంగా చేశాను. ఇంతకీ ఎందుకీ సమాధి అన్వేషణం?''

"చెప్తాగా! నేను ఆ సమాధి వివరాలు తెలుసుకొని వచ్చాను. ఇదిగో" అని శేఖర్ తను ఆ వివరాలు ఎలా సేకరించి నదీ వివరించి చెప్పాడు.

"అదిసరే! శారదను యెవరు ఎత్తుకు పోయి ఉంటారంటావ్?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"రామనాథన్ పరిశోధనా రహస్యం ఏదో శారదకు తెలిసివుండాలి. దయ్యాలూ, భూతాలూ పేరున ఆమెను భయపెట్టి ఆ రహస్యం తెలుసుకోవాలను కొన్నారు. సాధ్యంకాలేదు. చివరికి ఆమెనే మాయంచేశారు. రామనాథన్ సమాధిని తెరిచి చూశాక కాని ఆమెను ఎవరు అపహరించుకొనిపోయింది నేను చెప్పలేను" శేఖర్ అన్నాడు.

"మొత్తానికి ఈ కేసులో నాకన్న నీవే అడ్వాన్స్‌లో ఉన్నావు" జగన్నాథ్ కాంప్లిమెంట్ చేశాడు.

* * *

అర్ధరాత్రి అయింది. చలిగాలి వీస్తోంది. శ్మశానవాటిక అంతా మృత్యుశైతిల్యం ఆవరించింది. జీవరసాయనాలు తమక్రియా కలాపాలు విరమించడంతో ఎందుకూ పనికిరాకుండాపోయిన శరీరాలు అక్కడ భూగర్భ పేటికలలో చిరనిద్రపోయాయి. పైన ఎత్తుగా నిలిచిన సమాధులు 'చావు నిజం' అని మౌనంగా చెప్తున్నాయి.

ఆ శ్మశానవాటికలో తూర్పువైపు నాలుగవ సమాధిని నలుగురు మనుషులు గబగబ తవ్వుతున్నారు. పక్కన జగన్నాథ్, శేఖర్ నిలబడి ఉన్నారు. వారి చేతులలో టార్చిలైట్లు వెలుగుతూ, ఆ సమాధినే చూపిస్తున్నాయి.

పంచభూతాలనుంచి ఏర్పడిన శరీరాన్ని మరల పంచభూతాలలో లీనం చేయాలని విశ్వసించిన హిందువులు శరీరాన్ని అగ్నికి ఆహుతి చేస్తారు. అగ్నిసంస్కారం వల్ల శరీరంలో పాపకృత్యాలు నాశనమై ఆత్మ మరీ పరిశుద్ధం అవుతుందని వారి నమ్మకం. శరీరంలో ఎక్కువశాతం పృథివితత్వం కనక శరీరాన్ని మట్టిలో కలిసిపోనివ్వాలని హిందువులలోనే మరికొందరు శవాన్ని పాతర వేస్తారు. గొయ్యి తవ్వి ఉప్పుపోసి శవాన్ని పాతిపెట్టే పద్ధతి ఇది. పార్సీలు శవాన్ని ఖండఖండాలుగాచేసి పక్షులకు ఆహారంగా వేస్తారు. ఇందుకై ప్రత్యేక మైన శ్మశాన వాటికలుంటాయి. అది వారి పద్ధతి.

ముస్లిమ్‌లు, క్రైస్తవులు శవాన్ని పెట్టెలో ఉంచి, సుగంధ ద్రవ్యాలుంచి పాతిపెడతారు. దీనినే ఖననం చేయడం అంటారు. అంతిమసంస్కారాల పద్ధతులు వేరుగా ఉన్నా, ఆ సంస్కారాల అంతర్యం ఒక్కటే అనిపిస్తుంది.

ఆత్మ పరిశుద్ధం కావాలి. శరీరం పంచ భూతాలలో లీనం అవాలి. జీవితం పరోప కారంతో పునీతం కావాలి. జంతువులు చచ్చిపోయాక కూడా ఎంతోకొంత ఉపకరిస్తాయి. పులి చర్మాలు, ఏనుగు దంతాలు, దుప్పికొమ్ములు, ఆవు, గేదె వంటి సాధుజంతువుల తోళ్లు, పాముచర్మం–ఇవన్నీ మనిషికి ఉపకరిస్తున్నాయి. మనిషి శరీరం అలా ఎందుకు ఉప కరించదు...శ్వాస ఉన్నంతవరకే ఆ శరీరం మంచికైనా, చెడుకైనా అక్కరకు వస్తుంది....ప్రాణం పోతే ఇక ఆ శరీరం నిరుపయోగం కనుక బతికివుండగానే లోకోపకారం చేయాలి. ఏ మతం చెప్పినా ఇదే. ఏ ధర్మం చెప్పినా ఇదే.

 

జగన్నాథ్, శేఖర్ ఇలా ఆలోచిస్తుండగానే ఇంతలో తవ్వకం పూర్తి అయింది. కూలీలకు శవపేటిక కనిపించింది. దానిపై మట్టి దులిపారు. నలుగురు నాలుగు పక్కల గోతిలో చేతులుదింపి, ఉసులు చూసుకొని 'హైసర' అంటూ ఆ శవపేటికను పైకి లాగి, పక్కన దించారు.

జగన్నాథ్, శేఖర్ ముంగాళ్ళ మీద వంగి చూస్తున్నారు. కూలీలు ఆ శవపేటిక తలుపు తెరిచారు. టార్చిలైట్ల కాంతి ఆ పేటిక అంతా పాకింది.

ఆశ్చర్యం! విచిత్రం! అనూహ్యం!!

అందులో శవంలేదు. అంతా ఖాళీ. చెక్కలకు మాత్రం కొద్దిగా చెదపట్టింది. చర్మం, మాంసం, రక్తనాళ, కండరాలు జీర్ణమైపోయినా కనీసం ఎముకలయినా అందులో ఉండాలి. అలాంటిది అక్కడ ఏమీ లేవు.

శ్రమ వృధా అయిందని కూలీలు అనుకొన్నారు. జగన్నాథ్ తల పంకించాడు.

తన అనుమానం నిజంఅయిందని శేఖర్ తృప్తిపడ్డాడు. అయితే ఒకరి భావాలు మరొకరికి తెలియడంలేదు. ఇక కర్తవ్యం ఒక్కటే. శవపేటికను యధా ప్రకారం పూడ్చిపెట్టేయాలి. ఆ సమాధిని తవ్వారన్న అనుమానం ఎవరికీ కలగకుండా సరిచేసేయాలి.

కూలీలు ఆ పనిచేయసాగారు. జగన్నాథ్, శేఖర్ అక్కడి గచ్చు అరుగు మీద కూర్చున్నారు.

"సమాధి తవ్వించాం... అందులో శవం లేదు. ఇక నీ అభిప్రాయం చెప్పు" ఎంతసేపటికీ శేఖర్ మాట్లాడకపోయేసరికి ఆత్రం ఆపుకోలేక జగన్నాథ్ అడిగాడు.

తన ఆంతర్యం, తన అంచనా మిత్రుడికి అంతుపట్టలేదని గ్రహించాడు శేఖర్.

"ఇక్కడ పనిపూర్తికానియ్! ఇంటికి వెళ్ళాక తీరిగ్గా చెప్తాను"

త్వరలోనే కూలీలు ఆ పని పూర్తి చేశారు. జగన్నాథ్ వారికి డబ్బులు ఇచ్చాడు. "ఈ సంగతి మరెవరికీ చెప్ప వద్దు" అని వాళ్ళని హెచ్చరించి పంపాడు.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత శేఖర్‌తో కలిసి తనూ స్కూటర్ ఎక్కాడు.



## 4

ఇంటికి చేరిన జగన్నాథ్, శేఖర్ బ్లాక్ కాఫీ తాగారు. నిద్ర లేకపోవడం, పని అలసట, ఆలోచనల బరువు వారిద్దరి ముఖాలలో స్పష్టంగానే కనిపిస్తున్నాయి. అయినా సందేహాలు నివృత్తి చేసుకోవాలి. అంచనాలు గురించి ఉమ్మడిగా ఆలోచించాలి. ఇది వారి పట్టుదల.

జగన్నాథ్ సోఫాలో కాళ్ళు పైకి వేసి, తల కిందకు పెట్టి పడుకొని, సిగరెట్ పీలుస్తున్నాడు. ఆలోచన తట్టనప్పుడు, ఏదైనా వినాలనుకొన్నప్పుడు అలా అర్ధశీర్షాసనం వేయడం అతని అలవాటు.

"ఇంక చెప్పు!" జగన్నాథ్ అడిగాడు.

"ఆ పెట్టెలో శవం ఉండదని నేను ముందే ఊహించాను" శేఖర్ అన్నాడు.

"ఎలా?"

"ఈమధ్య మొత్తంమీద ఎనిమిది

మంది శాస్త్రవేత్తలు మరణించడం లేదా అదృశ్యం కావడం జరిగిందని చెప్పాను... గుర్తుందా?"

"ఆ! వారిలో నలుగురు మరణించారు. నలుగురు అదృశ్యం అయారు"

"నలుగురూ గుండెపోటు వల్లే మరణించారని వార్తలు వచ్చాయి"

"అవును. ఈమధ్య గుండెపోటు మరణాలు ఎక్కువయాయి. ఇందులో వింత ఏముంది? శాస్త్రవేత్తల మనస్సులు ఎప్పుడూ ఉద్వేగ భరితంగానే ఉంటాయి"

"కనక వారివి సహజ మరణాలే అంటావు!"



"కాదు...అకాలమరణాలు. మృత్యువు కబళించిన వారందరూ మధ్యవయస్కులు నిండా నలభైయేళ్ళు నిండనివారే''

"వారే ఏదో కుట్ర చేస్తున్నారని నా అనుమానం" శేఖర్ మాట విని జగన్నాథ్ పకపక నవ్వాడు.

''ఎందుకు నవ్వుతావ్?" చిరాకుగా అడిగాడు శేఖర్.

"నవ్వక ఏంచేయమంటావు? చచ్చి పోయిన శాస్త్రవేత్తలు కుట్రచేస్తున్నారని



నువ్వు అంటున్నప్పుడు నవ్వక ఏం చేయను!"

"వాళ్ళు చావలేదు. చచ్చిపోయినట్లు లోకాన్ని నమ్మించారంతే! అపహరించ బడిన ఆ శాస్త్రవేత్తలూ, మృతజీవులైన ఈ శాస్త్రవేత్తలూ కలిసి ఏదో కుట్ర చేస్తున్నారని నా అనుమానం!''

"అదెలా సాధ్యం? మరణించిన అందర్నీ సమాధి చేశారు కదా!''

''అక్కడే ఉంది కిటుకు. హృదయ స్పందనాన్ని తాత్కాలికంగా నిలిపివేసి, వారు మరణించినట్లు లోకాన్ని నమ్మించి, శవ పేటికనుంచి వారిని మాయం చేసి, మరల శ్వాస కల్పించి బతికించే కుట్ర కావచ్చుగదా ఇది''

"సైన్స్ ఫిక్షన్ కథలు చెప్పకు. చని పోయిన వాళ్ళని బతికించే టంత విజ్ఞానమా? ఇది సాధ్యమేనా అని?''

''ఎందుకుకాదు? చనిపోవటం కాదు... చనిపోయినట్లనుపించపజేయటం కావచ్చు గదా?"

''నమ్మమంటావా?"

"రుజువు కావాలా?''

''రుజువూ, సాక్షమూ లేనిదాన్ని విశ్వసించడం నా వృత్తి ధర్మానికి విరుద్ధం"

''అయితే ఒక ఉదాహరణ చెప్తా విను. ఇప్పుడు హృదయ స్పందనాన్ని ఆపివేసి, గుండెకు ఆపరేషన్ చేశాక మరల గుండెను పనిచేయించే ప్రక్రియ ఉంది. ఒకరకంగా దీనిని 'శీత నిద్ర' కల్పించడం అంటారు. కప్పలు వంటి జంతువులు వాతావరణం బాగా లేనప్పుడు సంవత్సరాల తరబడి శీత నిద్రపోయి పరిస్థితులు అనుకూలించగానే మరల మేల్కొని యథాపూర్వం జీవకలాపాలు నిర్వర్తిస్తాయి"

''అవి శీతరక్త జంతువులు కనుక అది సాధ్యం అయింది. మనిషి ఉష్ణరక్త జీవి. ఎప్పుడూ 98.4 డిగ్రీల ఉష్ణోగ్రత ఉంటేనే అతడి శరీరం సజావుగా జీవ కలాపాలు నిర్వర్తిస్తుంది. ఈ ఉష్ణోగ్రత తగ్గినా, హెచ్చినా ఇబ్బందే. ఒక్కొక్క సారి మృత్యువు తప్పదు" జగన్నాథ్ అన్నాడు.

''మనిషి రక్తాన్ని కూడా శీత నిద్రకు గురిచేయడం, కావలసి వచ్చినప్పుడు మేల్కొల్పడం, ఆధునిక జీవవైద్య విజ్ఞానం సాధించిన విజయం.ఈ పద్ధతిలో తాత్కాలికంగా గుండె స్పందన ఆగి పోయి మనిషి మరణిస్తాడు. ఆ తర్వాత ప్రత్యేక వైద్యాలయంలో కొన్ని వారాల పాటు గుండెకు, రక్తానికి క్రమంగా హెచ్చు ఉష్ణోగ్రత కల్పించి, తిరిగి జీవింపజేస్తారు. గుండె కొట్టుకోవడం ప్రారంభిస్తుంది. గుండెపోటుతో మరణించారని లోకాన్ని నమ్మించిన శాస్త్రవేత్తలు ఈ పద్ధతిని అనుసరించి పునరుజ్జీవితు లైనారని నా వూహ. జాన్ రామనాథన్ శవం అతని సమాధిలో దొరకకపోవడం ఇందుకు బలమైన సాక్ష్యం"

''సరే..నీ వాదాన్ని అంగీకరిస్తున్నాను! వాళ్ళంతా ఏదో కుట్ర చేస్తున్నారన్నావ్. ఎక్కడ? ఎందుకు? చెప్పగలవా?" జగన్నాథ్ నిశితంగా అడిగాడు.

''ఈ ప్రశ్నకు సమాధానం దొరకా లంటే విద్యాసాగర్‌ని పట్టుకోవాలి'' శేఖర్ అన్నాడు.

"అతనెవరు?''

''శారదను ప్రేమించినవాడు. కొన్నాళ్ళు విదేశాలలో చదివినవాడు. ప్రస్తుతం ఇక్కడే ఉన్నాడని శారద చెప్పింది. నీ

 

సి.బి.ఐ. యంత్రాంగాన్ని ఉపయోగించి, అతడి ఆచూకీతియ్యి. అప్పుడుకాని అసలు రహస్యం బయటపడదు" శేఖర్ బద్ధకంగా ఆవులించాడు. అతని కళ్ళు భారంగా మూతలుపడుతున్నాయి. మనస్సు అలసిపోయింది. శరీరం డస్సింది. అలాగే సోఫాలో నిద్రపోయాడు.

జగన్నాథ్ మాత్రం ఆలోచిస్తూనే ఉన్నాడు.

"ఎనిమిదిమంది శాస్త్రవేత్తలు కుట్ర పన్నుతున్నారా? దేనికోసం! వారి ఆంతర్యం ఏమిటి? వారి ఆశ ఏమిటి? ఆశయం ఏమిటి? లక్ష్యం ఏమిటి? లక్ష్య సాధనకు వారు అనుసరిస్తున్న మార్గాలేమిటి?''

ఈ ప్రశ్నలకు సమాధానం విద్యాసాగర్‌వల్ల తెలుస్తుంది. "విద్యాసాగర్!" అనుకొన్నాడు జగన్నాథ్.

* * *

విద్యాసాగర్ఆచూకీతీయాలనిజగన్నాథ్ రెండురోజులు ప్రయత్నించాడు.ముందుగా యూనివర్సిటీలో ఆరాతీశాడు. ఇదివరకు అతను హాస్టల్‌లో ఉండేవాడని, తర్వాత ఖాళీచేసి వెళ్ళిపోయాడని తెలిసింది.

అతను విదేశాలలో పరిశోధనలుచేసి ఈమధ్య భారతదేశంవచ్చినట్లు విన్నామని, అతని స్వస్థలం కాకినాడ అని ఒక ప్రొఫెసర్ చెప్పాడు. జగన్నాథ్ కాకినాడ పోలీసుల్ని అతని గురించి వాకబు చేయమన్నాడు. వారు కొన్ని వివరాలు సేకరించి పంపారు.

విద్యాసాగర్ తండ్రి మునిసిపల్ కౌన్సిలర్‌గా పనిచేశాడు. మధ్యతరగతి కుటుంబం వాళ్ళది. ఆయన నెల క్రితం పోయాడు. తల్లి ఇదివరకే మరణించింది. ఇప్పుడా ఇల్లు వేరే ఎవరో కొనుక్కొన్నారు. తండ్రి అంత్యక్రియలకై విద్యాసాగర్ కాకినాడ వచ్చి వెళ్ళిపోయాడు.

ఇదే కాకినాడ పోలీసులు పంపిన సమాచారం. అంతకన్నా వారికి మాత్రం ఏం తెలిసే అవకాశం లేదు. అందుకని జగన్నాథ్ ప్రసిద్ధ పరిశోధనాలయాలు ఉన్న కాన్పూరు, బొంబాయి, బెంగుళూరు, అహమ్మదాబాద్‌లలోని సి. బి. ఐ. అధికారులకు వర్తమానం పంపాడు. విద్యాసాగర్ వివరాలు ఇచ్చి ఆచూకీ తెలిస్తే తెలియజేయమని కోరాడు.

ఈలోగా శేఖర్ శేఠ్ చందన్‌లాల్ పైన, కెప్టెన్ సుందర్‌రాయ్‌పైన కన్ను వేసి ఉంచాడు.

చందన్‌లాల్ చేయని వ్యాపారం లేదు. పరిచయం లేని ప్రముఖుడు లేడు ఆయనకి.ఇనుము వ్యాపారం ఉంది.అల్యూమినియం ఎగుమతి వ్యాపారంవుంది. అతని బంగారు నగలషాపు ఆ నగరంలోనే పెద్దది.ఇవికాక రంగులు,వార్నీషులు, రసాయనాల వ్యాపారాలున్నాయి. స్థానిక కార్పొరేటర్ నుంచి హోంశాఖ కార్యదర్శి, ఆపైన హోం మంత్రి వరకు అతని ముడుపులు క్రమం తప్పకుండా అందుతుంటాయి. కవుల్ని, కళాకారుల్ని అతను ప్రతియేటాసన్మానిస్తుంటాడు.అధికారులకు, వారి బంట్రోతులకు అతను ప్రతియేటా కానుకలు పంపిస్తుంటాడు.

జైన తీర్థంకరుల జయంతులు జరిగినప్పుడు ముఖ్యంగామహావీరుని జయంతికి, వర్ధంతికి చందన్‌లాల్ ప్రత్యేకించి దాన ధర్మాలు చేస్తాడు. పేదలకు అన్నదానం, వస్త్రదానం చేస్తాడు. వ్యాపారంలో అతనిది అదృష్టహస్తం. వ్యవహారంలో అతనిది విజయహస్తం. విరోధుల పాలిటి మృత్యుహస్తం. పేదలపాలిటి అమృత

హస్తం. మతం పాలిటి రక్షాహస్తం.

అలాంటి చందన్‌లాల్‌కి ఎంతో సన్నిహితుడు కెప్టెన్ సుందరరాయ్. అతనికి మిలటరీలో మంచి పేరుంది. నిపుణుడయిన సైనికాధికారిగా, గురితప్పని 'గన్నర్‌గా' రాయ్‌కి ఎన్నో ప్రశంసలు లభించాయి. యుద్ధంలో అతని కాలికి గుండు తగిలింది. అది సెప్టిక్ అయి కాలు మోకాలుకింద తీసివేశారు. అందుచేత ముందుగానే రిటైర్ చేశారు. అతనికి చిన్న ఆయుధాలు విక్రయించే షాపుంది. ఆ షాపులోనే చందన్‌లాల్‌తో రాయ్‌కి స్నేహం పెరిగింది. లాల్ చిన్న పిస్తోలు కొనుక్కుందుకు షాపుకు వచ్చాడు. రాయ్ మాటతీరు, వ్యవహారణతీరు చందన్‌లాల్‌కి నచ్చాయి. స్నేహం చేశాడు.

ఇప్పుడు ఆ ఇద్దరూ కొన్ని వ్యాపారాలలో భాగస్వాములు.

రాయ్ గంభీరంగా వుంటాడు. ఎక్కువ మాట్లాడడు. ముక్తసరిగా ఉంటాడు. చందన్‌లాల్ అలాకాదు. గలగల వాగుతాడు. మాటల్లో పెట్టి ఎంతటివాడినయినా పల్టీకొట్టిస్తాడు.

వారిద్దరిదగ్గరకి వచ్చేపోయే కస్టమర్స్ గురించి శేఖర్ నిఘావేసి పరిశీలించాడు. అనుమానించదగినవారెవరూ ఆ రెండు రోజులలో వారి షాపుల దగ్గరకు రాలేదు. తన అంచనాలు, అనుమానాలు తారుమారవుతాయా అని శేఖర్ కొంత నిరుత్సాహపడ్డాడు.

* * *

ఆరోజు సాయంత్రం జగన్నాథ్, శేఖర్ కలిశారు.

విద్యాసాగర్ గురించి ఇప్పట్లో సమాచారం అందే అవకాశాలంతగా లేవని జగన్నాథ్ చెప్పాడు. శేఖర్ తను చందన్‌లాల్, కెప్టెన్ సుందర్‌రాయ్‌ల గురించి సేకరించిన వివరాలు చెప్పాడు.

"నువ్వు అక్కడ బీట్ వేసి సేకరించలేని రహస్యం ఒకటి నేను ఇక్కడ కూర్చుని తెలుసుకున్నాను"

నిరుత్సాహంగావున్న శేఖర్‌కి జగన్నాథ్ మాటలు ఉత్సాహాన్నిచ్చాయి.

"ఏం కనుక్కున్నావ్? ఎలా కనుక్కున్నావ్??" ఆత్రంగా అడిగాడు శేఖర్.

"చందన్‌లాల్‌కి, కెప్టెన్ సుందర్‌రాయ్‌కి వచ్చే టెలిఫోన్‌కాల్స్‌ని, వాళ్ళు చేసే ఫోన్లని 'టాప్' చేశా"

"స్టాక్ ఎక్స్ఛేంజినుంచి, కస్టమర్స్ నుంచి వాళ్ళకి ఫోన్లు వస్తాయి. బాకీల కోసం వాళ్ళు ఫోనుచేస్తారు. అంతకన్నా ఆఫోన్‌కాల్స్‌లో ఏముంటాయి?"

"అక్కడే నువ్వు పప్పులో కాలు వేశావంటాను. నా ప్రయత్నం వృథా పోలేదు. హోటల్‌బృందావన్‌నుంచి కెప్టెన్ రాయ్‌కి ఫోన్ వచ్చింది. ఆ వివరం టేప్ చేశా... విను" అని జగన్నాథ్ అక్కడ వున్న టేప్‌రికార్డర్ ఆన్‌చేశాడు. అందులో కెప్టెన్ రాయ్, మరొకరు మాట్లాడుకొన్న విశేషాలు ఇలా వినిపించాయి-

"హలో రాయ్!" ఆ గొంతు వినోదినిది.

"ఆ! రాయ్ నే..." అది రాయ్ గొంతు.

"గుడ్‌మార్నింగ్!"

"వెరీ గుడ్‌మార్నింగ్. ఏమిటి విశేషాలు?"

"ఫోనులో చెప్పలేను. రాత్రి హోటలుకి రండి"

"హోటల్లో ఎక్కడ ఉంటావ్?"

"బార్‌రూమ్‌లో"

"ఎనిమిదింటికి వస్తాను"

"ఓకే''

అవతల ఫోన్ పెట్టేసిన చప్పుడు జగన్నాథ్ టేప్‌రికార్డర్ ఆఫ్‌చేసేసి, శేఖర్ ముఖంలోకి చూశాడు. అతను అయోమయంగా చూశాడు.

"నీకేం అర్థం అయినట్లు లేదు''

''ఈ రహస్యం నువ్వే చెప్పాలి"

''వెరీ సింపుల్. హోటల్ బృందావన్‌లో దిగిన ఆ విదేశీయుడికోసం రాయ్ చాలాకాలంగా నిరీక్షిస్తున్నాడన్నమాట. రాయ్‌కి అతనేదో రహస్యం చెప్తాడన్న మాట. మనం బృందావన్ హోటల్ బార్‌రూమ్‌కి వెళితే ఆ గుట్టు రట్టు అవుతుంది...కమాన్!" జగన్నాథ్ లేచాడు.

"మొత్తానికి సి.బి.ఐ. ప్రతినిధివని పించావు!" శేఖర్ మిత్రుణ్ని అభినందించాడు. ఇద్దరూ నవ్వుకొంటూ ఆటో ఎక్కారు. అది బృందావన్‌వేపు పరుగెత్తింది.

* * *

నగరానికి దూరంగా, సముద్రతీరంలో ఉంది బృందావన్ హోటల్. అక్కడ ఎక్కువగా విదేశీయులు దిగుతుంటారు. అంచేత ఆ హోటల్ పద్ధతులన్నీ విదేశీ ఫక్కీలోనే ఉంటాయి. ఖరీదయిన మనుషులు, ఖరీదయిన పనులు ఆ హోటల్ 'బార్'లో పూర్తిచేసుకుంటారు.

అక్కడ టేబుల్స్‌మీద కోట్ల రూపాయల వ్యాపారాలు ఖరారు అవుతాయి. అతిముఖ్యమయిన నిర్ణయాలు మద్యం మత్తులో జరిగిపోతుంటాయి. ఎందరి జాతకాలో అక్కడ తారుమారవుతాయి. అంతా డబ్బు మహిమ, అంతా మద్యం ప్రభావం.

అలాంటి ఆ హోటల్‌లో బార్‌లో అయిదవ వరసలో ఒక ఆంగ్లో ఇండియన్ ఒంటరిగా కూర్చుని బీర్ తాగుతున్నాడు. మనిషి టొమాటో రంగులో ఉన్నాడు. తల మీద వెంట్రుకలు లేవు. కనుబొమలు మాత్రం రాగిరంగులో మెరుస్తున్నాయి. మీసాలు కూడా అలానే నిగారిస్తున్నాయి. బీర్ నురగ ఆ మీసాలకు అంటుకొని బుడగలు 'టప్ టప్' అని పేలుతున్నాయి.

అతను పదేపదే గుమ్మం వైపు చూస్తూ బీర్ తాగుతున్నాడు. అంతలో జగన్నాథ్, శేఖర్ లోపలకు వచ్చారు. బార్‌లో మొత్తం మీద పది పదిహేను మందికన్న లేరు. వారిలో చాలామంది గుంపుగా కూర్చున్నవారే. ఒక్కడు మాత్రం ఆచివర ఒంటరిగా కూర్చున్నాడు. అతను ఆంగ్లో ఇండియన్.

జగన్నాథ్ అతన్ని నిశితంగా చూశాడు. అతని మనసులో తళుక్కున ఆలోచన మెరిసింది.

"శేఖర్! అక్కడ కూర్చున్నవాడు అంతర్జాతీయంగా పేరుమోసిన స్మగ్లర్ డేనియల్. వాడే కెప్టెన్ రాయ్ కోసం వచ్చి ఉంటాడు. నేను వాడి దగ్గరగా కూర్చుంటాను. నువ్వు ఇక్కడ కూర్చో'' అని – జగన్నాథ్ నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ డేనియల్ టేబుల్ దగ్గరకు వెళ్ళాడు. అతని ఎదురు సీటులో కూర్చోబోయాడు.

"రిజర్వ్‌డ్" డేనియల్ గద్దించినట్లు అని ఉరిమిచూశాడు. జగన్నాథ్ ఫోన్‌లో కంఠస్వరాన్ని, ఇప్పుడు అతను అన్న మాటని సరిపోల్చుకొన్నాడు. అతనే రాయ్ కలుసుకోనున్న మనిషి అని నిర్ధారించుకొని "సారీ" అని వారివైపు నడ్డి ఉండేటట్లు వేరే సీటులో కూర్చున్నాడు.

ఇప్పుడతనికి వాళ్ళ మాటలు వినిపి

స్తాయి. తను వింటున్నట్లు వాళ్లు పసిగట్ట లేదు. పైగా ద్వారంలోనుంచి ఎవరు వచ్చినా కనిపిస్తారు. అల్లంత దూరంలో శేఖర్ కూర్చుని ఉన్నాడు. బేరర్‌కి ఆర్డరిచ్చాడు. ఇంతలో కెప్టెన్ సుందర్ రాయ్ వచ్చాడు.

ఆశ్చర్యం! అతను మామూలుగా నడిచి వస్తున్నాడు. కుంటికాలు కాదు. కాలికి ఆధారమైన చంకకు ఆని ఉండే చట్రం లేదు. మామూలు మనిషిలాగె రాయ్ చరచర అడుగులు వేసుకొంటూ వచ్చి శేఖర్ టేబుల్ ముందు ఆగిపోయాడు.

శేఖర్ అతనికి 'విష్' చేశాడు. రాయ్ కూడా మందహాసంతో విష్ చేశాడు. "మీరు బార్‌కి వస్తుంటారా?" రాయ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అప్పుడప్పుడు. ఇవాళ ఏమీతోచక ఇలా వచ్చా. మీరు..." శేఖర్ ప్రశ్నార్థకంగా అన్నాడు.

"స్నేహితుడొచ్చాడు. అందుకని వచ్చా" అంటూ రాయ్ ముందడుగు వేశాడు. ఇంతలో ఆ ఆంగ్లోఇండియన్ రాయ్‌ని చూసి ఎదురువచ్చాడు.

"హలో ... ఎమర్సన్! హౌడూ యూడూ" అని రాయ్ అతనికి షేక్ హాండిచ్చాడు. ఎమర్సన్‌గా చెలామణి అవుతున్న డేనియల్ నవ్వుతూ తన టేబుల్ దగ్గరకు తీసుకువెళ్ళాడు.

రాయ్, డేనియల్ ఎదురెదురుగా కూర్చున్నారు. రాయ్ నడ్డివైపు జగన్నాథ్ కూర్చుని ఉన్నాడు. వారిద్దరూ నెమ్మదిగా మాట్లాడుకొంటున్నారు. అయినా జగన్నాథ్ ఆ మాటల్ని అతి జాగ్రత్తగా వింటున్నాడు.

"ఇన్నాళ్లు చేశావేం?" రాయ్ ప్రశ్నించాడు.

"అంత త్వరగా తేలే వ్యవహారమా?"

"పండా, కాయా?"

"నేను తలుచుకొంటే కాయ పండక పోతుందా?''

"ఆలస్యం దేనికి? ఆ కాగితాలు ఇచ్చెయ్యి"

"డబ్బు తెచ్చారా?"

"డబ్బేమిటి?''

"మిస్టర్ రాయ్! ఆ కాగితాల విలువ మీరు చెప్పినట్లు పదిలక్షలు కాదు....పది కోట్లు. ఆ దామాషాపై నాకు కమిషన్ ఇవ్వాలి. అంటే ఇంకా అయిదు లక్షలు ఇస్తే కాని కాగితాలు ఇవ్వను"

"ఎమర్సన్! ఇది విశ్వాస ఘాతుకం''

"మీరు చేస్తున్నది విశ్వాస ఘాతుకం కాదా? మిస్టర్ రాయ్! మనందరం నెత్తుటి కూడు తింటున్నవాళ్ళమే! ఒకళ్ళకొకళ్ళం తప్పులు వెదుక్కోవద్దు. నీతులు చెప్పుకో వద్దు. డబ్బు తెచ్చారా?"

ఎమర్సన్ నీలి కళ్లు సూటిగా వెలుగుతున్నాయి. అతని ముఖం మరీ జేవురించింది. కెప్టెన్ రాయ్ తల వంచుకొని క్షణకాలం ఆలోచించాడు. ఏమనుకున్నాడోయేమో తటాలున లేచాడు. ఎమర్సన్ కళ్లు అతనితోబాటే పైకి లేచాయి.

"ఆల్ రైట్! పదిగంటలకు రూమ్‌కివస్తా డబ్బుతో" అన్నాడు రాయ్.

ఎమర్సన్ వెకిలిగా నవ్వబోయి, రాయ్ గంభీర వదనాన్ని చూసి తనను తాను సంబాళించుకొన్నాడు. వెనుదిరిగి వెళ్ళబోతున్న రాయ్‌కి వినిపించేటట్లు ఎమర్సన్ "రూమ్ నంబర్ 108" అన్నాడు. కెప్టెన్ సుందరరాయ్ టకటకా నడుచుకొంటూ వెళ్ళిపోయాడు.

అతని వెనుకే ఎమర్సన్ లేచి వెనుకా

 

ముందూ చూడకుండా తన రూమ్‌వైపు వెళ్ళిపోయాడు.

జగన్నాథ్ లేచి శేఖర్ దగ్గరకు వచ్చాడు. శేఖర్ అయోమయంగా చూస్తున్నాడు. జగన్నాథ్‌ని చూసి లేచి నిలబడ్డాడు.

"రా! రూమ్‌నంబర్ 108కి వెళదాం" అని జగన్నాథ్ ముందడుగువేశాడు. శేఖర్ అనుసరించాడు.

ఇద్దరూ హోటల్ మూడవ అంతస్తు లోని నూట ఎనిమిదవ నెంబరు రూమ్‌కి బయలుదేరారు.

"శేఖర్! వీడు పెద్ద స్మగ్లర్. స్విట్జర్లెండ్ దేశీయుడు. ఎన్నో కేసుల్లో ఇరుక్కొన్నాడు. కాని బలమైన సాక్ష్యాధారాలులేక తప్పించుకొన్నాడు. రాయ్‌తో ఎమర్సన్ అనే పేరుతో ఏదో వ్యవహారం నడుపుతున్నాడన్నమాట. మనం జాగ్రత్తగా ఉండాలి. సమయస్ఫూర్తితో ముందడుగు వేయాలి"

జగన్నాథ్ నెమ్మదిగా డేనియల్ సంగతి చెప్పేసరికి శేఖర్ అనుమానాలు పటాపంచలైనాయి. ఇద్దరూ 108 రూమ్ చేరారు.

రూమ్ తలుపువేసి ఉంది. జగన్నాథ్ నెమ్మదిగా తలుపుమీద కొట్టాడు. లోపల నుంచి "ఎవరు?'' అన్న అరుపు కర్కశంగా వినిపించింది. జగన్నాథ్ బదులు ఇవ్వలేదు. "టక్‌టక్" అని తలుపుమీద చప్పుడు చేస్తూనే ఉన్నాడు.

లోపల నుంచి కసురుకొన్న ఛీత్కారం వినిపించింది.

''మాటా మంతీ లేకుండా టక్‌టక్ చప్పుడు చేయడం నాగరికతకాదు" అంటూ ఎమర్సన్ ఉరఫ్ డేనియల్ తటాలున తలుపు తెరిచాడు. జగన్నాథ్ ఠక్కున లోపలకు దూకాడు. శేఖర్ లోపలకు వెళ్ళే లోగానే తలుపు దభాలున వేసేశాడు డేనియల్.

ఇటువంటి అసాధారణ ప్రతిఘటనలు, ఎదురుదెబ్బలు డేనియల్‌కి అలవాటే. జగన్నాథ్‌కీ మామూలే. అందుకే ఇద్దరూ ఆశ్చర్యపోలేదు. ఇద్దరూ అప్రమత్తంగా ఉన్నారు.

జగన్నాథ్ రూమ్‌ని అతివేగంగా కలియజూశాడు. సోఫాలో డేనియల్ బ్రీఫ్‌కేస్ సర్దుకొంటున్నట్లున్నాడు. ఆ పెట్టె తెరిచి ఉంది. ఏవో కాగితాలు, లుంగీ, కవరు, ఒక చొక్కా ఆ పెట్టె పక్కన ఉన్నాయి. అంటే డేనియల్ అప్పటికప్పుడే రూమ్ ఖాళీచేసి వెళ్ళిపోతున్నాడన్నమాట. తను వెంటనే రావడం మంచిదయింది. జగన్నాథ్ వేగంగా ఆలోచన సాగించాడు.

ఇంతలో డేనియల్ పిస్తోలు వూపుతూ అతనివైపు రాసాగాడు. అలాంటి విపరీతం ఎదురవుతుందని ముందే ఊహించిన జగన్నాథ్ అతి నేర్పుగా తన జేబులోని రివాల్వర్ పైకితీసి, డేనియల్‌కు గురి పెట్టాడు.

రివాల్వర్ గురి తప్పకుండా కాల్చడం ఇద్దరికీ వెన్నతో పెట్టిన విద్యే. దానివల్ల ప్రయోజనంలేదు. డేనియల్ని చంపివేయడం రహస్య పరిశోధనకు ఎక్కువగా ఉపకరించదు. అతన్ని ప్రాణాలతో లోబరుచుకోవాలి. ఇది జగన్నాథ్ ఆలోచన.

అతన్ని కాల్చిచంపడం పెద్ద కష్టం కాదు. కాని అవతల ఉండిపోయిన మనిషి పోలీసులకు ఫిర్యాదుచేసి తనను బంధింపజేస్తాడు. కనుక ఇతన్ని చంపకుండా లోబరుచుకోవాలి. ఇదిడేనియల్ ఆంతర్యం. అందుకే ఇద్దరూ పిస్తోళ్లు ఒకరికొకరు గురిపెట్టి ఘూర్ణిల్లి చూస్తున్నారు తప్ప



అడుగు ముందుకు వేయడంలేదు. అలా ఎంతసేపని ఆ ఉద్వేగాన్ని ఇద్దరూ సహించగలరు?

''ఎవరు నువ్వు?'' డేనియల్ గద్దించాడు.

"నువ్వెవరవని?" జగన్నాథ్ ఛీత్కరించాడు.

"ఇంతవరకూ నన్నీ ప్రశ్న ఎవరూ వేయలేదు. అంత సాహసం ఎవ్వరూ చేయలేదు"

"ఇపుడు నేను చేస్తున్నాను"

"అందుకే ఎవరవు నువ్వు అని ప్రశ్నిస్తున్నాను" డేనియల్ లౌక్యంగా అడిగాడు.

"నీ పాలిటి...'' జగన్నాథ్ ఇంకా ఏదో అనబోయాడు. అతను పరధ్యానంగా ఉన్నాడని భావించి డేనియల్ పిస్తోలు పేల్చబోయాడు. అయితే పాదరసంలాంటి చూపులు, డేగవంటి దృష్టిగల జగన్నాథ్ మెరుపులా పక్కకు తప్పుకొని అంతలో తటాలున డేనియల్ మీదకు లంఘించి కరాటే ఫక్కీలో అతడిపై దెబ్బ వేశాడు.

ఈ అనూహ్యమైన దాడికి డేనియల్

నేలకూలాడు. అతనికి స్పృహపోయింది. డేనియల్‌కి కరాటేరాదు. అందుకే జగన్నాథ్ తీయబోయే దెబ్బగురించి అతనూహించలేకపోయాడు.నేలకూలాడు.

వెంటనే జగన్నాథ్ తలుపు తెరిచాడు. అంతవరకు బయట నిలబడి ఆత్రంగా, భయంగా ఎదురుచూస్తున్న శేఖర్ లోపలకు వచ్చాడు. స్పృహతప్పి పడి పోయిన డేనియల్‌ని చూసి ఆశ్చర్య పోయాడు.

ఇద్దరూ కలిసి డేనియల్ సామానంతా వెదికారు. వారికి ఉపయోగించే వస్తువు కాని, కాగితాలు కాని కనిపించలేదు.

ఇంతలో శేఖర్‌కి ఒక ఆలోచన వచ్చింది. వెంటనే అతను డేనియల్ పాంట్‌కుపెట్టుకొన్న బెల్ట్ విప్పి పరిశీ లించాడు. దానికి లోపలివైపున రహస్యంగా అరవుంది. దానిలో కాగితాలు మడతలుపెట్టి ఉన్నాయి.

శేఖర్ వాటిని ఆత్రంగా చూశాడు. జగన్నాథ్‌కి చూపించాడు. ఆ కాగితాలపై గజిబిజిగా అంకెలు వేసివున్నాయి. జగన్నాథ్‌కి వాటి సంగతి అంతుదొరక లేదు.

''జగన్నాథ్! ఇవి వెంకట్రావ్ చేసిన లెక్కలు. గల్లంతైన కాగితాలలో ఇవి కొన్ని. వీటి కోసమే రాయ్ వెతికిస్తున్నా డన్నమాట" అని శేఖర్ ఆ కాగితాల్ని జాగ్రత్తగా తన జేబులో పెట్టుకొన్నాడు.

"ఇవి ఇవ్వకుండానే డేనియల్ పారి పోవాలనుకొన్నాడు. మనం ఆలస్యంచేసి లాభంలేదు. కొంచెంసేపట్లో రాయ్ డబ్బు తీసుకొని వీటికోసం ఇక్కడకు వస్తాడు. ఈలోగానే డేనియల్‌తో మనం వెళ్ళిపో వాలి" జగన్నాథ్ తొందరచేశాడు.



శేఖర్ గ్లాసుతో నీళ్ళుతెచ్చి డేనియల్ ముఖంమీద చల్లాడు. అతనికి స్పృహ వచ్చింది. ఏదో అరవబోయాడు.

"డేనియల్..నువ్వు అరిచి లాభంలేదు. హాయిగా బతకాలనివుంటే మాతో చెయ్యి కలుపు. లేదా నిన్ను పోలీసులకు అప్ప గిస్తాం. ప్రసిద్ధ శాస్త్రవేత్త వెంకట్రావ్‌ని నువ్వే చంపావని, అతడి ఫార్ములా కాగితాల్ని అపహరించావని ప్రభుత్వానికి చెప్తాం" జగన్నాథ్ డేనియల్‌ని బెదిరిం చాడు.

తన గుట్టంతా వారి చేతిలో ఉందని పసిగట్టిన డేనియల్ ప్రాణాలతో బయట పడాలని నిశ్చయించుకొన్నాడు.

"నేను మీతో చేతులు కలుపుతాను. మనం త్వరగా బయటపడాలి. కెప్టెన్ రాయ్ రాకుండా వెళ్ళిపోదాం" అన్నాడు డేనియల్.

తర్వాత డేనియల్ తన బ్రీఫ్‌కేస్ సర్దుకొని వారిని అనుసరించాడు. ముగ్గురూ టాక్సీ ఎక్కారు.

* * *

కొంతసేపు ముగ్గురిలో ఎవరూ ఏమీ మాట్లాడలేదు. కాని వారిలో ఎవరి అనుమానాలు వారికున్నాయి.

కెప్టెన్‌రాయ్‌నుంచి వీరు తననిరక్షించ గలరా? రాయ్ పదిగంటలకు హోటల్‌కి వెళతాడు. అక్కడ తనకై వాకబుచేస్తాడు. తాను పారిపోయానని తెలుసుకొంటాడు. తాను నగరం పొలిమేరలు దాటకుండానే పట్టుకొంటాడు. అలాంటి యంత్రాంగం అతనికుంది. మరి వీరు అతనినుంచి ఎన్నాళ్ళు కాపాడగలరు? ఎలా కాపాడ గలరు?-ఇవి డేనియల్ అనుమానాలు.

కెప్టెన్ రాయ్‌తో డేనియల్‌కి ఎలా పరిచయం? రాయ్ ఇతడిని విడిచి పెడతాడా? అతని బారినుంచి

రక్షించడం ఎలా? ఆ ఫార్ములా కాగితాలు ఏంచేయాలి?–ఇవి జగన్నాథ్‌ని వేధిస్తున్న ప్రశ్నలు.

ఆ ఫార్ములా కాగితాల కోసం రాయ్ వెదుకుతాడు. బార్‌లో అతను తనని చూశాడు. పైగా లోగడ ఒకసారి వాటి గురించి తను రాయ్ దగ్గర, చందన్ లాల్ దగ్గర వాకబు చేసి ఉన్నాడు. డేనియల్‌ని అన్వేషిస్తూ రాయ్ తప్పక తనదగ్గరకే వస్తాడు. అప్పుడేం చేయాలి? ఆ ఫార్ములా పూర్వా పరాలు ఎలా తెలుస్తాయి?–ఇవి శేఖర్ మనసును కలవర పరుస్తున్న సందేహాలు.

టాక్సీ పరుగు పెడుతోంది. మలుపులు తిరుగుతోంది. ట్రాఫిక్ లైట్లను బట్టి ఆగి మరల పరుగు పెడుతోంది. అలాగే వారి మనసుల్లో ఆలోచనలు ఎడతెరపి లేకుండా గమ్యాన్ని అన్వేషిస్తూ పరుగు పెడుతున్నాయి.

''కెప్టెన్ రాయ్ నుంచి నన్నెలా రక్షించగలరు?'' డేనియల్ భయంగా అడిగాడు.

''మా ఇంటికి మృత్యువు కూడా రాలేదు. నీకు ఎలాంటి భయం అక్కర లేదు'' జగన్నాథ్ అతనికి ధైర్యంచెప్పాడు.

''కాని రాయ్ మృత్యువుకే మృత్యువు'' డేనియల్ గొంతు ఒణికింది.

''మా ఇల్లు అలాంటివారికి యమ సదనం...భయపడకు. ఇంతకీ మీ ఇద్దరికీ పరిచయం ఎలా అయింది? ఎందుక యింది? ఈ ఫార్ములా కాగితాలు నువ్వెలా సంపాదించావు?'' జగన్నాథ్ ఆరాతీస్తూ అడిగాడు.

''అవన్నీ ఎందుకు?'' డేనియల్ ప్రశ్నించాడు.

''ఇవి చాలా విలువైన కాగితాలు. నువ్వెంత కష్టపడి సంపాదించావో తెలిస్తే ఎక్కువ వెలకు అమ్ముకోవచ్చు. అందుకు...'' జగన్నాథ్ సమాధానం.

''వీటిని అమ్మేస్తారా?''

''నువ్వు అందుకేగా వచ్చావు. నా ద్వారా అయితే రెండు మూడింతలు ధర ఎక్కువ వస్తుంది. ఫిఫ్టీ ఫిఫ్టీ పంచు కొందాం...చెప్పు. ఇవి నువ్వు సంగ్రహించిన సాహస గాథ వివరించు''

''చెప్తాను. సావధానంగా వినండి'' డేనియల్ బలంగా ఊపిరి పీల్చుకొన్నాడు. జగన్నాథ్, శేఖర్ అతనివైపే శ్రద్ధగా చూస్తూ వినసాగారు...

''కెప్టెన్‌రాయ్ ఉద్యోగంలో ఉండగా అంటే అయిదారు నెలల క్రితం జర్మనీ వచ్చాడు. అప్పటికి నేను అక్కడ పేరు సంపాదించి ఉన్నాను. రాయ్ కబురు చేస్తే వెళ్ళి కలిశాను. నాకు ఒక ఫోటో యిచ్చి ''ఇతను ప్రసిద్ధ శాస్త్రవేత్త వెంకట్రావ్. ఇతడిని ప్రాణాలతో అప్ప గించినా సరే. అతడి ఫార్ములా అప్పగించినా సరే'' అన్నాడు.

అలాంటి పనులు చేయడం నాకు వెన్నతో పెట్టిన విద్య. గంజాయి, హిరాయిన్, ఎల్. ఎస్. డి., బంగారం వంటి ద్రవ్యాలను అతి సునాయాసంగా ఖండఖండాంతరాలకు స్మగ్లింగ్ చేయగల సత్తా నాకు ఉంది. బోలెడుమంది అను చరులు నాకున్నారు. అధికారులు నాకు పలుకుతారు. అవసరమైతే తలలు తీసే స్తాను. అలాంటి నాకు ఒక శాస్త్రవేత్తని బంధించి ఇవ్వడం పెద్ద పని కాదు. ఒప్పుకొన్నాను. వెంకట్రావ్ వివరాలు సేకరించాను.

అతను కాన్పూరులోని ఒక పరిశోధ నాలయంలో కొన్నాళ్ళు పనిచేశాడు. ఆ

తర్వాత మతి చలించిందని ప్రభుత్వం అతణ్ణి తీసివేసింది. ఢిల్లీలోని ఒక నర్సింగ్ హోమ్‌లో అతన్ని రాయ్ ఆఖరిసారి చూశాడు. ఆ తర్వాత వెంక ట్రావ్ అమెరికా వెళ్ళిపోయాడని తెలిసింది.

నేను అమెరికాలోని ప్రధాన కేంద్రాలు వెతికాను. ఆస్పత్రులు వాకబు చేశాను. భారతీయులు ఎక్కువగా బస చేసే హోటళ్ళు అన్వేషించాను. చివరకు న్యూయార్క్‌లో ఒక చిన్న ఎపార్ట్ మెంటులో వెంకట్రావ్ అతి రహస్యంగా కాలం వెళ్ళబుచ్చుతున్నాడని పసికట్టాను. అతను అక్కడ ఒక లేబరేటరీలో మారు పేరుతో పరిశోధనలు' చేస్తున్నాడని తెలిసింది.

ఒకనాటి రాత్రి తొమ్మిది గంటలవేళ అతని బసకు వెళ్లాను. అతనేదో తదేకంగా చదువుకొంటున్నాడు. అపరి చితుణ్ణైన నన్ను చూసి ఆశ్చర్యపోయాడు. పైగా 'వెంకట్రావ్' అని నేను చేసిన సంబోధన అతనిలో ఆశ్చర్యాన్ని, భయాన్ని కలిగించింది.

''నేను మాటలు పెంచి సమయం వృధా చేయదలచలేదు. నీ ఫార్ములా కావాలి. లేదంటే ప్రాణాలుతీస్తాను'' అని గద్దించాను.

వెంకట్రావ్ తొట్రుపడ్డాడు. అయినా తమాయించుకొన్నాడు. క్షణకాలం ఆలోచించాడు.

''ఆల్ రైట్! ఫార్ములా ఇస్తాను. కాని ఒక షరతు. అది ఇదివరకే ఒకరికి అమ్మి వేశాను. కనక మరొక ప్రతి తయారు చేయించి నీకు ఇస్తాను...ఎంత ఇస్తావ్?" వెంకట్రావ్ అడిగాడు.

లేబరేటరీలో ప్రయోగాలు చేసుకొనే వెర్రిబాగుల శాస్త్రవేత్త వెంకట్రావ్, ఒకే ఫార్ములాను ఇద్దరికి అమ్మి డబ్బుచేసుకొనే వ్యాపారలౌక్యం ప్రదర్శించడం ఆశ్చర్యం అనిపించింది. అదే అడిగాను.

''ఫార్ములా ఇద్దరికీ అమ్మతాను. ఎవరు ముందుగా దానిని ఉపయోగించు కోగలిగితే వారికి దానిమీద పూర్తి హక్కులుంటాయి. అదే ఈ వ్యాపార రహస్యం'' అని వెంకట్రావ్ తన ఆంతర్యాన్ని విప్పిచెప్పాడు. కొంతసేపు నేను ఆలోచించాను. మాకన్న ముందే ఆ ఫార్ములాపై ఎవరో కన్నువేశారంటే అది చాలా విలువైనదని అర్థం అవుతోంది. అంచేత ఎంత ఖరీదైనా కొనేయాలని నిశ్చయించుకొన్నాను.

''వాళ్ళు ఎంత ఇస్తాం అన్నారు?'' అని అడిగాను.

"పది లక్షల రూపాయలు. మీరెంత ఇస్తారు?

"పదిహేను లక్షలు!'' వెంటనే బదులు చెప్పాను. వెంకట్రావ్ ఆశ పడినట్లు కనిపించాడు.

''ఆల్ రైట్! రేపు ఈ వేళప్పుడు రండి. కాగితాలు రెడీచేసి ఉంచుతాను. డబ్బంతా తీసుకురండి.అరువులేదు..హామీ పత్రాలు లేవు'' వెంకట్రావ్ నిష్కర్షగా చెప్పాడు.

''మాట తప్పరుకదా!'' నేను అడిగాను.

''మాటతప్పితే మీనుంచి తప్పించుకొని బతకగలనా?'' వెంకట్రావ్ అన్నాడు. మర్నాడు రాత్రి తొమ్మిది గంటలకు నేను వెళ్ళాను.

అయితే ఫార్ములా ఇవ్వవలసిన వెంకట్రావ్ చేతిలో రివాల్వరు ఉంది. అతను అతి లౌక్యంగా మాట్లాడినప్పుడే నేను అనుమానించాను ఇలాంటి ఘాతుకం




ఏదో తలపెడతాడని. అందుకే నా కోటు జేబులో పిస్తోలుపెట్టుకొని, ట్రిగ్గర్‌పై వేలు వేసివుంచి నేను అతని గదిలోకి అడుగుపెట్టాను. నన్ను చూస్తూ నే వెంకట్రావ్ గురి చూసి కాల్చబోయాడు. అతని గురికుదిరేలోగానే నేను పిస్టలు కాల్చి అతన్ని చంపాను.

గదంతా గాలించి ఫార్ములా కాగితాలు సంపాదించాను. రాయ్‌కి వాటిని అంద జేద్దామని ఇండియాకువచ్చాను.వెంకట్రావ్ తయారుచేసిన ఆ ఫార్ములా చాలా విలువైనదని ఇక్కడ గ్రహించాను. అందుకే ఎక్కువ డబ్బుయిస్తే తప్ప ఇవ్వనని రాయ్‌కి స్పష్టంగా చెప్పాను. ఈలోగా కథ అడ్డంతిరిగింది'' డేనియల్ చెప్పడం పూర్తిచేశాడు.

''కాదు..మలుపు తిరిగింది"జగన్నాథ్ అన్నాడు.

ఇంతలో టాక్సీ జగన్నాథ్ ఇంటి దగ్గర ఆగింది. ముగ్గురూ కారు దిగారు. టాక్సీ డబ్బు చెల్లించి లోపలకు వెళ్ళి పోయారు. ఊరికి చివరగా ఉన్న ఆ ఇల్లు తనకు శ్రీరామరక్ష కాగలదని డేనియల్ నిశ్చయించుకొన్నాడు. అది ఆధునిక వసతులు, రక్షణలు ఉన్న అద్భుతమైన బంగళా.

* * *

ముగ్గురూ శుభ్రంగా స్నానాలుచేశారు. బ్రెడ్,జామ్,బిస్కట్లు,పళ్ళు కడుపునిండా తిన్నారు. జగన్నాథ్ బ్లాక్ కాఫీ తయారు చేశాడు.అది తాగాకప్రాణం లేచివచ్చినట్ల యింది. డేనియల్‌కి వారు ఒక రూమ్ చూపించారు. అక్కడ ఫోమ్‌బెడ్ ఉంది. డేనియల్ మంచంమీద పడుకొన్నాడు.

కళ్ళు మూసుకొని నిద్రపోబోయి, ఏదో గుర్తు వచ్చినట్లు ఉలిక్కిపడి లేచి "నా ప్రాణాలకేం భయంలేదుకదా" అన్నాడు.

గదిలోంచి వెళ్ళబోతున్న జగన్నాథ్, శేఖర్ ఆగి, వెనక్కు తిరిగి ''మా ప్రాణాలు అడ్డువేస్తాం. నిశ్చింతంగా నిద్రపో" అన్నారు కోరస్‌గా.

"మరి ఫార్ములా. అది నా ఆరవ ప్రాణం" అన్నాడు డేనియల్.

"నీకు ఆరవప్రాణం అయితే అదే మాకు అసలు ప్రాణం. మరేం భయం లేదు. తెల్లవారగానే దీన్ని అమ్మే ఏర్పాట్లు చేస్తాం...పడుకో" అని వారిద్దరూ గది బయటకువచ్చి, తలుపు గడియవేశారు.. డేనియల్ మంచంమీద పడుకొని నిద్ర పోయాడు. అతని గుర్రు బయటికికూడా వినిపించేలా ఉంది.

* * *

తెల్లవారింది. నగరం మేల్కొంది.

రాత్రి జరిగిన అన్యాయాలు, అక్రమాలు, మంచిచెడులు ఏమో ఈ పగటికి తెలియవు. నిన్నలోంచి కొనసాగి వచ్చినా నేటి పగలు ఒక కొత్త శిశువే. కొత్త అనుభవాలకోసం కేరింతాలుకొట్టే కాలకన్యయే.

డేనియల్ కాలకృత్యాలు తీర్చుకొని హాలులోనికి వచ్చి కూర్చున్నాడు. శేఖర్ కూడా వచ్చాడు. ఇద్దరూ ఎదురెదురుగా కూర్చుని, ఒకరినొకరు సాభిప్రాయంగా చూసుకొన్నారు.

"మీ ఫ్రెండ్ ఏరీ?" డేనియల్ ప్రశ్నించాడు.

"మన వ్యాపారం పనిమీద వెళ్లాడు. నేనూ ఒకసారి బయటకు వెళ్ళి మనకు భోజనం ఇక్కడకు వచ్చే ఏర్పాట్లు చేసి వస్తాను. నేను కాని, మా వాడుకాని వచ్చే వరకు నువ్వుబయటకుచూడద్దు. రాత్రంతా రాయ్ మనుషులు మనకోసం అన్వేషించి

వుంటారు. ఇప్పటినుంచి జాగ్రత్తగా ఉండాలి" శేఖర్ హెచ్చరించాడు. రాయ్ మాట వినిపించగానే డేనియల్ నరంనరం భయంతో కంపించింది. అతని ముఖమంతా రక్తరంజితం అయింది.

ఏమీ మాట్లాడలేదు. శేఖర్ బయటకు వెళ్ళిపోయాడు. అతను సరాసరి జగన్నాథ్ ఆఫీసుకు వచ్చాడు. అక్కడ జగన్నాథ్ పోలీసులకు ఫోన్‌చేసిడేనియల్ వివరాలు చెప్పి,అడ్రసుఇచ్చి అతడినిఅరెస్టుచేయమని చెప్పాడు. ఇంతలో శేఖర్‌వచ్చాడు. అతనికి తను పోలీసులకు ఫోన్ చేసిన సంగతి చెప్పాడు. జగన్నాథ్ తెప్పించిన వేడి వేడి టిఫిన్‌చేసి, కాఫీ తాగాడు శేఖర్. ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు.

"ఆ ఫార్ములా సంగతి?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"నాకూ అంతుపట్టడంలేదు...ఇక్కడ యూనివర్సిటీలో 'న్యూక్లియర్ రిసెర్చి స్కాలర్' మిస్ సుధ ఉంది. ఆమెకు ఈ కాగితాలు ఇచ్చి పరిశీలించమనాలి" అని శేఖర్ తన జేబులోంచి డైరీతీసి నాలుగు కాగితాలు తిప్పాడు. అందులో సుధ ఇంటి ఫోన్ నంబరుంది. అతను ఆ నంబరు డయల్‌చేశాడు. అవతలనుంచి సుధ పలికింది. పరస్పరంకుశలప్రశ్నలయ్యాయి. సాయంత్రం అయిదు తర్వాత ఇంటికి రమ్మని చెప్పిందామె.

శేఖర్ ఫోన్ పెట్టేశాడో లేదో వెంటనే అది మళ్ళీ మోగింది. జగన్నాథ్ రిసీవర్ ఎత్తాడు. ఆత్రంగా అవతలి మాటలు విన్నాడు. ఫోన్ పెట్టేశాడు. అతని ముఖ కవళికలు వేగంగా మారాయి.

"మైగాడ్! డేనియల్‌ని హత్య చేశారట! పద అక్కడకు వెళదాం" అని శేఖర్ సమాధానానికి ఎదురుచూడకుండా జగన్నాథ్ బయటకు నడిచాడు. శేఖర్ అనుసరించాడు.

* * *

అక్కడంతా కోలాహలంగా ఉంది. పోలీసు వ్యాన్, ఒకటి రెండు జీపులు అక్కడ నిలబడి ఉన్నాయి. కొందరు జనంపోగయి గుసగుసలాడుకొంటున్నారు. వారినందరినీ తప్పించుకొంటూ శేఖర్, జగన్నాథ్ భవనం లోపలకు వచ్చారు. అక్కడ పోలీసధికారులు కూర్చుని వివరాలు చూస్తున్నారు. ఒక గది బయట ఇద్దరు కానిస్టేబుల్స్ ఉన్నారు. శేఖర్, జగన్నాథ్ అటు వెళ్ళారు. లోపలకు చూశారు.

గది మధ్యగా రక్తం మడుగులో డేనియల్ శవం పడివుంది. గదంతా దేని కోసమో వెతికినట్లు వస్తువులు, సామాను చిందరవందరగా పడివున్నాయి. ఆఖరుకు పరుపునుకూడా కోశారు ముక్కలు ముక్కలుగా.

డేనియల్ ఒంటిమీద కత్తిపోటు గాయాలు చాలావున్నాయి. అంటే హత్య చేయడానికిముందు అతణ్ణి విపరీతంగా హింసించారన్నమాట. శేఖర్, జగన్నాథ్ హాల్‌లోకి వచ్చారు. పోలీసాఫీసర్ల దగ్గర కూర్చున్నారు.

"మీరు ఇక్కడకు ఎన్నిగంటలకు వచ్చారు?" జగన్నాథ్ పోలీసాఫీసర్లని ప్రశ్నించాడు.

"తొమ్మిదిన్నరకి వచ్చాం. అంటే మీ ఫోన్ అందిన ఇరవైనిమిషాలకల్లా మేం వచ్చేశాం"

"శేఖర్! ఇక్కడ నువ్వు ఎన్ని గంటలకు బయలుదేరావ్?"

"ఎనిమిదిన్నరకి" శేఖర్ జవాబిచ్చాడు.





"అంటే నలభైనిమిషాల వ్యవధిలో ఇదంతా జరిగిపోయిందన్నమాట. ఇన్‌స్పెక్టర్! మీరు వచ్చేటప్పటికి ఇక్కడ ఎవరూ లేరా?"

"ఎవరూ లేరు"

"చుట్టుపక్కల అనుమానించదగిన వారెవరూ కనిపించలేదా?"

"లేదు"

"అంటే రాయ్ మనుషులు రాత్రి నుంచే మమ్మల్ని వెంటాడి ఇల్లుకనుక్కొని ఉండాలి. మేమిద్దరం ఇంట్లోంచి వెళ్ళి పోయామని పసికట్టి లోపల ప్రవేశించి ఉండాలి. నలుగురైదుగురు వచ్చివుంటారు. లేకపోతే ఇంత స్వల్పకాలంలో ఇల్లంతా గాలించి, తమ పని పూర్తిచేసుకొని వెళ్ళే అవకాశం తక్కువ. వాళ్ళదగ్గర ట్రాన్స్‌మీటర్లు ఉండివుండాలి. వాళ్ళ అనుచరులు నలుగురైదుగురు బయట దూరంగా నాలుగుపక్కలా తచ్చాడుతూలోపలివారికి సందేశాలు పంపించి ఉంటారు. కనకనే మీరు రావడం పసికట్టి దుండగులు చాకచక్యంగా పారిపోగలిగారు" జగన్నాథ్ అన్నాడు.

"ఇన్ని సంగతులు చెప్పారు. హంతకుడి గురించి ఏమైనా చెప్పగలరా?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

"చెప్పలేను. వూహించి చెప్పగలిగినా అతణ్ని మనం అరెస్టుచేయలేం"

"ఎందుకని?"

"అతడే హత్యచేశాడనడానికి ఇక్కడ సాక్ష్యాధారాలు ఏవీ లేవు కనక" జగన్నాథ్ తీవ్రంగా ఆలోచిస్తూ అన్నాడు.

"ఇక ఏంచేద్దాం?"

"పోస్టుమార్టమ్ వగైరా చేయించండి. ఈ హత్య పరిశోధన మా సి.బి.ఐ చేస్తుంది'' జగన్నాథ్ అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ తల వూపాడు.

బడాస్మగ్లర్‌గా పేరుమోసి, ఎందరినో నిర్దాక్షిణ్యంగా హత్యచేసిన డేనియల్ తన నేరాలకు తగినశిక్ష అనుభవించాడు. అయితే న్యాయబద్ధంగా అమలుజరిగిన శిక్షకాదు. క్రౌర్యమే వూపిరిగా, అక్రమమాలే ప్రాణంగా బతుకుగడిపే వారి జీవితాలు ఎలా ముగుస్తాయో డేనియల్ బతుకూ అలానే ముగిసింది.

అతని శవాన్ని అంబులెన్స్‌లో ఎక్కించారు.

## 5



మిస్ సుధ ఇల్లు చాలా అందంగా, ఆడంబరంగా ఉంది. పెద్ద ఇనుపగేటు. చుట్టూ ప్రహరీగోడ. శ్రద్ధగా పెంచిన తోట మధ్యన ఒక చిన్న జమీందారీ మేడలా వుంటుంది. ఉద్యోగం, ఆదాయం దృష్ట్యా చూస్తే మామూలువాళ్ళు ఆ మేడలోవుండలేరు. అయితే సుధ సంపన్నుల పిల్ల. ఆ మేడను ఆమె తండ్రి కట్టించి పోయాడు. ఆమెకు తోబుట్టువులెవరూ లేరు. తల్లి మేనమామ ఇంట ఉంటుంది. న్యూక్లియర్ ఫిజిక్స్‌లో ప్రథమంగా ఉత్తీర్ణురాలయిన సుధ ప్రస్తుతం రిసెర్చిచేస్తోంది.

క్రమశిక్షణకు, మాట నిలకడకు ఆమె ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుందని తెలిసిన



వారంటారు. రిసెర్చి పూర్తి అయ్యేవరకు పెళ్ళిచేసుకోరాదని ఆమె నిర్ణయం. ఇంటి దగ్గర కూడా ఆమె చిన్న లేబరేటరీ ఏర్పాటుచేసుకొంది. తన పరిశోధనను నిర్విరామంగా కొనసాగించడం ఆమె నైజం. యూనివర్సిటీలో పని కాగానే తిన్నగా ఇంటికి వచ్చి కొంచెం సేపు విశ్రాంతి తీసుకుని లేబరేటరీలోకి వెళ్ళిపోతుంది. సరిగా అదే సమయానికి










ఈరోజు జగన్నాథ్, శేఖర్ ఆ ఇంటికి వచ్చారు. బజర్ మోగించారు.

పనిమనిషి వచ్చి తలుపుతీసి, వారిని లోపల హాలులోకి తీసుకువెళ్ళి కూర్చో పెట్టింది.

"అమ్మాయి లేబరేటరీలో వుంది... పిలుస్తా" అని చరచర ఒక తలుపు తెరుచుకొని లోపలకు వెళ్ళిపోయింది.

ఇద్దరూ ఆ ఇంటిని పరిశీలించారు. ఆ హాలులోనుంచి బయటకు రెండు కిటికీలున్నాయి. ప్రధాన ద్వారంవద్దనే స్విచ్ లున్నాయి.

హాలులో గోడలకు సుధ పూర్వీకులవి కా బో లు తైలవర్ణ చిత్రాలున్నాయి.

ఐన్‌స్టయిన్, నీల్స్‌బోర్ వంటి శాస్త్రవేత్తల ఫొటోలున్నాయి.

వారి మౌనాన్ని, నిరీక్షణను భంగ పరుస్తూ తలుపు చప్పుడయింది. అటు చూశారు. సుధ వస్తోంది.

సంధ్యవేళ విరిసిన మల్లెపూవులా ఉందామె. నుదుట బొట్టు అందంగా మెరుస్తోంది. గులాబిరంగు ఒంటికి తెల్లటిచీర కట్టింది. పొందికైన అవయవాలు ఆమెవి. కళ్ళలో ప్రతిభావిశేషం అయస్కాంతంలా మెరుస్తోంది. ఎలాంటి మగవాడినయినా సరే అప్రతిభుణ్ని చేసే సౌందర్యం ఆమెది.

''మీరు పదినిమిషాలు ఆలస్యం చేశారు" అందామె వస్తూనే.

"అవును. స్కూటర్ ట్రబులిచ్చింది" శేఖర్ అన్నాడు.

ఆమె కూర్చుంది.

"మనం ఇంటర్నేషనల్ సైన్స్ సెమినార్'లో కలసినట్లున్నాం" అంది ఆమె శేఖర్‌ని చూసి.

"అవును. తర్వాత ఆలిండియా సైన్స్ కాంగ్రెస్‌లో కూడా కలిశాం" శేఖర్ తమ పూర్వపరిచయాన్ని బలపరిచాడు.

"వీరు?" సుధ ప్రశ్నార్థకంగా చూసింది.

"నా ఫ్రెండ్ జగన్నాథ్" శేఖర్ ఇంకా ఏదో చెప్పబోయాడు.

''సి. బి. ఐ.'' అని సుధ మధ్యలో అంది. ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

''మీ ఫ్రెండ్ రవీంద్ర నాకు తెలుసు. అతను మీ గురించి చెప్పాడు'' అందిఆమె వారి సందేహాన్ని అడగకుండానే నివృత్తి చేస్తూ.

"మేం వచ్చినపని..."

"ఏమిటి?''

శేఖర్ తనదగ్గరవున్న కాగితాలు తీసి ఆమెకు అందించాడు. ఆమె ఆత్రంగా పరిశీలించింది. కొన్ని కాగితాలపై లెక్కలు వేసివున్నాయి. కొన్ని కాగితాలపై పటాలు గీసివున్నాయి. ఆమె వాటిని పరిశీలిస్తూనే మధ్యమధ్య శేఖర్‌ని, జగన్నాథ్‌ని ప్రశ్నార్థకంగా చూసింది.

ఇంతలో పనిమనిషి కాఫీలు తెచ్చి ఇచ్చింది. ముగ్గురూ తాగసాగారు.

''ఈ కాగితాలు...?''ఆమె అర్థోక్తిలో ఆగింది.

"మీరు పరిశీలించి చెప్పాలి. ఇవేవో అణుసాంకేతికాలు, గణితాలుఅనిపించింది. నాకు అణుశాస్త్రం తెలియదు. మీరు చూసి చెప్తారని తెచ్చాం'' శేఖర్ అన్నాడు.

"ఇవి ఎవరివి? ఎక్కడివి??" ఆమె సవాలు వేసింది.

"డాక్టర్ వెంకట్రావ్ పేరుతెలుసుగా?" జగన్నాథ్ అన్నాడు.

"అణుభౌతిక-గణితశాస్త్ర బృహస్పతి ఆయన తెలీకపోవడం ఏమిటి? పాపం... అకాలమృత్యువు చెందాడు'' ఆమె అంది.

"ఇవి ఆయన వేసిన లెక్కలు. ఇదేదో పెద్ద ఫార్ములా అయుంటుందని మా నమ్మకం. మీరు దీని రహస్యం విప్పాలి" శేఖర్ అన్నాడు.

"తప్పకుండా. వెంకట్రావ్ ఫార్ములా గురించి పరిశీలించడం నాకెంతో ఆనందదాయకం. కానీ ఒక అనుమానం. మీకవి ఎలా వచ్చాయి?" ఆమె అడిగింది.

శేఖర్, జగన్నాథ్ ఆమెకు ఆ పత్రాలు ఎలా వచ్చిందీ వివరించి చెప్పారు. ఆమె ఏదో కథ వింటున్నట్లు ఆసక్తిగా అంతా వింది.

"ఇంకో అనుమానం" ఆమె అంది. వారిద్దరూ ''ఏమిటన్నట్లు" చూశారు.

''ఇవి చాలా కీలకమైన కాగితాలని




తోస్తోంది. వీటి నకళ్ళు లేకుండా నామీద నమ్మకంతో వీటిని చూడనిస్తారా?"

"ష్యూర్! ష్యూర్" అన్నారిద్దరూ.

"నామీద అంత నమ్మకం ఉందా?" ఆమె కళ్లు చక్రాల్లా తిప్పి, వారిని సూటిగా ప్రశ్నించింది.

"భారత ప్రభుత్వం తరపున అణు పరిశోధనలు జరుపుతున్న మిమ్మల్ని అనుమానించే కుసంస్కారం మాకు లేదు" అన్నారిద్దరూ భావోద్వేగంతో.

"ఆల్‌రైట్! నాపై అంత విశ్వాసం ఉన్నందుకు థాంక్స్! ఇంకో సంగతి... వీటిని మీరిలా జేబులో పెట్టుకొని తిరగడం భావ్యంకాదు. భద్రతాకాదు"

"వీటి రహస్యం మీరు చెప్తే ఆ వివరాలతో వీటిని మేం ప్రభుత్వానికి పంపిస్తాం"

"అలా అన్నారు బావుంది. రాత్రి పది దాటాక రండి. వీటి పరిశీలన పూర్తి చేసి ఇస్తాను" ఆమె లేచి నిలబడింది. ముందు వారిద్దరూ తటపటాయించారు. కాని ఆమెను "అనుమానించడం", "కుసంస్కారం" అని తామే అన్నారు గదా! చేసేదిలేక లేచారు.

"రాత్రి పదిగంటలకు కరక్టుగా రండి" అని ఆమె లేబరేటరీవైపు కాగితాలతో వెళ్ళిపోయింది. వారిద్దరూ బయటకు వచ్చి స్కూటరెక్కారు. పనిమనిషి తలుపు వేసేసింది.

*  *  *

సుధ లేబరేటరీలో ఆ కాగితాలు పరిశీలిస్తోంది. అవి అసాధారణ మేధా సంపన్నుడయిన గణిత శాస్త్రవేత్త వేసిన అంకెలు, కూడికలు, తీసివేతలు, గుణకారాలు, భాగహారాలు- ఇవే కదా లెక్కలు అంటే. ఒకటినుంచి తొమ్మిదివరకు అంకెలు, ఆపై 'సున్నా' అనే అంకం. ఇవే ప్రపంచంలోని అన్ని లెక్కలకు మూలం. ఈ అంకెలు స్థానచలనం, స్థాన భ్రంశం చెందితే విలువలు పెరుగుతాయి. ప్రమాణాలు తరుగుతాయి. ఒక సమస్యకు సమాధానం లభిస్తుంది. ప్రపంచంలోని "సత్యం అంతా ఒక్కటే" అని గణితం ద్వారా నిరూపించాలని శ్రీనివాసరామానుజన్ ప్రయత్నించాడట.

ప్రకృతిలోని శక్తులు నాలుగూ ఒక్కటే అని నిరూపించడానికి ఐన్‌స్టెయిన్, అబ్దుల్ సలాం వంటి శాస్త్రవేత్తలు కూడా గణితాన్నే ఆలంబనం చేసుకొన్నారు. గురుత్వాకర్షణ శక్తి, అయస్కాంతశక్తి, విద్యుచ్ఛక్తి, అణుశక్తి-ఇవి ప్రకృతిలోని నాలుగురకాల శక్తులు. ఇవి నాలుగూ రూపాంతరం చెందిన ఒకే శక్తి అని నిరూపించాలన్నదే భౌతిక శాస్త్రవేత్తల తపన. గణిత శాస్త్రవేత్తల ప్రయత్నం.

ఆ ప్రయత్నంలో భాగంగానే ఐన్‌స్టెయిన్ సాపేక్ష సిద్ధాంతం ఆవిర్భవించింది. ప్రత్యేక సాపేక్ష సిద్ధాంతాన్ని కూడా ఆయన ప్రతిపాదించాడు. అది స్థలకాలాలకు సంబంధించింది.

ఈ సూత్రాలు అన్నింటికీ మూలం, ప్రేరణ ప్రకృతిలోని మూలకాలే. మూలకాలు అంటే సామాన్య, అసామాన్య పరిస్థితులు కల్పించి నిర్మాణాన్ని మార్చలేని అతి సూక్ష్మ ద్రవ్యరాశి. ఇవి అణువులతో నిర్మితమైనవి. అణువు మరల ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు అనే పరమాణువులతో ఏర్పడతాయి. బంగారం, వెండి, ఇనుము వంటివి మూలకాలు. ఇలాంటి మూలకాలు దాదాపు నూటరెండు వరకు ఉన్నాయని గుర్తించారు.

వీటిలో యురేనియం, ప్లుటోనియం వంటి మూలకాలు రేడియో ధార్మికశక్తి గలవి. వీటినుపయోగించి బాంబులు తయారుచేస్తారు.

అణుగర్భాన్ని ఛేదించడం ద్వారా శక్తి విడుదల అవుతుంది. దీనిని విచ్ఛిన్న క్రియ 'ఫిషన్' అంటారు. ఇదొక ప్రక్రియ. ఒక అణుగర్భంలోనికి అదనంగా పరమాణువును పంపి కలపడం ద్వారా కూడా శక్తి విడుదలవుతుంది. ఇది సంయోగక్రియ. దీనిని 'ఫ్యూషన్' అంటారు. అణువిద్యుత్కేంద్రాలలోనూ, అణుబాంబులలోనూకూడా ఈరెండింటిలో ఏదో ఒక ప్రక్రియను ఉపయోగించి శక్తిని సాధిస్తారు.

ఈ రెండు ప్రక్రియలలోనూ రెండు లోపాలున్నాయి. అణువిచ్ఛేదనం జరిగినప్పుడు ద్రవ్యరాశితో సమానమైన రీతిలో అంటే అనులోమానుపాతంలో శక్తి వెలువడదు. ఉపయోగించిన ద్రవ్యరాశినుండి కొంత మాత్రమే విచ్ఛేదమై శక్తి వస్తుంది. అలాగే యురేనియం వంటి మూలకాలను మాత్రమే ఉపయోగించాలి. ప్రకృతిలో విరివిగా లభించే 'సిలికాన్' వంటి మూలకాల్ని అణుశక్తి సాధనకు ఉపయోగించే అవకాశం లేదు.

వెంకట్రావు ఈ రెండు సమస్యల్ని పరిష్కరించే సిద్ధాంతాన్ని గణితశాస్త్ర రీత్యా సాధించాడు. పైగా 'సిలికాన్' వంటి కింది తరగతి మూలకాన్ని అణుశక్తి సాధనకు ఉపయోగించవచ్చునని అతను లెక్కలు వేశాడు. అవే ఆ కాగితాలలోని లెక్కలు. వాటిని చూసి సుధ ఆశ్చర్యపోయింది.

ఆ లెక్కలన్నీ 'సిలికాన్ అణుబాంబు'ను ఎలా తయారుచేయాలో వివరించిన సూత్రానివి. మరి పటాలు...వాటి సంగతి ఏమిటి? సుధ వాటిని నిశితంగా పరిశీలించింది. ఆమెకు ఆశ్చర్యం వేసింది. ఈ భూగోళంలోని మూడు వంతుల భాగాన్ని సునాయాసంగా సముద్రంలో ముంచివేసే ప్రణాళిక అది. ఏయే భాగాల్ని ఏవిధంగా నాశనం చేయాలో ఆ పటాలు వివరిస్తున్నాయి.

ప్రపంచాధిపత్యం కోరుతున్న ఒక మనిషి మేధస్సు సృష్టించదలచిన విలయహేలకు నమూనాలు ఆ పటాలు.

సుధ ఆ పత్రాల పరిశీలన పూర్తి చేసింది. సమయం తొమ్మిది గంటల నలభై అయిదు నిముషాలు అయింది. ఇంకో పావుగంటలో వాళ్ళు మరల వచ్చేస్తారు. 'త్వరగా ఫోన్ చేయాలి' అనుకొంటూనే ఆమె ఒక నంబరు డయల్ చేసింది.

* * *

గోడ గడియారం పదిగంటలు కొడుతోంది. ద్వారం దగ్గర శేఖర్, జగన్నాథ్ నిలబడి బజర్ మోగిస్తున్నారు. పనిమనిషి తలుపు తీసింది. ఈసారి ఆమె వారిని హాలులోకాక పక్కగదిలో కూర్చోబెట్టింది. ఆ గదికి రెండు కిటికీలు తోటవైపు ఉన్నాయి. వాటికి గ్లాసు బిగించారు. జగన్నాథ్ గదిని పరిశీలించాడు. శేఖర్ ఒక కుర్చీలో కూర్చున్నాడు ... జగన్నాథ్ కూడా కూర్చున్నాడు.

సుధ వచ్చింది. ఈసారి ఆమె నీలం రంగు గౌన్ వేసుకొంది. ఆమె నడిచి వస్తుంటే నక్షత్రం అడుగులు వేస్తున్నట్టుంది. ముఖం అలిసిపోయినట్లు కనిపిస్తోంది.

"మీరు రెండునిముషాలు లేటు" శేఖర్

నవ్వుతూ అన్నాడు. ఆమె కూడా వెన్నెల పాకినట్లు నవ్వి, హాలంతా కనిపించేటట్లు కుర్చీని సరిచేసుకొని కూర్చుంది. శేఖర్‌కి, జగన్నాథ్‌కి హాలులో ఏం జరిగినా కని పించదు. వారు గది గోడవైపు ముఖం పెట్టి కూర్చున్నారు. హాల్లోకి ముందు ఎవరు వచ్చినా ఆమెకు కనిపిస్తారు గానీ వారికి కనిపించరు.

"ఆ పత్రాలు..." జగన్నాథ్ ప్రారం భించాడు.

"నా దగ్గర జాగ్రత్తగానే ఉన్నాయి" ఆమె అంది.

"వాటి వివరం?" శేఖర్ అడిగాడు.

"అది సిలికాన్‌బాంబు. నిర్మాణం సాధ్యమేనని గణితశాస్త్రరీత్యా నిరూపిం చిన సిద్ధాంతం"

"అంటే? వెంకట్రావు మరొక్కరకం బాంబును నిర్మించే ఫార్ములా తయారు చేశాడా?"

"అవును...మీకు అణుశక్తి గురించి తెలుసుననుకొంటాను"

"తెలుసు...నిర్ణీతకక్ష్యలలో తిరిగే పరమాణువుల్ని విచ్ఛేదించినట్లయితే శక్తి విడుదల అవుతుంది" వారన్నారు.

"ఈనాడు యురేనియంవంటి అరు దైన భారమూలకాలతోనే అణుశక్తిని మనం సాధిస్తున్నాం. విస్తృతంగా దొరికే సిలికాన్‌తో చౌకగా బాంబు తయారుచేసే పద్ధతిని వెంకట్రావు ఇందులో పొందు పరిచాడు"

"సముద్రపు ఇసుకనిండా బోలెడు 'సిలికాన్' లభిస్తుంది. దానితో బాంబులు చేయడం మొదలుపెడితే ఎంత ప్రమాదం" శేఖర్ అన్నాడు.

"అసలు ఇదెలా సాధ్యం?" జగన్నాథ్ అడిగాడు.

"సిలికాన్ అణుభారం 28 అని మనం దరికీ తెలుసు. ఈ భారాన్ని 32కి పెంచి సారూప్య మూలకాన్ని (ఐసోటోప్) తయారుచేయాలి. దానిని విచ్ఛేదిస్తే భయంకరమైన విస్ఫోటం జరుగుతుంది. ఈ సిద్ధాంతాన్నే వెంకట్రావు ప్రతి పాదించారు. దీనికి ఖర్చు తక్కువ అవు తుంది. ఇంకో ఉపయోగంకూడా ఉంది"

"ఏమిటది?"

"ఈనాడు మనకు అందుబాటులో ఉన్న అణుసాంకేతిక ప్రక్రియల ప్రకారం నియమిత రూపంలోనే మూలక ద్రవ్యాన్ని వాడాలి. దానినుంచి పరిమితం గానే అణుశక్తి విడుదల అవుతుంది. అంటే పూర్తి శక్తి మనకు అందడంలేదన్న మాట. కాని వెంకట్రావ్ పద్ధతిప్రకారం ఎంతైనా 'సిలికాన్'ని వాడవచ్చు. పూర్తి శక్తిని సంపాదించవచ్చు. అంటే తక్కువ ఖర్చుతో ఎక్కువ అణుశక్తిని సంగ్ర హించేపద్ధతి ఇది" ఆమె వివరించింది.

"వెంకట్రావు ఇది ఎందుకు తయారు చేసినట్లు?" శేఖర్ ప్రశ్నించాడు.

ఆమె భావస్ఫోరకంగా నవ్వింది.

"ఐన్‌స్టెయిన్ 'ఇ=ఎం.సి' సిద్ధాం తాన్ని ఎందుకు ఆవిష్కరించాడంటే ఏంచెప్తాం? మెదడు ఎప్పుడూ సత్య త్వాన్ని అన్వేషిస్తుంది. సృజనాత్మకత ఎప్పుడూ ఏదో ఒక కొత్త ప్రక్రియను రూపొందించాలని వువ్విళ్ళూరుతుంది. ఇదీ అంతే!" అంది సుధ.

"మరి ఆ పటాల సంగతి?" జగన్నాథ్ ప్రశ్నించాడు. సుధ కొంచెంసేపు గంభీర మౌనం పాటించింది. ఆ సమయంలో ఆమె ముఖం ఏ దివ్యతారకయో సమాధి స్థితిలో ఉన్నట్లు ప్రకాశించింది.

"ఈ ప్రపంచాన్ని సర్వనాశనంచేసే

వూహకి ఆ పటాలు నమూనాలు" అన్నాడు.

"అంటే ఆ కాగితాలలో కొన్ని సిద్ధాంతానికి సంబంధించినవి, మిగిలినవి ఏదో కుట్రకు సంబంధించినవన్నమాట"

"అవును. ఎలాంటి ఆయుధాలు, సైనికులు లేకుండా ఈ ప్రపంచంపై ఆధిపత్యాన్ని సాధించే ప్రణాళిక అది" సుధ భావగర్భితంగా అంది.

"అదెలా?"

"సముద్రజలాల్ని పొంగించి భూమిని ముంచెత్తే ప్రణాళిక ఇది. ఈ ప్రణాళికకు ఆధారం జర్మనీ శాస్త్రవేత్త ఒకరు ఇరవైయేళ్ళనాడు రూపొందించిన సిద్ధాంతం"

"ఏమిటా సిద్ధాంతం?"

"ప్రతియేటా సముద్రతలం పైకి పెరుగుతుంటుంది. అయితే దానితోబాటు భూతలంకూడా ఎత్తు పెరుగుతుంది. కనక మనకు సముద్రమట్టం పెరిగినట్లు తెలీదు. ఇది ఆ జర్మనీ శాస్త్రవేత్త చెప్పిన సిద్ధాంతం"

"సముద్రమట్టం పెరగడానికి కారణం?"

"ఉత్తర, దక్షిణ ధ్రువాలమీది మంచు కరిగి సముద్రాలలో కలుస్తుంటుంది. అందుకని మట్టం పెరుగుతుంది. సముద్ర మట్టంతోబాటు భూఉపరితలం పెరగకపోతే అయిదువేల ఏళ్ళకు భూమి సముద్రంలో మునిగిపోయేది" అని ఆగింది సుధ.

"అలాకాక హఠాత్తుగా ఆ ధ్రువాలమీది మంచును కరిగించివేసినట్టయితే ఏమవుతుందో తెలుసా?" ఆమె ప్రశ్నించింది.

"భూగోళం జలమయం అవుతుంది" వారు అన్నారు.

"కాదు. ఈ హఠాత్పరిణామంవల్ల సగం భూమండలం మాత్రమే నీటిలో మునుగుతుంది. సముద్రమట్టానికి బాగా ఎత్తుగా ఉన్న దేశాలు, పర్వతాలు నీటిలో మునగవు. ధ్రువాలమీది మంచును కరిగిస్తే ఏయే ప్రాంతాలు మునిగిపోతాయో, ఏయే ప్రదేశాలు తేలివుంటాయో ఆ పటాలలో విపరించబడి ఉన్నాయి" అని ఆమె పటాలు చూపించింది.

వారిద్దరూ ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు.

"సిలికాన్ బాంబును తయారుచేసి దక్షిణ ధ్రువంపై ప్రయోగిస్తే ఆ వేడికి మంచు కరిగి ఏరులై ప్రవహించి, సముద్రాన్ని చేరుతుంది. సముద్రం తాళోత్తాలంగా విరుచుకొని పడుతుంది. భూమండలంమీద చాలా భాగం ఆ జలప్రళయంలో మునిగిపోతుంది. అప్పుడు మిగిలిన భూభాగంపై అధిపత్యం సాధించడం సులభం. అంటే ఎక్కువ సైనికబలం, ఆయుధబలం, వ్యయభారం లేకుండానే ఈ విజయాన్ని సాధించవచ్చు. పైగా న్యూట్రాన్ బాంబు ప్రయోగం జరిగినట్లు ఎవరికీతెలీదు. సాగరాలు పొంగి,నగరాలు, గ్రామాలు కొట్టుకొనిపోయాయని అందరూ అనుకొంటారు. రెండు ధ్రువాల మీద రెండు న్యూట్రాన్ బాంబుల ప్రయోగం జరిపితే చాలు"

"ఏం జరుగుతుంది?"

"ఆ జల ప్రళయంలో ఈ ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థలు అన్నీ కొట్టుకొనిపోతాయి. దేశాలు నామరూపాలు లేకుండా అయిపోతాయి. జీవరాశి నామమాత్రంగా మిగులుతుంది. అదృష్టవంతులు ప్రాణాలతో మిగులుతారు. వారు అశక్తులై మిగులుతారు.



వారిపై ఆధిపత్యం చెలాయించడం ఎలాంటి వారికైనా సులభం. వ్యవస్థలేని సమాజంపై జులుం చెలాయించడం అరచేతి విద్య అవుతుంది. అందుకే ఈ వ్యూహాన్ని రచించాడు వెంకట్రావ్"

ఆమె చెబుతున్నంతసేపు కళ్ళముందు కూలుతున్న మంచుకొండలు, కరిగిపోతున్న హిమఖండాలు, పారుతున్న నదీనదాలు, విరుచుకొని పడుతున్న సముద్ర కెరటాలు, జన సందోహపు హాహాకారాలు కనిపించాయి వారికి. చివరగా ఆమె 'వెంకట్రావు' పేరు చెప్పి ఆపడంతో వారు వూహాలోకంలోంచి తేరుకొన్నారు.

"ఈ వ్యూహాన్ని వెంకట్రావు రచించాడా?" వారిద్దరూ ఎంతో ఉద్వేగంతో అడిగారు.

"అవును" ఆమె చాలా నిర్లిప్తంగా అంది.

"ఎందుకు?" వారి ప్రశ్న.

"ఈ ప్రపంచాన్ని తన అరచేత నడిపించాలని అతని ఆరాటం. అందుకే కొన్నాళ్ళు పరిశోధనలు చేసి, పిచ్చెక్కినట్లు నటించి పరారీ అయ్యాడు"

"కోట్లాది ప్రజల ఆర్తనాదాలను, లక్షలాది ప్రజల మృత్యు నిద్రను అతను కాంక్షించాడా?"

"మానవజాతి చరిత్ర సమస్తం రక్తప్లావితం, ఆర్తనాదా సంభరితం కాక మరేమిటి? అధికారం హత్యాకాండతో కాని హస్తగతం కాదు. ఇది చరిత్ర సత్యం" ఆమె అంది.

"అతనిది మూర్ఖత్వం" జగన్నాథ్ అన్నాడు.

"మీ దృష్టిలో కావచ్చు. కాని అతని దృష్టిలో, అతని మిత్రుల దృష్టిలో మాత్రం కాదు" ఆమె బిగ్గరగా అంది.

"అతని మిత్రులంటే..."

"త్వరలో ఇక్కడకు రాబోతున్నారు"

"వారెవరు?"

"కెప్టెన్ సుందరరాయ్, శేఠ్ చందన్‌లాల్, ఎం.పి.మాలవీయా" ఆమె గుమ్మం వైపు చూస్తూ అంది. ఇందాక ఫోన్ చేసినప్పటి నుండి వారికోసమే తదేకంగా నిరీక్షిస్తోంది.

"ఇందుకేనా వారి కాగితాల కోసం తెగ ప్రయాసపడిపోతున్నారు" శేఖర్ అన్నాడు.

"అవును. వారిలో ఒకరు సైనికాధికారి. మరొకరు పెట్టుబడిదారు. వేరొకరు రాజకీయవాది. అంటే ఒకరు యుద్ధానికి అధ్వర్యుడు. వేరొకరు ఉద్గాత. ఇంకొకరు కర్త. ఏ సమాజంలో అయినా ఈ ముగ్గురూ కలియక తప్పదు. అందుకే ఇప్పుడు వారు ఈ వ్యూహానికి కర్తలవుతున్నారు. సిలికాన్ బాంబు తయారు చేయడానికి చందన్‌లాల్ పెట్టుబడి పెడతాడు. సైనిక వ్యూహాన్ని రాయ్ నిర్వహిస్తాడు. రాజకీయ శక్తిని మాలవీయా సమీకరిస్తాడు" సుధ విలాసంగా నవ్వింది.

ఒక అణుశాస్త్రవేత్తలో ఇంతటి భయంకర విషాగ్నికీల వుందని వారూహించలేకపోయారు. అతి కీలకమైన అతని కాగితాలు ఈమె చేతిలో పెట్టి తాము పొరపాటు చేశారు. ప్రమాదంలో ఇరుక్కొన్నారు. సద్యఃస్ఫూర్తితో తప్పించుకొనడంవినా మార్గాంతరం లేదు.

''మరి వెంకట్రావు పడిన శ్రమ?'' శేఖర్ అడిగాడు ఆశ్చర్యంగా.

''బూడిదలో పోసిన పన్నీరైంది. సిలికాన్ బాంబును తనే తయారుచేసి, జలప్రళయాన్ని సృష్టించి తనొక్కడే ప్రపంచ నియంతను కావాలనుకొన్నాడు.





కాని అతని దురాశ అతన్నే బలిగొంది. డేనియల్ అతన్ని చంపేశాడు. అధికార చదరంగంలో పూర్ ఫెలో.... వెంకట్రావు బలి అయిపోయాడు" ఆమె కర్కశంగా అంది.

"మిస్ సుధా! ఇప్పటికయినా మించి పోయింది లేదు. ఆ పత్రాలు తగుల బెట్టేద్దాం. ప్రపంచాన్ని జలప్రళయం నుంచి కాపాడదాం" జగన్నాథ్ అన్నాడు.

"నో నో జగన్నాథ్! వాటిని తగిన వారికి ఇచ్చేయాలి వాళ్ళని రమ్మని ఫోన్ చేశాను. ఈపాటికి వస్తుంటారు" సుధ గేటువైపు దృష్టి సారించింది. ఆమె మాట పూర్తి అయేసరికి గేటు దగ్గర కారు ఆగింది.

"అదిగో...వచ్చేశారు. తీసుకువస్తా" అని ఆమె టకటక అడుగులు వేసుకొంటూ గేటువైపు నడిచింది.

"చాలా తప్పుపనిచేశాం. ఆ కాగితాలు ఒక కాపీ తీసి ఉంచుకోవాల్సింది మనం"

జగన్నాథ్ నెమ్మదిగా అన్నాడు.

"ఈమెను నమ్మడం నా తప్పు. ఇప్పుడెలా ఇక్కడనుంచి తప్పించు కోవడం" శేఖర్ అన్నాడు.

"ఇదిగో నాదగ్గర పిస్తోలుంది..తీసుకో" అని జగన్నాథ్ పిస్తోలును శేఖర్‌కి అందించాడు.

"మరి నీకు?"

"నేను కరాటే ప్రయోగించి తప్పించు కొంటాను. నువ్వు సమయం చూసి పిస్తోలు ప్రయోగించు" జగన్నాథ్ నెమ్మదిగా అన్నాడు. శేఖర్ కోటు జేబులో రహస్యంగా పిస్తోలు ఉంచు కొన్నాడు. ఇద్దరూ ఒక్కసారి గదంతా కలియజూశారు.

అక్కడనుంచి పారిపోవాలంటే రెండే మార్గాలున్నాయి. ఒకటి ద్వారంలోనుంచి పారిపోవడం. అది సాధ్యం అయేపని కాదు..సురక్షితమూకాదు. రెండవ మార్గం-గది కిటికీ అద్దాలు పగులకొట్టుకొని చాక చక్యంగా పారిపోవాలి. ఇందుకు సమయ స్ఫూర్తి, వేగం అవసరం.

ఇద్దరూ ఒక నిశ్చయానికి వచ్చి ద్వారం వైపు చూడసాగారు. సుధ వెంట ముగ్గురు మనుషులు వస్తున్నారు. ఒకరు కెప్టెన్ రాయ్, రెండవవారు చందన్‌లాల్, మూడవవారు మాలవీయా. ముగ్గురి ముఖాలలో వింత ఆనందం, విచిత్రమైన తృప్తి తాండవిస్తున్నాయి. ఆమె కూడా వారి ముఠాలో మనిషేనని ఇపుడు స్పష్ట మయింది. వారి ఆశ్చర్యానికి అంతులేదు.

అందరికన్న ముందు రాయ్ గది లోపలకు వచ్చాడు. అతని వెనుక మిగిలినవారు అనుసరించారు.

"హలో మిస్టర్ శేఖర్! గుడ్‌మార్నింగ్. ఓ మిస్టర్ జగన్నాథ్ సి.బి.ఐ." కెప్టెన్ రాయ్ వారిద్దరినీ పరిహాసపూర్వకంగానే విష్‌చేశాడు. శేఖర్, జగన్నాథ్ ఇబ్బంది గానే ప్రతి నమస్కారం చేశారు.

"సారీ సుధా! నీ ఫోన్ వచ్చేసరికి మేం అక్కడలేం. అందుకే ఆలస్యం. అయింది. అపుడైన ఈ మన అతిథులకి ఇబ్బంది ఏమీ కలగలేదు కదా" రాయ్ వ్యంగ్యంగానే అన్నాడు.

సుధ అటువంటిదేం లేదన్నట్లు తల వూపింది. శేఖర్ నెమ్మదిగా కిటికీవైపు కదిలాడు. జగన్నాథ్ ద్వారం వైపు అడుగువేశాడు. వారి కదలికల్ని రాయ్ సున్నితంగా పరిశీలిస్తూనే ఉన్నాడు.

"ఆ కాగితాలు ఏవీ?" చందన్‌లాల్ గుజరాతీ యాసలో అడిగాడు.

"ఇక్కడే డ్రాయరుమీద పెట్టాను'' సుధ అంది అటువైపు చూస్తూ.

''ఇక్కడేమీలేవే?'' రాయ్ అన్నాడు ఆ డ్రాయర్ మీదకి దృష్టి మరలించి. అందరి కనులు అటువైపు తిరిగాయి. అదే అదనని శేఖర్ పిస్తోలు పేల్చి దీపం ఆర్పేశాడు. మెరుపులా కిటికీ అద్దాల్ని దభాలున తన్నాడు. గాజు అద్దాలు భళ్ళున చప్పుడుచేసి పగిలాయి. బరువైన వస్తువు కిందపడిన ధ్వని వినవచ్చింది.

కొంతసేపు చీకటి. పెనగులాట ... అడుగులచప్పుడు... ఇంతలో సుధ అలవాటు ప్రకారం చీకట్లోనే కదిలి మరో స్విచ్ వేసింది. ఆ గదిలోనే ఉన్న ఇంకో బల్బు వెలిగింది. ఆ కాంతిలో అందరూ అందర్నీ చూసుకొన్నారు.

ద్వారానికి అడ్డంగా రాయ్ సింహంలా నిలబడి ఉన్నాడు. అతని పక్కనే మాల వియా ఎలుగు బంటిలా ఉన్నాడు. చందన్ లాల్ చేతిలో రివాల్వరు ఉంది. కిటికీ దగ్గర గాజు పెంకులు పడి ఉన్నాయి. కొద్దిపాటి గాయాలతో శేఖర్ నిస్సహాయంగా నిలబడి ఉన్నాడు. కిటికీలోంచి దూకి పారిపోవాలని చేసిన అతని ప్రయత్నం ఫలించలేదు. ఆ కిటికీకి అవతల ఇనుప చట్రం బిగించి ఉంది. అది తెలియక అతను వేసిన ఎత్తు బెడిసి కొట్టింది. జగన్నాథ్ కరాటే పోజులో ముందుకు దూకే కొదమసింగంలా ఉన్నాడు. అందరి మధ్య సుధ చిరునవ్వులు చిందిస్తూ నిలబడింది.

క్షణకాలం ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు. అందరి ముఖాలు పరిశీలించుకొన్నారు. అందరిలో అప్రమత్తత తాండవిస్తోంది. కోపం, నిస్సహాయత ప్రజ్వరిల్లుతున్నాయి. ఒకరినొకరు ఘూర్ణిల్లినట్లు చూసుకొన్నారు.

"ఆలోచించాల్సిన తరుణంలో ఆయుధ ప్రయోగాలకు ప్రయత్నిస్తారెందుకు? మీరందరూ మేధావులు! ఒకరినొకరు హత్య చేసుకొనడానికి ప్రయత్నించకండి. చేతులు కలిపి పరస్పరం సహకరించుకోండి" సుధ అంది ఏదో సందేశం ఇస్తున్నట్లు.

ఆమె మాటల అంతర్యం రాయ్ గ్రహించాడు. జగన్నాథ్ పసికట్టాడు. శేఖర్ దగ్గర ఉన్న కాగితాలు సంపాదించడం ముఖ్యం అని రాయ్ భావించాడు. పెళ్ళతో స్నేహం చేయకపోతే ప్రాణాలకే ప్రమాదం అని సుధ హెచ్చరిస్తోందని జగన్నాథ్ వూహించాడు. అందరి దృష్టి సుధ వైపు కేంద్రీకృతమైంది. క్రమంగా వారు ఆమె దగ్గరగా వచ్చారు.

"మిస్టర్ జగన్నాథ్! మీరు అతి లాఘవంగా దాచిన ఆ కాగితాలు ఇచ్చేయండి. మిస్టర్ శేఖర్...మీ దగ్గరున్న పటాలు ఇలా ఇవ్వండి" సుధ గద్దించింది.

"ఇవ్వకపోతే?" ఇద్దరూ ఛీత్కరించారు.

"ప్రాణాలు తీసేస్తాం" ముగ్గురు మగధీరులు హెచ్చరించారు.

"ప్రాణాలు పోయినా మేం ఆ కాగితాలు ఇవ్వం. అవి మాతోనే జీర్ణించి పోవాలి" అని వారిద్దరూ ఆ కాగితాలు తీసి నలిపి నోటిలో పెట్టుకోబోయారు. వాటిని నమిలివేయాలని వారి ఉద్దేశం.

వారాపని చేయకుండా చందన్‌లాల్, మాలవియా అడ్డుకొన్నారు. వారి చేతుల్ని బలంగా పట్టుకొన్నారు. సుధ ఏమనుకొందో గబగబ లేబ్‌లోనికి వెళ్ళి ఒక సీసా తెచ్చింది.

అప్పటికి వారిదగ్గర కాగితాలు




తీసుకొని రెక్కలు విరిచి పట్టుకొన్నారు. శేఖర్, జగన్నాథ్ గింజుకొంటున్నారు. తోక తొక్కిన తాచుల్లా బుసకొడుతున్నారు. ఇంత నయవంచన చేసిన సుధ వైపు ఉరిమి చూస్తున్నారు.

"మిస్టర్ రాయ్! వీళ్ళిద్దరూ చాలా తెలివైనవాళ్ళు. ఈ మందు రెండు చుక్కలు మింగించండి. మనలో కలిసిపోతారు" అని సుధ ఆ మందు సీసా అందించింది. రాయ్ బలవంతంగా వారి నాలుకలపై మందు చుక్కలు వేశాడు.

"ఇంక మీరు మా వెనకాల కుక్కల్లా తిరగవలసిందే" అని సుధ పగలబడి నవ్వడం వరకే వారికి తెలుసు. ఆ తర్వాత ఇద్దరూ మగతగా కళ్ళు మూసుకొన్నారు.

ఈ లోకం నుంచి తేలిపోతున్నట్లు మాత్రం వారిద్దరికీ తెలుసు. ఆ తర్వాత ఏమైందో శేఖర్‌కి, జగన్నాథ్‌కు తెలీలేదు. వారు స్పృహ కోల్పోయారు. వారి శరీరంలో శీతల వాయువు ప్రసరించినట్లయింది. వెన్నుపాము వెంట మంచు ముక్క రాపాడించినట్లు జివ్వుమంది. ప్రతి అవయవం శక్తిని కోల్పోయి శీత నిద్ర పోయినట్లనిపించింది. అది ఒక విచిత్ర స్థితి. ఆ మందు ప్రభావం అదంతా.

* * *

జగన్నాథ్‌కి మెలకువ వచ్చింది. కళ్ళు మాత్రం చూడగలుగుతున్నాయి. చెవులకు సన్నటి శబ్దం ఏదో వినిపిస్తోంది. అది సముద్రగర్భంలో జలాంతర్గామి ప్రయాణిస్తున్నప్పుడు నీటిని కోసే ధ్వని అని అతనికి అర్థం అయింది.

మెదడులోనుంచి ఏదో బరువైన వాయువు క్రమంగా పలచబడుతున్న అనుభూతి కలుగుతోంది. అలాగే శరీరంలోని రక్తనాళాలలో బరువు తగ్గి అవి సమస్థితికి వస్తున్నట్లు అనిపిస్తోంది. కాళ్ళు కదపాలని ప్రయత్నించాడు. చాలా కష్టం అనిపించింది. అతి కష్టం మీద కళ్ళు పక్కకు తిప్పి పరిశీలించాడు. అల్లంత దూరాన మరొక బెడ్‌పై శేఖర్ ఇంకా అపస్మారకంలోనే ఉన్నాడు.

జగన్నాథ్ చేతి వాచీవైపు చూసుకొన్నాడు. తేదీ మారి ఉంది. అంటే 24 గంటలు గడిచిపోయాయన్నమాట. తమకు స్పృహపోగొట్టి బంధించి ఈ జలాంతర్గామిలో తమను వారు ఎక్కడకు తీసుకు వెళుతున్నారు? వారి ఆంతర్యం ఏమిటి? ఇరవై నాలుగు గంటలు అంటే చాలా దూరం వచ్చివుంటారు. అతను ఆలోచిస్తూనే మరల లేవాలని ప్రయత్నించాడు. ఈసారి కాళ్ళూ, చేతులు కదిలాయి. నెమ్మదిగా లేచి కూర్చున్నాడు.

నిస్సత్తువగానే ఉంది. జ్వరంపడి పత్యం తిన్న రోగి నడవడానికి చేసే ప్రయత్నంవలె ఉందతని పరిస్థితి. ఆ పరిసరాల్ని పరిశీలిస్తూ శేఖర్ పడుకొని ఉన్న మంచం దగ్గరకు రాసాగాడు.

అది ఆధునికమైన జలాంతర్గామిలో ఒక గది. బయటకు వెళ్ళడానికి ఉన్న తలుపు పక్కనే కిటికీ ఉంది. పక్కనే నీటి కూజా, మందులు ఉన్నాయి. మరొక పక్క ఫ్రిజ్ ఉంది. వేరొక వైపు చివరగా టాయ్‌లెట్ రూమ్ ఉంది. చిన్న టేబుల్, రెండు కుర్చీలు మధ్యగా ఉన్నాయి. అటుఇటు మంచాలున్నాయి. సన్నటి కాంతిని ప్రసరిస్తూ బల్బు వెలుగుతోంది.

జగన్నాథ్ నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ శేఖర్ మంచం దగ్గరకు వచ్చాడు. మంచాన్ని ఆనుకొని నిలబడి




శేఖర్‌ని తట్టి పిలిచాడు. అతను కదల లేదు. పలకలేదు. జగన్నాథ్ నెమ్మదిగా అక్కడి టేబుల్ మీద మంచి నీళ్ళు ఒక గ్లాసులో పోసి, శేఖర్ ముఖంపై చిలక రించాడు.

కొద్దిక్షణాల నిశ్శబ్దం. శేఖర్ ముఖం మీది కండరాలు స్వల్పంగా కదిలాయి. కనురెప్పలు స్పందించాయి. అతను నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

"ఎలా ఉంది?" జగన్నాథ్ అడిగాడు.

"ఫర్వాలేదు. కాని శరీరం అంతా సూదులు గుచ్చుతున్న నొప్పి. వెన్నుపాము మీద మంచు ముక్క రాపాడించిన బాధ. ఇప్పుడు క్రమంగా అవి తగ్గుతున్న ట్లున్నాయి" అని శేఖర్ హఠాత్తుగా ఆగి పోయాడు.

అతని కళ్ళు ఆశ్చర్య విస్ఫారితా లయ్యాయి. ఏదో మాట్లాడబోయిన అతను నోరు అలా తెరిచే స్తంభించిపోయాడు. అతని చూపులు ఆ కిటికీ అవతల కేంద్రీకృతం అయ్యాయి.

అక్కడ రెండు అగ్నిగోళాలు మెరుస్తున్నాయి. అవి ఆనాడు శారద ఇంటి కిటికీలో కనిపించిన అగ్నిజ్యోతులు. ఒకవిధంగా అవి నిప్పుకళ్ళలా ఉన్నాయి. వాటిని చూసే శారద భయపడేది. ఇవాళ తను కూడా భయ విభ్రాంతం అవుతున్నది వాటిని చూసే. అంటే ఆ కళ్ళూ ఈ కళ్ళూ ఒకరివేనా? శారదను భయ పెట్టిన వ్యక్తి తాలూకు కళ్ళు అవేనా? అతను ఇక్కడ ఉన్నాడన్నమాట.

శేఖర్ నిశ్చేష్టుడవడాన్ని జగన్నాథ్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అతను కూడా ఆ కిటికీవైపు తిరిగాడు గానీ అప్పటికే ఆ అగ్నిగోళాలు కదిలాయి. ఏమీ కనిపించ లేదు.

"ఆ అగ్నిగోళాల్నే నేను శారద ఇంటి దగ్గర చూశాను. అవి మృత్యు నేత్రాలు" శేఖర్ అంటుండగానే తలుపు తెరిసిన చప్పుడయింది. ఇద్దరూ ఇటు చూశారు.



# 6

ఆశ్చర్యం! అక్కడ అయిదడుగుల మరమనిషి నిలబడి ఉన్నాడు.

అతనినివారిద్దరూ నిలువెల్లా చూశారు. గ్లోబ్ ఆకారంలో ఉందతని తల. ఎర్రగాజు గోళాల్లా కళ్ళు మెరుస్తున్నాయి. నుదుటిమీద సన్నటి రంధ్రం ఉంది. కళ్ళకింద చతురస్రాకారపు రంధ్రం ఉంది. దానికి గాజుపలక అతికివుంది. ఛాతీభాగం అంతా దీర్ఘ చతురస్రాకారపు పెట్టెలా ఉంది. స్ప్రింగువలె వేలాడుతున్న చేతులున్నాయి. వాటి చివర పంజా మాదిరిగా అరచేయి ఉంది. పొట్టభాగం అంటూ వేరేయేమీ లేదు. పెద్ద కాళ్ళు ఉన్నాయి. కాళ్ళ చివర పాదాలు చాలా పెద్దవి. శేఖర్‌కి శారద ఇంటి తోటలో కనిపించిన పాదాల గుర్తులు స్ఫురణకు వచ్చాయి. ఈ మరమనిషే శారద ఇంటికి వచ్చేవాడని అతను నిర్ధారించుకొన్నాడు.

"గుడ్ మార్నింగ్ జంటిల్‌మెన్" ఆ మరమనిషి విష్‌చేసి నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ ముందుగా రాసాగాడు. అతను మాట్లాడినప్పుడు నోటి

భాగం దగ్గర గాజుపలకలోంచి కాంతి కనిపించింది. అంటే అది స్వర పేటిక అన్న మాట. అతను నడుస్తుంటే మోటర్లు తిరుగుతున్న సన్నటి సవ్వడి అవుతోంది. వారిద్దరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"మీరేం తింటారు? ఏం తాగుతారు? ఏం తెమ్మంటారు?" ఆ మరమనిషి వినయంగా అడిగాడు. అతని కంఠ ధ్వనిలో ఎంతో సౌమ్యం ఉంది. ఒక ఇంటి నౌకరు యజమాని దగ్గర వ్యవహ రించే పద్ధతిలో ఆ మరమనిషి ఉన్నాడు. వారిద్దరూ ఏమీ మాట్లాడకుండా ఆశ్చర్యంగా చూస్తుండిపోయారు.

"సారీ! మీకు నా పరిచయం చేయ లేదు కదూ!" మరమనిషి వారి ఆంత ర్యాన్ని గుర్తించినట్లు అన్నాడు. వారిద్దరూ "అవును" అన్నట్లు చూశారు.

"నన్ను చూస్తేనే మర మనిషిని అని మీకు అర్థం అయి ఉంటుంది. అయితే ఈనాడు పరిశ్రమలలో ఉపయో గిస్తున్న మరమనుషుల వంటి వాణ్ణి కాను నేను. అవి చేతనామాత్ర యంత్రాలు. అంటే తమకు శిక్షణ ఇచ్చిన అంశాలనే అవి చేయగలుగుతాయి. నేను అలా కాను..ఆలోచించే శక్తి ఉంది నాకు"

మరమనిషి చెపుతోంటే వారిద్దరూ ఆశ్చర్యంగా వింటున్నారు.

"అద్భుత మేధాసంపన్నుడైన ఓ శాస్త్రవేత్త నన్ను సృష్టించాడు. నా శరీరంలో ధమనులకు బదులు విద్యు త్తీగలున్నాయి. రక్తానికి బదులు 'పోజి ట్రానిక్' శక్తి ప్రవహిస్తోంది. అణుశక్తి సహాయంతో నేను మనిషివలె అన్ని పనులూ చేయగలను" మరమనిషి ఆగాడు.

"అంటే శతాబ్దాలుగా శాస్త్రవేత్తలు కలలు కంటున్న ఆలోచించగల మర మనిషివి నువ్వేనన్నమాట" శేఖర్ అన్నాడు.

"అవును మిస్టర్ శేఖర్" మరమనిషి అన్నాడు.

"నా పేరు నీకెలా తెలుసు?" అతను అడిగాడు.

"నా మెదడులో స్మృతికణాలు ఉన్నాయి. మీ గురించి, మీ స్నేహితుడు జగన్నాథ్ గురించి, మిమ్మల్ని ఇక్కడకు ఎందుకు తీసుకువచ్చారో—అన్నీ నాకు తెలుసు" మరమనిషి మందహాసం చేశాడు.

"ఎందుకు తీసుకువచ్చారు?" వారి ప్రశ్న.

"ఆ సంగతి కెప్టెన్ రాయ్ చెప్తారు. నేను కొన్ని పరిమితులకు లోబడి పని చేయాలి"

"నిన్ను సృష్టించినవారెవరు?"

"బాస్" మరమనిషి భావగర్భితంగా అన్నాడు.

"ఎవరా బాస్?"

"నేను చెప్పలేను. కాని ఈ ముఠాకు ఆయనే అధినాయకుడు"

అతని పేరును మరమనిషి చెప్పడని వారు నిర్ధారించుకొన్నారు.

"నువ్వీమధ్య మద్రాసు వచ్చావా?" శేఖర్ ప్రశ్నించాడు.

మరమనిషి నిమిష కాలం నిరుత్తరు డయాడు.

''వచ్చాను'' అని ముక్తసరిగా అన్నాడు.

''నువ్వు మనుషులలాగానే ఆలోచించ గలవా?''

''ఇందాకే చెప్పాగా ఆలోచించగల నని. నా మెదడులోని స్మృతి కణాలకు అటువంటి శక్తి వుంది. లైంగిక శక్తి

తప్ప నాలో అన్నీ మానవ స్వభావాలే ఉన్నాయి. మనిషికన్న హెచ్చైన శక్తి సామర్థ్యాలు నాకున్నాయి" మరమనిషి గంభీరంగా అన్నాడు.

"అంతే?" శేఖర్ ఆత్రంగా ప్రశ్నించాడు.

"మనిషి ఎదురుగా కనిపించే వస్తువుల్నే స్పష్టంగా చూడగలడు. నాకు ఆపై వస్తువులు కూడా కనిపిస్తాయి. ఆ గోడ అవతల ఏం ఉన్నదీ నాకు కనిపిస్తుంది"

"నీకు కళ్ళులేవుకదా! ఇదెలా సాధ్యం?"

"ప్రతిధ్వని ప్రక్రియద్వారా నేను చూడగలను. గబ్బిలం ఈ పద్ధతి ప్రకారమే వస్తువుల ఉనికిని గుర్తిస్తుంది. నేనూ అంతే! నా సుదుటిపై రంధ్రం నుంచి ధ్వనితరంగాలు వెలువడుతాయి. అవి పయనించి ఏదైనా వస్తువును తాకితే వెనుకకు మరలివస్తాయి. అవి నా మెదడులోని శబ్ద-దృష్టి కేంద్రాల్ని స్పృశిస్తాయి. అక్కడి 'ఫోటాన్'కణాలు ఆ దృశ్యాన్ని ముద్రిస్తాయి. మీ కళ్ళల్లో కూడా రెటీనాపై నేత్రనాడి దృశ్యాన్ని ముద్రిస్తుందికదా. ఈ రకంగా నాకు ఎక్స్‌రే దృష్టి ఉంది. అంచేత అవతలి వస్తువుల్ని చూడగలను" మరమనిషి వివరించాడు.

"ఇంకా నీలోని ప్రత్యేకతలేమిటి?" శేఖర్ ఆరా తీస్తున్నట్లు ప్రశ్నించాడు.

"నా చేతులూ, కాళ్ళూ చాలా బలమైనవి. వీటిని ప్రత్యేకతరహా మిశ్రమ లోహంతో తయారుచేశారు. నా సుదుటి మీద చిన్న రంధ్రం కనిపిస్తోందికదా. దానిలోనుంచి అణుకిరణాలు ప్రసరించే ఏర్పాటుంది. నా ఉనికికి ప్రమాదం వచ్చినప్పుడు నా సంకల్పం లేకుండానే ఆ కిరణాలు వెలువడే అమరిక అది. మనిషి శరీరంలో ఉదరవితానం, గుండె కండరాలు వంటి అనియంత్రిత కండరాలు అవసరాన్నిబట్టి తమంతతాము పని చేస్తున్నట్లు ఆ అణుపరికరం పనిచేసి, నన్ను కాపాడుతుంటుంది. ఆ అణు కిరణాలు కంటికి కనిపించవు. ఎలాంటి మిశ్రమ లోహాన్ని అయినా కరిగించివేస్తాయి. మనిషి శరీరాన్ని తాకితే జీవ కణాల్ని చంపివేస్తాయి''

మరమనిషి ఏదాపరికం లేకుండా తన నిర్మాణ రహస్యం వివరిస్తుంటే వారిద్దరూ విస్మయంగా వింటున్నారు. అంతా విన్న శేఖర్‌కి తన అంచనాలు నిజమనిపించింది. వాటిని ధ్రువీకరించాలనుకొని ఇలా అడిగాడు–

"శారదను నువ్వే ఎత్తుకుని వచ్చేశావా?''

''అవును...నేను తీసుకువచ్చాను''

''ఎందుకు?"

"బాస్ ఆజ్ఞ"

''శారద ఇంటి పనిమనిషి నీనుంచి వెలువడిన అణుకిరణాలవల్ల మరణించింది కదూ?"

"అవును. ఆ కిరణాల తాకిడివల్లే మీరూ స్పృహ కోల్పోయారు. శారద పనిమనిషి నిద్రపోతోందని నేను భావించాను. కాని ఆమె హఠాత్తుగా మేలుకొంది. నన్ను చూసింది. భయంగా అరిచింది. నా ఉనికి ఆమె పసికట్టింది. అది నాకు ప్రమాదం. అందుకే అప్రయత్నంగానే మృత్యు కిరణాలు ఆమెను తాకాయి. ఆమె మరణించింది. పాపం ఆ అమాయకురాలు అనవసరంగా బలి అయిపోయినందుకు నాకూ విచారంగానే ఉంది. కాని నేను చేయగలిగింది ఏమీలేదు" మరమనిషి గొంతు రుద్ధమై విచారంగా విని




పించింది.

"దగ్గరగా ఉంటే నేనూ మరణించే వాడినా?" శేఖర్ ప్రశ్నించాడు.

"ఆ"

"మరి శారదకూడా మరణించిందా?

"లేదు"

"అదెలా?"

"ఆమె ఆ కిరణ ప్రసార పరిధిలో లేదు. మీరూ, పనిమనిషి ఇంచుమించు ఒకే లంబరేఖపై ఉన్నారు. ఆ కిరణాలు ప్రసరించిన రేఖ అది. ఆ రేఖపై లేనందున శారద బతికింది"

"శారద ఇప్పుడు ఎక్కడ ఉంది?"

"చెప్పలేను" మరమనిషి బాధగా అన్నాడు. అతని ప్రతి మాటలో మామూలు మనిషి అనుభవించే రాగ ద్వేషాది అనుభూతుల లోతులున్నాయి. సర్వం తెలిసి, పైకి చెప్పలేని ఒక మనిషి అశక్తత అతని మాటలలో ప్రతిధ్వనిస్తోంది. ఆ సంగతిని కనిపెట్టిన శేఖర్, జగన్నాథ్ ఇంకా మరమనిషిని వేధించడం సబబుకాదని భావించారు. అయినా కొన్ని సందేహాలు తీర్చుకోకతప్పదు.

"మన మాటల్ని రికార్డుచేసి ప్రసారం చేసే మైక్రోఫోన్‌లు ఇక్కడ రహస్యంగా అమర్చారా?" జగన్నాథ్ అడిగాడు.

"అలాంటివేం ఇక్కడలేవు"

"నీకెలా తెలుసు?"

"విద్యుత్తుతో పనిచేసే ప్రతి వస్తువు ఉనికిని నేను గ్రహించగలను. నాలోని కొన్ని కణాలు 'నిటినాల్' అనే లోహంతో తయారయినాయి. ఇది నికెల్, టిన్ లోహాల మిశ్రమం. దీనినే 'మెమొరీ మెటల్' అంటారు. దానికి జ్ఞాపకశక్తి ఎక్కువ. విద్యుత్ ఉనికిని పసికట్టే స్మృతిని ఆ లోహానికి కలిగించారు. దానితో తయారుచేసిన కణాలు నా శరీరంలో వున్నాయి. ఏ మూల ఏ విద్యుత్పరికరం ఉన్నా అవి పసిగట్టి తగు హెచ్చరికలు చేస్తాయి. ఆ శక్తి వుంది కనకనే ఇక్కడ 'మైక్రో ఫోన్స్' వంటివి రహస్యంగాలేవని చెప్పగలుగుతున్నాను. అంతేకాదు-నాది ఎక్స్‌రే దృష్టికదా....అన్నీ కనిపిస్తాయి"

"మరి మీ బాస్ ఎవరు?" జగన్నాథ్ మరమనిషిని సూటిగా చూస్తూ అడిగాడు.

"చెప్పలేను" మరమనిషి అసహాయంగా అన్నాడు.

"ఇన్ని వివరాలు తెలిసినవాడవు. ఈ సంగతి తెలీదా?" అతణ్ని రెచ్చగొట్టే ధోరణిలో అన్నాడు జగన్నాథ్.

"తెలుసు..కాని చెప్పడానికి వీలులేదు. నేను కొన్ని ఆజ్ఞలకు లోబడి పనిచేయాలి. ఆల్‌రైట్! మన కబుర్లలోపడి ఆలస్యం చేశాను. మీరేం తింటారో చెప్పండి తీసుకువస్తాను" మరమనిషి తొందరచేశాడు.

అతని మాట పూర్తి అయ్యేలోగానే కెప్టెన్ రాయ్ లోపలకు వచ్చాడు. మరమనిషి అప్రయత్నంగా శాల్యూట్ చేశాడు.

"అతిథుల్ని జాగ్రత్తగా చూస్తున్నావా?" రాయ్ మరమనిషిని అధికారికంగా ప్రశ్నించాడు.

"యస్ సార్!" మరమనిషి జవాబిచ్చాడు.

"డియర్ ఫ్రెండ్స్! మీరు కోలుకున్నారు...దట్స్ గుడ్! ఒక్కొక్కసారి ఆ మందు ప్రాణాలు తీస్తుంది. దాని ప్రభావానికి తట్టుకొని మీరు బతికిబయటపడ్డారు. అదృష్టవంతులు" రాయ్ వారిద్దరిని వ్యంగ్యంగా ప్రశంసించాడు.

"ఈ బంధిఖానా బదులు ఆ మృత్యువే నయం" వారు ఛీత్కరించారు.

"తప్పు" మరమనిషి అన్నాడు.

ముగ్గురూ మరమనిషివేపు ఆశ్చర్యంగా చూశారు.

"ద్రవ్యరాశి జీవధర్మాన్ని సంపాదించుకొనడానికి ఎంత యాతనపడి వుంటుందో? మీకు తెల్సా! ఏకకణజీవిగా పరివర్తన చెందిన ద్రవ్యరాశి ఆలోచించే మనిషిగా పరిణామం చెందింది. ఇది అపురూపమైన జీవితం. జీవితాన్ని అంతం కావాలనుకోవడం పెద్ద తప్పు. అది ద్రవ్యరాశి సంకల్పాన్ని కించపరచడమే" మరమనిషి వేదాంతపరిభాషలో అన్నాడు గంభీరంగా.

అతని ఆలోచనాశక్తికి శేఖర్ విస్తుబోయాడు.అతని భావనాపటిమకు ఆశ్చర్యపోయాడు జగన్నాథ్.

కానీ "వృథాప్రసంగం" అని రాయ్ ఛీత్కరించాడు.

"నీ ధర్మోపదేశాలు కట్టిపెట్టు. వెళ్ళి వీళ్ళకి ఫలహారాలు తీసుకురా" రాయ్ ఆజ్ఞాపించాడు.

మరమనిషి వింత వింత అంగలతో వెళ్ళిపోయాడు.

*    *    *

రాయ్ మిలటరీ దుస్తులలో ఉన్నాడు. ఏదో భయంకర యుద్ధానికి ఆజ్ఞలు జారీ చేసే గాంభీర్యం అతనిలో కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

శేఖర్, జగన్నాథ్‌లు ఇంకా నిస్సత్తువలో అలసటగానే వున్నారు. అయినా వారిలో పట్టుదల కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

"మీరు స్నానాదికాలు ముగించి, టిఫిన్‌చేసి సిద్ధంగా వుండండి. ఎం.పి. మాలవీయా మీతో మాట్లాడతారు" రాయ్ అన్నాడు.

"ఏం మాట్లాడతారు?" జగన్నాథ్ అడిగాడు.

"మిమ్మల్ని ఇక్కడకు ఎందుకు తీసుకువచ్చామో ఆయన చెబుతారు"

"మీరు చెప్పకూడదా?"

"కొంచెం ఓపికపట్టండి. ఎవరు చెప్పవలసింది వారే చెప్పాలి. అది మర్యాద"

"మాకు సరిపడే బట్టలూ అవీ..."

"అన్నీ ఆ మరమనిషి తెచ్చియిస్తాడు. మీ ఇంటిదగ్గరనుంచి, మీ బట్టలు తెప్పించాం. నేను మళ్ళీ వస్తాను. మీరు రెడీ కండి" అని రాయ్ వారి మాటలకు ఎదురు చూడకుండానే గబగబ తలుపుతెరుచుకొని వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిన వెంటనే మరమనిషి ఫలహారాలు తెచ్చి అక్కడ టేబుల్‌పై సర్దాడు. ఆ పని అవగానే మారుమాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

ఇద్దరూ టేబుల్‌కి అటుఇటు ఉన్న కుర్చీలలో కూర్చున్నారు. కడుపునిండా టిఫిన్‌చేశారు.

"నాదో చిన్న సందేహం?" జగన్నాథ్ అన్నాడు.

"ఏమిటి?" శేఖర్ అడిగాడు.

"ఈ మరమనిషి ఆడా, మగా?"

శేఖర్ ఈ ప్రశ్న విని పకపక నవ్వాడు.

"మరమనుషులలోకూడా ఆడా, మగా తేడాలు వస్తే వాటికి సంతానం కలిగితే అప్పుడు మానవజాతి పనేమవుతుంది?"

"అవి మనిషికన్న బలమైనవికనుక మానవజాతిపై అధికారం చెలాయిస్తాయి"

"ఈ మరమనిషి చేతనామాత్రజీవి అంటావా? ఆలోచించే చైతన్యంగల మనిషి అంటావా?"

"నీకీ అనుమానం ఎందుకు కలిగింది?"

"అచ్చం మెదడున్న మనిషిలాగానే




ఆలోచిస్తోంది కనక. మనంవేసిన కొన్ని ప్రశ్నలకు వివరంగా సమాధానం ఇచ్చింది. కొన్నింటికి బదులుచెప్పనంది. ఇది నిజంగా మరమనిషే అయితే ప్రతి ప్రశ్నకు జవాబుఇచ్చి తీరాలి" జగన్నాథ్ అన్నాడు సాలోచనగా.

"నీ అనుమానం తీరాలంటే 'ప్రాణం' అంటే నిర్వచనం తెలుసుకోవాలి. నువ్వు చెప్పే నిర్వచనం ఏమిటి?"

"ప్రాణం అంటే చలనశక్తి"

"ఇంకా....?"

"ప్రాణం అంటే చైతన్యం. కనక చైతన్యం అంటే వివేకం. యుక్తాయుక్త విచక్షణ."

"మొక్కలకు ప్రాణంఉంది. కనక అవి యుక్తా యుక్తవిచక్షణ చేయగలవా"

"మరి జీవితం అంటే ఏమిటి?"

"నా ఉద్దేశంలో ప్రాణంలేదా జీవితం అంటే రెండు అర్థాలున్నాయి. తన పరిసరాలను క్షుణ్ణంగా తెలుసుకోవడం ప్రాణ లక్షణం. ఇది మొదటి అర్థం. తన జాతిని వృద్ధిచేసుకొనడానికై ఇతర ప్రాణుల్ని నశింపజేయడం జీవిత లక్షణం. ఇది రెండవ అర్థం"

"నీ సమాధానం నాకు తృప్తిగాలేదు"

"ఈ సృష్టిలో ఒకజీవిపై మరొకజీవి ఆధారపడివుంది. చిన్న జంతువులమీద పెద్దజంతువులు,ఆ పెద్దజంతువులపై క్రూర మృగాలు. అలాగే శాకాహారంపై కొన్ని మృగాలు. వాటిపై మనిషి. ఇంతకన్న జీవితానికి శాస్త్రీయ నిర్వచనం ఏమివ్వ గలం?" శేఖర్ అన్నాడు.

"ఇది జీవలక్షణమేగాని జీవతత్వం కానేరదు. జీవతత్వం ఏమిటయ్యా అంటే ఆలోచించడం, విచక్షణతో వ్యవహరించడం" జగన్నాథ్ గట్టిగా వాదించాడు.

"నీ ఉద్దేశం నాకు అర్థం అయింది. ఈ మరమనిషికి ఆ రెండు శక్తులూ ఉన్నాయి. కనుక రేపటి సమాజంలో ఇవే మనిషిని శాసిస్తాయని అభిప్రాయం. ఆరోజు వచ్చినా రావచ్చు" శేఖర్ గుమ్మంవైపు చూస్తూ అన్నాడు.

"ఆదిమకాలంలో ప్రకృతి వైపరీత్యాలు మానవజాతిని నాశనంచేశాయి. తర్వాత భయంకరరోగాలు జులుంచెలాయించాయి. ఆ పిదప యుద్ధాలు,బాంబు ప్రయోగాలతో మానవజాతి కష్టాలపాలయింది. ఇక భవిష్యత్తులో మరమనుషుల రాజ్యంలో మనిషి బానిస అవుతాడు. హతోస్మి... ఎంతటి దుర్దశ!" జగన్నాథ్ కలలో ఉన్నట్లు అన్నాడు.

ఇంతలో మరమనిషి రెండు సూట్ కేసులు తెచ్చి అక్కడ పెట్టాడు. అవి వారివే. గబగబ తెరిచారు. వాటిలో తమ బట్టలు, ఇతర అవసర వస్తువులు ఉన్నాయి.

"వీటిని నీ ఇళ్ళదగ్గర్నుంచి దొంగిలించుకు వచ్చారు మా మనుషులు" మరమనిషి అన్నాడు.

"నువ్వు మరమనిషివేనా?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"మీకు అనుమానమా?"

"అవును. మేము అడగకుండానే కొన్నింటికి బదులు చెప్తున్నావు. అడిగినా కొన్ని ప్రశ్నలకు కావాలనే సమాధానం చెప్పడంలేదు. ఇలాంటి విచక్షణ మనుషులకే ఉంటుంది" జగన్నాథ్ అన్నాడు.

"అయితే చూడండి" అని మరమనిషి తన పొట్ట భాగం మీద ఉన్న రెండు స్విచ్‌లు నొక్కాడు. మరుక్షణంలో ఆ భాగం తెరుచుకొంది. లోపల ఎన్నో ఎలక్ట్రానిక్ పరికరాలున్నాయి. సన్నటి





వైర్లు పిచ్చిక గూడులా అల్లుకొనివున్నాయి. చిన్న చిన్న రంగు రంగుల బల్బులు వెలిగి, ఆరిపోతూన్నాయి. మోటార్లు తిరుగుతున్న సన్నటి జియ్ శబ్దం లయ బద్ధంగా వినిపిస్తోంది.

"నీకు గుండె లేదన్న మాట!" శేఖర్ అన్నాడు.

"ఉంది. కాని దానిలో రక్తంలేదు. యురేనియం ధాతువు ఉంది. అదే అణు విద్యుత్ శక్తిని నా శరీరం అంతటికీప్రసరింప చేస్తుంది" అని మరమనిషి మరల ఆ బటన్‌లు నొక్కాడు. పొట్టకిందనుంచి ఛాతీ వరకు తెరుచుకొన్న ఆ భాగం యధాప్రకారం మూసుకొంది.

"ఏమీ అనుకోనంటే ఇంకో ప్రశ్న"

"ఏమిటది?"

"నువ్వు పురుషుడివా? స్త్రీవా??"

"నిర్మాణం రీత్యా నేను యంత్రాన్ని. మనుషులు, పశుపక్ష్యాదులు అనుభవించే లైంగిక స్పర్శానుభూతి గురించి నేను వూహించగలను. కాని ఆ అనుభవం నాకు చేతకాదు"

"అయ్‌పిటీయు! నువ్వు ఎవరినైనా ప్రేమించగలవా?" శేఖర్ అడిగాడు.

ఆ ప్రశ్న జగన్నాథ్‌కి విడ్డూరంగా ఉంది. కాని మరమనిషి ఆ ప్రశ్నకు ఇచ్చే సమాధానం చాలా కీలకమైనది.

"ప్రేమిస్తున్నాను. రక్తమాంసాలు, నాడీ సంస్పందనలు, రాగానుభూతులు నిలువెల్లా నింపుకొన్న ఒక మానవ యువతిని ప్రేమిస్తున్నాను" మరమనిషి భావోద్వేగంతో అన్నాడు.

"ఇంపోసిబుల్! మరమనిషి మనిషిని ప్రేమించడమా?"

"నన్ను నిర్మించిన శాస్త్రవేత్త ఈ పరిణామాన్ని వూహించి ఉండడు. నాలో భావనలు ఉత్పన్నం అవుతా యని ఆయన ఆలోచించి ఉండడు. నాలో ప్రవహిస్తున్న 'పోజిట్రానిక్' శక్తి ప్రభావంవల్ల నాకు ఈ భావనలు ఉత్పన్నం అవుతున్నాయి. భావనలకు, శరీరానికి సంబంధంలేదు. అవి మెదడు నుంచి ఉత్పన్నం అవుతాయి. నా శరీరం మీవంటి శరీరం కాకపోవచ్చు. కాని మెదడు మాత్రం మనిషి మెదడువంటిదే. అది సజీవమైన మెదడువలె ఆలోచిస్తుంది. నన్ను నమ్మండి. వయో, రూపలావణ్యాలున్న ఒక యువతిని నేను ప్రేమిస్తున్నాను"

ఈ మాటలంటున్నప్పుడు మరమనిషి నిలువెల్లా వూగిపోయాడు. అతడి మాటలు భావోద్వేగంతో వెలువడ్డాయి.

"ఆ యువతి శారద..." శేఖర్ నెమ్మదిగా అన్నాడు.

శారద మాట వినగానే మరమనిషి శాంతించాడు.

"అవును...నా ఆరాధ్యదైవం శారద. నా స్వప్నసుందరి శారద. నా కల్పనల కామిని శారద..." అని మరమనిషి కలలో ఉన్నట్లు నడుస్తూ బయటకు వెళ్ళిపోయాడు.

శేఖర్, జగన్నాథ్ కాలకృత్యాలు తీర్చుకొందుకు ఉపక్రమించారు.

*       *       *

అరగంట గడిచింది. శేఖర్,జగన్నాథ్ స్నానాదికాలు ముగించారు. ట్రిమ్‌గా దుస్తులు ధరించారు. ఇప్పుడు ఇద్దరిలో కొత్త శక్తి వచ్చింది. కొత్త ఆలోచనలకు ఆస్కారం ఏర్పడింది. పాత ఆలోచనలకు ఒక రూపం వచ్చింది. కొన్ని అనుమానాలు తీరాయి. ఇంకా కొన్ని సమస్యలు అపరిష్కృతంగానే ఉండిపోయాయి. అవి

తీరడానికి కొంత వ్యవధి పడుతుంది అంతవరకు వోపికపట్టక తప్పదు. శారద ఎక్కడ ఉంది? తమను వీరేం చేయదలి చారు?? ఇలా వారాలోచిస్తున్నారు.

వారి ఆలోచనలకు భంగం కలిగిస్తూ మరమనిషి లోపలకు వచ్చాడు.

"రండి...మిమ్మల్ని తీసుకురమ్మన్నారు" అన్నాడు.

"ఎవరు? ఎక్కడికి?'' శేఖర్ ప్రశ్నించాడు.

"నాతో రండి...మీకే తెలుస్తుంది'' మరమనిషి ముందడుగు వేశాడు.వారిద్దరూ అనుసరించారు. భూమ్యాకర్షణ శక్తికి వ్యతిరేక దిశలో కాళ్లు ఎత్తివేయాలి కనక మరమనిషి వేగంగా నడవలేకపోతున్నాడు.

ముగ్గురూ ఒక కారిడార్‌లోకి నడిచారు. మరమనిషి ఒక కేబిన్ దగ్గర ఆగాడు.

"మీరు లోపలకు వెళ్ళండి" అని తలుపు చూపాడు. ఆ ప్రకారం వాళ్ళిద్దరూ తలుపు తెరుచుకొని లోపలకు వెళ్ళారు.

అది చాలా విశాలమైన కేబిన్. ఎంతో అందంగా ఉంది. ఆడంబరంగా ఉంది. మధ్యన సోఫాసెట్ ఉంది. ఒక సోఫాలోమాలపీయా కూర్చుని ఉన్నాడు. ఆయన తెల్లటి దుస్తులు ధరించి ఉన్నాడు. ఆయన ఎదురు సోఫాలో సుధ కూర్చుని ఉంది. ఆమె నీలం రంగు చీర కట్టింది. అదే రంగు జాకెట్టు వేసింది. నీలి తారవలే మెరుస్తోంది. ఒకపక్క సింగిల్ సోఫాలో రాయ్ ఆసీనుడై ఉన్నాడు. అతను సైనిక దుస్తుల్లోనే ఉన్నాడు. డబుల్ సీటు సోఫా ఖాళీగా ఉంది. అది తమ కోసమే అని శేఖర్, జగన్నాథ్ నిశ్చయించుకున్నారు. నేరుగా వచ్చి ఇద్దరూ ఆ సోఫాలో కూర్చున్నారు.

"కెప్టెన్ రాయ్! చెప్పకుండా అలా కూర్చోవడం మర్యాద కాదని వారికి చెప్పండి" మాలపీయా తిరస్కారపూర్వకంగా అన్నాడు.

కెప్టెన్ రాయ్ వారివైపు తిరిగి ఏదో చెప్పబోయాడు. ఆ అవకాశం ఇవ్వలేదు వారు.

"కెప్టెన్ రాయ్!ఎదురువచ్చి అతిథుల్ని ఆహ్వానించడం మర్యాద అని చెప్పండి" అన్నాడు.జగన్నాథ్.

రాయ్ ఘూర్ణిల్లి చూశాడు. ఏం చేయడానికి తోచక తికమకపడ్డాడు.

"కెప్టెన్ రాయ్! మాకు తెలుగువచ్చు. దుబాసీ అవసరం లేదని చెప్పండి" మాలపీయా గద్దించాడు.

"ఆమాటే మేమూ అంటున్నాం" ఇద్దరూ ముక్తకంఠంతో అన్నారు.

"మీరు అతిథులు కారు...బందీలు" మాలపీయా ఛీత్కరించాడు.

"మీరు బందీలకు బందీలు"జగన్నాథ్ అపహాస్యం చేశాడు.

మాలపీయా చురచురా చూశాడు.

"అంటే...?" రాయ్ సవాలుచేశాడు.

"మా అవసరం మీకుంది కనక మీరు మా బందీలు" జగన్నాథ్ వివరించాడు.

"ఆల్ రైట్! మిస్టర్ జగన్నాథ్!నువ్వు తెలివైనవాడివి. సద్యఃస్ఫూర్తి ఉన్న గూఢచారివి. అలాగే నీ స్నేహితుడు శేఖర్ చక్కటి శాస్త్రవేత్త. ఎంతో చదువుకొన్నవాడు. అందుకే మీరిద్దరూ మాకు కావాలి" మాలపీయా రాజకీయనాయకుడు కనక ఆ అనుభవాన్ని పురస్కరించుకొని ఆవేశాన్ని అణుచుకొని అన్నాడు.

"ఎందుకు?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"మా ప్రయత్నంలో మీరూ భాగ



స్వాములు కావాలి. మేం నిర్మించదల పెట్టిన నవీన సమాజం ఆవిష్కారానికి మీ అండదండలు కావాలి. మాతో చేయి కలిపితే సకలవిధ రాజభోగాలు లభిస్తాయి. లేకపోతే భయంకర నరకయాతన అనుభవించాలి. మృత్యువుకన్న విపరీతమైన బాధ అది" మాలవీయా చాలా నెమ్మదిగా, సుతారంగా అన్నాడు. అతడి మాటలు పదును కత్తితో పనసతొన కోసినంత సుతారంగా ఉంది.

"మేం ఏం చేయాలి?" శేఖర్ అన్నాడు.

"వెంకటాపు పత్రాలు గురించి మీరెవరితో సంప్రదించారో వాళ్ళ వివరాలు చెప్పాలి"

"చెప్పకపోతే....?"

"మీ మెదడు పొరల్ని ఛేదించి ఆలోచనల గుట్టు విప్పడం మాకు తెలుసు" అంది సుధ శేఖర్ వైపు కొరకొరా చూస్తూ

ఆమె చూపులలోని కర్కశత్వం వెనుక లాలస ఉంది.

"ఆల్ రైట్! మేం మీతో చేయి కలుపుతాం. కాని ఈ ముఠాకి చీఫ్ ఎవరు?" జగన్నాథ్ అడిగాడు.

"ఆ వివరాలు తర్వాత తెలుస్తాయి. మీరు మనస్ఫూర్తిగా మాతో కలిస్తే మీ దగ్గర ఏ రహస్యాలు దాచము. స్నేహితులుగా భావించి అన్ని వివరాలు చెప్తాం" రాయ్ అన్నాడు.

"అంటే మీలో ఎవరూ బాస్ కారన్నమాట. మీ బాస్ వేరే ఎక్కడో దాక్కొని మీచేత ఈ పనులు చేయిస్తున్నాడన్న మాట" జగన్నాథ్ ఎత్తిపొడుస్తున్న ధోరణిలో అన్నాడు.

"అదంతా ఇప్పుడనవసరం. మిస్టర్ జగన్నాథ్...మీరు గూఢచారి శాఖకు చెందినవారు కనుక కెప్టెన్ రాయ్‌తో చేయి కలిపి మా కార్యక్రమానికి సహకరించండి. మిస్టర్ శేఖర్...మీరు శాస్త్ర విజ్ఞానం బాగా చదువుకొన్నారు కనుక డాక్టర్ సుధకు సహకరించండి" మాలవీయా అనునయిస్తున్న ధోరణిలో అన్నాడు.

"ఇందుకేనా మమ్మల్ని బంధించి తీసుకువచ్చింది?" శేఖర్ అన్నాడు.

"అవును. ఆలోచించండి...పాత బొంద మీద నవ సృష్టికి జరిగే మా ప్రయత్నానికి చేయూత నిస్తారో! వ్యతిరేకించి నరకయాతన అనుభవిస్తారో! మీకు ఒకరోజు గడువు ఇస్తున్నాను. బాగా ఆలోచించుకొని మీ నిర్ణయం చెప్పండి" మాలవీయా అన్నాడు. రాయ్ ఒక బటన్ నొక్కాడు. బయట కాలింగ్ బెల్ మోగింది. మరమనిషి వచ్చి శాల్యూట్ చేశాడు.

"వీరిని తీసుకువెళ్ళు" రాయ్ ఆజ్ఞాపించాడు.

మరమనిషి ముందు నడువగా శేఖర్, జగన్నాథ్ అనుసరించారు.



## 7

ప్రయాణం సాగుతోంది. కాని అది ఎటువైపు? ఏ సముద్రంలో? ఎక్కడికి? ఎందుకు?

ఈ ప్రశ్నలకు సమాధానం దొరకడం

లేదు శేఖర్, జగన్నాథ్‌లకు. ఎటు చూసినా సముద్రం, నీరు, అక్కడక్కడ జలచరాలు కనిపిస్తున్నాయి తప్ప అది ఏ సముద్రమో చెప్పడం కష్టం.

ఆకాశంలో దిక్కులు, సముద్రంలో దిశా భేదం చెప్పడం అంత సులభం కాదు. కాని ఆ నీటిని పరిశీలిస్తే తాను అది ఏ సముద్ర జలమో చెప్పగలనన్నాడు శేఖర్. సముద్ర జలాలు బాహ్య దృష్టికి ఒక్కలాగానే కనిపించినా వాటిలో కరిగిన లవణాల శాతం వ్యత్యాసంగా ఉంటుంది. ఆ వ్యత్యాసాన్ని గుర్తించాలంటే రసాయనిక, భౌతిక పరీక్షలు జరపాలి. కాని అక్కడ ఆ జలాంతర్గామిలో బందీలుగా ఉన్న తమకు అలాంటి అవకాశం లేదు. తమకు అల్పాహారం తెచ్చిన మరమనిషిని అడిగారు—ఒక బీకరునిండా సముద్రం నీరు ఇమ్మని. అతను సాధ్యపడదన్నాడు.

మాలపీయా ఇచ్చిన గడువు లోపల తమ నిర్ణయాన్ని చెప్పాల్సి ఉంది.

ఇద్దరికీ ఏమీ పాలుపోవడం లేదు. ఏం చేయాలి? ఈ వ్యూహంలో పావులు కాకుండా తాము ఎలా తప్పించుకోవాలి? ఈ దుష్టుల వల్ల ప్రపంచం జల ప్రళయంలో మునిగిపోకుండా ఎలా కాపాడాలి?

వారికి తల వొగ్గేస్తే బతుకంతా సుఖపడవచ్చు. వ్యతిరేకిస్తే నరకయాతన పడాలని హెచ్చరించారే! అది ఎలాంటి నరక యాతన. శిలువ వేస్తారా? చిత్రహింసలు పెడతారా? కళ్ళు పీకివేస్తారా? కాళ్ళు విరగగొడతారా? చేతులు ఖండిస్తారా?

ఏమో! ఏమీ తెలియదు. అంతా అయోమయం.

"మనం వాళ్ళకు తలవంచడమా? ఎదురు తిరగడమా?" శేఖర్ ప్రశ్నించాడు. అంతవరకు కళ్ళు మూసుకొని దీర్ఘంగా ఏదో ఆలోచిస్తున్న జగన్నాథ్ కళ్ళు తెరిచి, శేఖర్ వైపు సాభిప్రాయంగా చూశాడు.

"ఇలాంటి ధర్మ సంకటం వచ్చినప్పుడు బొమ్మా, బొరుసూ వేయాలని పెద్దలు చెప్పిన మాట. అలా చేద్దాం" జగన్నాథ్ అన్నాడు.

"నాకలాంటి నమ్మకాలు లేవు"

"మరేం చేద్దాం?"

"ఉపాయంతో అపాయాన్ని జయించాలి. అందుకు నేను ఒక ఉపాయం ఆలోచించా. అదేమిటంటే...." శేఖర్ ఆగి జగన్నాథ్ చెవిలో అన్నాడు "సుధను ప్రేమించడం"

"ఈ ఘోటక బ్రహ్మచారికి ప్రేమించడం తెల్సా?" అంతే నెమ్మదిగా అన్నాడు జగన్నాథ్.

"యూనివర్సిటి డ్రామా కాంపిటీషన్‌లో నేను ప్రేమికుడి పాత్రకు మొదటి బహుమతి సంపాదించాను"

"ఆ ప్రేమ ఫలించిందా?"

"అది భగ్నప్రేమికుడి పాత్ర!"

"అందుకే ఆ పాత్ర బాగా పోషించావు. అది నాటకం, ఇది జీవితం. పైగా మనం పెద్ద ప్రమాదంలో ఉన్నాం"

"ఎన్ని ప్రమాదాలైనా ప్రేమతో జయించవచ్చు. సుధను ప్రేమించి,ఆమెతో కలిసి పరిశోధనలు చేస్తూ ఈ ముఠా ఆట కట్టిస్తాను" శేఖర్ వూహాలోకాల్లో ఉన్నట్లు అన్నాడు.

"బ్రహ్మాండంగా ఉంది నీ తెలివి. శేఖర్! వీళ్ళ ఆనుపానులు తెలుసుకొనే వరకు మనం చాలా జాగ్రత్తగా ఉండాలి"



"ఇప్పుడు మనల్ని ఎక్కడకు తీసుకు వెళుతున్నారంటావ్?" శేఖర్ ప్రశ్నించాడు.

"వీళ్ళ రహస్య స్థావరానికి. వీళ్ళ బాస్ దగ్గరకి..." జగన్నాథ్ అన్నాడు గుమ్మం వైపు చూసి.

అక్కడ మరమనిషి భోజనం తీసుకొని వచ్చి నిలబడి ఉన్నాడు.

"కమాన్ మెషీన్‌మన్!" జగన్నాథ్ ఆహ్వానించాడు. మరమనిషి భోజన పదార్థాలు అక్కడ మేజామీద పెట్టాడు.

"మనం ఇప్పుడు ఎక్కడకు వెళ్తున్నాం?" శేఖర్ మరమనిషిని ప్రశ్నించాడు.

"హెడ్‌క్వార్టర్స్‌కి"

"అది ఎక్కడ ఉంది?"

"సముద్ర మధ్యంలో!"

"అదే...ఆ ప్రాంతం ఏది అని?"

"నాకు తెలీదు"

"నీకు ఎన్నో విషయాలు తెలుసునని చెప్పావు?"

"తెలుసు ... నిజమే. కాని కొన్ని సంగతులు మాత్రమే చెప్పగలను.ఇలాంటి ప్రశ్నలకు బదులు చెప్పరాదని బాస్ ఆజ్ఞ. నేను ఆయనకు విధేయుణ్ణి...దట్సాల్!"

"ఆల్ రైట్! మేం ఇక్కణ్ణుంచి తప్పించుకొనే ఉపాయం చెప్పగలవా?

"తప్పించుకోలేరు"

"పోనీ ఆత్మహత్య చేసుకొంటే!"

"అసాధ్యం! మీ రక్షణ బాధ్యత నాకు అప్పగించారు. మీరెక్కడ ఏంచేస్తున్నా నా ఎక్స్-రే కళ్లు పసిగడతాయి. మిమ్మల్ని చావనివ్వను"

"అంటే ఇంతవరకు మా మాటలన్నీ విన్నావన్నమాట!"

"అన్నీ విన్నాను. మీరు సుధను ప్రేమించగలనని అంటున్నారు. కాని అది జరిగేపని కాదు"

"ఏం?"

"సుధ భౌతికంగా స్త్రీ, అంతే!"

"అంటే?"

"ఆమెలో స్త్రీ సహజమైన కోరికలు, నాడీ స్పందనలు లేవు. ఆమె బతికి ఉన్న మేధావి. సైన్సు పరిశోధనలకే అంకితం అయిపోయిన మెదడు ఆమెది. అంతకన్న ఆమెలో ఏ నాడీచలనాలు లేవు. ఆమెకు లైంగిక వాంఛలు లేవు. ఇంతకన్న ఏం చెప్పలేను"

"నిన్ను మేధావీ అని పిలవాలని వుంది" మరమనిషి మాటలు విన్న శేఖర్ ఆత్మీయంగా అన్నాడు.

"మా బాస్ నాకు రెండు పేర్లు పెట్టాడు"

"ఏమిటవి?"

"నంబరు 242"

"అది సంఖ్యావాచకం"

"అవును. నాలో ప్రోజిట్రానిక్‌శక్తిని ప్రసరిస్తున్న ధాతువు సంఖ్య అది"

"ఇంకో పేరు?"

"బానిస" మరమనిషి చాలా విచారంగా ఈ మాట అన్నాడు.

"అది చాలా ఏహ్యమైన పేరు. ఇంత విజ్ఞానం అభివృద్ధిచెందిన ఈరోజుల్లో కూడా ఇలాంటి సంబోధనలా?" జగన్నాథ్ ఈసడింపుగా అన్నాడు.

"కాని నేను ఆయనకు బానిసనేగా!" మరమనిషి ఈ మాటల్ని చాలా బాధగా అన్నాడు. అతనివైపు వారిద్దరూ జాలిగా చూస్తుండిపోయారు.

"ఇప్పుడు శారద ఇక్కడే ఉందా?" శేఖర్ ప్రశ్నించాడు. శారద పేరు వినగానే మరమనిషి ఏదో పులకరించాడు.

"ఇక్కడే ఉంది. అపస్మారకంలో... ఆ చివర కేబిన్‌లో బంధించారు"




"అంటే మాలాగానే అన్నమాట!"

"ఒకవిధంగా ఇది బంధనమే కాని వారి దృష్టిలో ఇది రక్షణ. శారదను ఒకందుకు బంధించారు. మిమ్మల్ని మరొకందుకు బంధించారు"

"అంటే?"

"శారద శరీరం వారికి కావాలి. మీ మెదడుతో వారికి పని" అని మరమనిషి వెళ్ళిపోయాడు.

"అతను నిజంగా మరమనిషేనా?" మళ్ళీ ఈ ప్రశ్న వారిని వేధించసాగింది.

*　*　*

రాత్రో పగలో తెలియదు. అది చీకటో వెలుగో అర్థం కాదు. ధ్రువప్రాంతపు వెలుతురులా ఉంది ఆ వాతావరణం. సముద్ర గర్భంలో పయనించే జలాంతర్గామిలో వాతావరణం అలాగే ఉంటుందేమో!

ఆ కేబిన్‌లో మెత్తటి ఫోమ్‌బెడ్‌మీద శారద వెల్లకిలా పడుకొనివుంది. ఆమె మెలకువగా ఉందో, నిద్రపోతున్నదో వివరంగా చెప్పడం కష్టం. కనులు అరమోడ్చి ఉన్నాయి. దీర్ఘాలోచనలో ఉన్న అప్సరకాంతలా ఉందామె. కనురెప్ప వేయడంలేదు కనుక నిద్ర పోతోందనుకోవాలి! కనులు సగం తెరిచి ఉన్నాయి కనుక మెలకువగా ఉందనుకోవాలి!

మంచుశిఖరం మీద గులాబిపువ్వులా ఉన్న ఆమె యవ్వన శరీరం వింత కాంతిని ప్రసరిస్తోంది. మంచులో తడిసిన పారిజాతంలా ఆమె వదనం మెరుస్తోంది. గాలికి ఉత్పాతనం చెందే కర్పూరంలా ఆమెఉచ్ఛ్వాసనిశ్వాసాలుఅనిపిస్తున్నాయి. ఏ దివ్యతారకయో తన కాంతిని నిక్షిప్తం చేసినట్లు ఆమె కళ్ళు ప్రకాశిస్తున్నాయి. తేనె జాలువారుతున్న రోజాపూవులా ఆమె పెదాలు నిగారిస్తున్నాయి. శంఖం వలె ఒంపు తిరిగిన ఆమె మెడ శ్వేతకాంతి వెదజల్లుతోంది.

నిదురలో అటు ఇటు కదలడంవల్ల పైట చెదిరిపోయింది. జాకెట్‌లోంచి స్తనాలు ఉబికుబికి పడుతున్నాయి. కట్టుకొన్న చీర చెదిరి నునుపుతేరిన మోగాళ్లు... పారిజాతం తొడిమలా మెరుస్తున్న అరికాళ్లు కన్పిస్తూ...

ఆమె నిద్రపోతున్న అప్సరసలా, స్వప్నలోకంలో విహరిస్తున్న దివ్యాంగనలా ఉంది.

ఆ కేబిన్ తాళంవేసి ఉంది. తాళం కెప్టెన్ రాయ్ దగ్గర ఉంది. అతను తప్ప ఆ తలుపు ఎవరూ తెరవరాదు. అది బాస్ ఆజ్ఞ.

అందుకే మరమనిషి కేబిన్ బయట నిలబడి చూస్తున్నాడు. అతని ఎక్స్-రే కళ్ళకు కేబిన్ లోపల ఏం ఉన్నదీ, ఎవరు ఏ స్థితిలో ఉన్నదీ స్పష్టంగా కనిపిస్తారు. అందుకనే అతను శారద సౌందర్యాన్ని బయటినుంచిచూస్తున్నాడు. అలా చూడటం అతనికి ఇష్టం. కాని రాయ్‌కి ఈ సంగతి తెలిస్తే మాత్రం ఇబ్బంది పడాలి. అయినా శారదను చూడటంలోని తృప్తిముందు ఆ ఇబ్బంది ఏమంత ఇదనిపించదు.

అందుకే ఒకటి రెండుసార్లు హెచ్చరించినా లక్ష్యపెట్టక ఈ రాత్రివేళ శారద నిద్రాసౌందర్యాన్ని మరమనిషి తనివితీరా చూస్తున్నాడు. అతడి మనసు కాలాంతరాల వెనక్కు పయనిస్తోంది.

*　*　*

అది శోభనం గది. మల్లెలు గుబాళిస్తున్నాయి. సుగంధ ద్రవ్యాలు మత్తులు




గాలిపే వాసనలు విరజిమ్ముతున్నాయి. పళ్ళు, ఫలహారాలు ఏ నవవధూ కర స్పర్శకో ఎదురుచూస్తున్నట్లున్నాయి. గదంతా పరిమళభరితమై ఉంది. గదిలోని కుషన్ బెడ్ మీద ఒక యువకుడు కూర్చుని ఉన్నాడు. అతని శరీరం దృఢంగా ఉంది. తెల్లటి బట్టలు వేసుకొని ఉన్నాడు. అతని కళ్ళల్లో నిరీక్షణ వెలుగుతోంది. అతని చూపుల్లో కోరిక ప్రజ్వరిల్లుతోంది.

ఇంతలో గదిలోనికి అపరంజి బొమ్మ వచ్చింది. పాదాలపారాణి ప్రకాశిస్తోంది. పెదాలపై సిగ్గు మొగ్గలు వేసింది. బుగ్గలపై లజ్జ లాస్యం చేస్తోంది. కళ్ళల్లో ప్రియా సమాగమ వాంఛ విలసిల్లుతోంది. చూపుల కొసల్లో లైంగిక సంస్పర్శనానుభూతికై తహతహ ప్రసరిస్తోంది.

ఆమె నేరుగా అతని దగ్గరకు వచ్చింది. మౌనంగా తల వంచుకొని నిలబడింది. అతను ఆమెను అమాంతం పొదివి పట్టుకొన్నాడు. ఆమె నిలువెల్లా పులకించి, అతన్ని పెనవేసుకొంది.

యవ్వనాంకురాలు మొలకెత్తిననాటి నుంచి శరీరంలో, మనసులో అపరిణతంగా మిగిలిపోతున్న పరస్పర ఆలింగనానుభూతి ఇప్పుడు స్పర్శకు వస్తున్నది. శరీరంలోని ప్రతి కణం, ప్రతినరం సందడిస్తున్న క్షణం ఇది. చర్మం పొరలలో నిద్రాణంగా ఉన్న రసికధారా ప్రసార మమైకత్వం అది. ఆమె అతనిలో ఇమిడిపోయింది. అతను ఆమెలో ఇమిడిపోయాడు. అంతా చల్లారిన వేడి ... తృప్తి... చేతన.

* * *

స్త్రీ, పురుషుల లైంగిక స్పర్శను మించిన ఆకర్షణ సృష్టిలో లేదు. తనివి తీరిన రతికేళిని తలదన్నే అమృతక్షణం కాలంలో లేదు. అందునా యౌవ్వనోద్రేకంతో కలిసిన యువతీ యువకుల తొలి ప్రణయకేళీ మధురానుభూతికి కొలమానం వారి మానసిక తృప్తియే.

ఆ అనుభూతి కోసమే స్త్రీ, పురుషులు తహతహలాడుతారు. ఆ మమైకత్వం కోసమే యువతీ యువకులు వువ్విళ్ళూరుతారు. పశుపక్ష్యాదులకు నియమిత కాలంలోనే ఈ దాంపత్య సుఖం ఉంది. స్త్రీ, పురుషులకు అలాకాదు. యవ్వనం ప్రారంభం అయిననాటినుంచి కనీసం యాభై యేళ్ళు దాటే వరకు శరీరం ఆరోగ్యంగా ఉంటే వారికి లైంగిక సుఖానికి కొదవలేదు. చరాచర సృష్టి సర్వస్వం ఈ రసికానుభూతిలోనే, పరస్పర ఆలింగనంలోనే పరవశిస్తున్నది. మరి తనకు? రతికేళి గురించి తెలుసు...చూసే ఉన్నాడు. కాని...తనలో ఆ సామర్థ్యం లేదు. తను మరమనిషి.

ఆదమరిచి నిద్రపోతున్న శారద సౌందర్యాన్ని తనివితీరా చూస్తున్న మరమనిషిలో తనను సృష్టించిన బాస్‌పై కోపంవచ్చింది. కాని ఏం చేయలేని అసహాయత. చెలియలికట్ట దాటిరాలేని సముద్ర విజృంభణం అతడి ఆక్రోశం.

నిద్దట్లో శారద అటు ఇటు కదలటంతో పైట మరీ కిందకు జారింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాల ఒరిపిడిలో పాలిండ్లు లయబద్ధంగా ఎగిసి పడుతున్నాయి.

మరమనిషి ఆ దృశ్యాన్ని చూసి వివశుడయ్యాడు. స్మృతి సంపుటాలు తెరుచుకొన్న విపరీత స్థితి అది. కాని వాటిని తెంచుకొని రాలేని అసహాయ దుస్థితి అది. భావం ఉంది. కాని భావానుసరణం లేదు అతనికి.

"శారదా! శారదా!" మరమనిషి నెమ్మదిగా, ఆప్యాయంగా పిలిచాడు. ఆమెకు మెలకువ రాలేదు. మరమనిషి కించిత్కాలం చికాకుపడి "శారూ!శారూ!" అని మరల పిలిచాడు. ఆమె పలకలేదు. ఈసారి అతనికి కోపం వచ్చింది. ఎంతోసేపటి నుంచి వేచివున్న తనను ఆమె చూడక పోవటం, పిలిచినా పలకకపోవటం అతనికి కోపం తెప్పించింది. ఆ ఆవేశంలో అతను ఒక అంశాన్ని మరచిపోయాడు. తన ఎక్స్—రే కళ్ళకు అన్నీ కనిపిస్తాయి. కాని తను శారదకు కనిపించనని. వారిద్దరికీ మధ్య కేబిన్ గోడ ఉంది. ఆ సంగతి మరిచిపోయిన మరమనిషి బిగ్గరగా"శారూ! శారూ!" అని అరిచాడు.

ఆ అరుపు అక్కడంతా ప్రతిధ్వనించింది. ఆదమరిచి నిద్రపోతున్న శారదకు మెలకువ వచ్చింది. ఆమె భయం భయంగా అటూ ఇటూ చూసింది. ఎవరూ కనిపించ లేదు.

తనను ఎవ్వరో అపహరించుకొని పోయారని ఆమెకు తెలుసు. ఇప్పుడు ఎక్కడ ఉన్నదీ, ఎక్కడకు ఎలా వెళుతున్నదీ తెలీదు.అందుకే అయోమయంగా అటూ ఇటూ చూసింది.

కేబిన్ బయట నిలబడి పీప్‌హోల్ ద్వారా చూస్తున్న మరమనిషికి లోపల ఆమె చేస్తున్న చేష్టలన్నీ కనిపిస్తున్నాయి. ఆమె భయపడిందని అతను గుర్తించాడు. ఆమెకు కనిపించి సంగతి చెప్పి భయం పోగొట్టాలనుకున్నాడు. నెమ్మదిగా కేబిన్ తలుపు దగ్గరకు వచ్చాడు.

అప్పటికి శారదకు అర్థం అయింది. తను ఏదో జలాంతర్గామిలో బంధింపబడి ఉన్నానని, తనను ఎక్కడకో అజ్ఞాత ప్రదేశానికి తీసుకువెళుతున్నారని.

ఆమె తనను తాను సంబాళించుకొని గుమ్మంవేపు చూసింది. అక్కడ రెండు అగ్ని గోళాలు కనిపించాయి. అవి జ్యోతుల్లా వెలుగుతున్నాయి. ఇన్నాళ్ళుగా తనను వెంటాడిన దయ్యం కళ్ళు అవే. ఆమె భయపడింది. కెవ్వున అరిచింది. స్పృహ తప్పి పడిపోయింది.

"భయం లేదు శారూ! నేను..." అని మరమనిషి ఇంకా ఏదో అనబోయే లోపలే ఇదంతా జరిగింది.

మరమనిషి దిగాలుపడ్డాడు. అతనిలో ఓటమివల్ల వుక్రోషం జనించింది. అక్కడ నిలబడి శూన్యంగా చూశాడు. శారదకు ఏదో రహస్యం చెప్పాలనుకొన్న తన ప్రయత్నం ఫలించలేదు. ఆమె తన కళ్ళను చూసి భయపడుతోంది. తన మాటవిని బెంబేలుపడుతోంది. ఆమెకు ఆ రహస్యం ఎలా చెప్పడం? మరమనిషికి అంతుపట్టలేదు.

ఇంతలో అక్కడకు కెప్టెన్ రాయ్, సుధ వచ్చారు. ఇద్దరూ నైట్‌డ్రెస్‌లో వున్నారు. రాయ్ మరమనిషిని కోపంగా చూశాడు. సుధ తలుపు తాళంతీసి లోపలకు వెళ్ళి శారదను పరీక్షించింది. ఆమెకు ప్రమాదం ఏమీలేదని నిర్ధారించుకొంది.

"ఆమెను మంచంమీద పడుకోబెట్టు" రాయ్ ఆజ్ఞాపించాడు. మరమనిషి వుక్రోషంగా, అసహాయంగా కదిలాడు. శారదను ఎత్తి మంచంమీద పడుకోబెట్టి బయటకు వచ్చాడు. సుధ కేబిన్ తలుపు తాళం వేసింది.

"నీ డ్యూటీ అక్కడైతే ఇక్కడకు ఎందుకు వచ్చావు?" రాయ్ గద్దించాడు.

"శారద ఎలా వుందో చూద్దాం అని" మరమనిషి బదులుచెప్పాడు.

"ఇలాంటి పిచ్చిపిచ్చివేషాలు వేయకు. శారద బాస్‌కి నైవేద్యంచేసిన ప్రసాదం. అదీకాక నువ్వు మరమనిషివి. శారదను నువ్వు రహస్యంగా చూస్తున్నావని బాస్‌కి తెలిస్తే..." రాయ్ ఏదో అనబోయాడు.

"ఏం అవుతుంది?" మ ర మ ని షి మధ్యలో సవాలుచేసినట్లు ప్రశ్నించాడు.

"నన్నే ప్రశ్నించేటంతవాడవయ్యా వన్నమాట. ఉండు నీ పని చెప్తా" అని రాయ్ ఆ మరమనిషి నడ్డిమీదవున్న చిన్న బటన్ నొక్కాడు.

"వద్దు...నన్ను బాధించవద్దు. ఈ నరకయాతన భరించలేను. అయస్కాంత తరంగాలు ప్రసరింపజేసి, నా మెదడును మరీ కల్లోలపరచకండి. ప్లీజ్....ఆ స్విచ్ ఆపేయండి''మరమనిషి విలవిలలాడుతూ, వంకరలు తిరుగుతూ ప్రాధేయపడ్డాడు. రాయ్ వికటంగా నవ్వి ఆ స్విచ్ ఆఫ్ చేశాడు. మ ర మ ని షి మామూలుగా అయాడు.

"ఖబడ్దార్! బాస్ ఆజ్ఞ కాదని సుప్వేం చేసినా ఈ నరకయాతన తప్పదు. ఇక్కడ శారదకు ఏం జరిగినా వెంటనే మాకు తెలుస్తుంది. జాగ్రత్త...నీ పని నువ్వు చేసుకో" అని రాయ్ చకచక నడుస్తూ వెళ్ళిపోయాడు. సుధ అతన్ని అనుసరించి వెళ్ళిపోయింది.

మరమనషి తననుతాను కించపరచు కొన్నట్లు కనిపించాడు. కేబిన్ పైఅద్దంలో నుంచి లోపలకు చూశాడు. అక్కడ మంచం మీద శారద నిద్రపోతోంది. ఆమె ముఖంలో భయం, విహ్వలత స్పష్టంగా కనిపిస్తున్నాయి.

తన రూపం, తన కళ్లు ఆమెను భయ పెడుతున్నాయి. ఎప్పుడు ఎదురుపడినా ఈ వైపరీత్యం తప్పదు. అందుకని ఎదురు పడకపోవడమే శ్రేయస్కరం. మరి ఆ రహస్యం ఎలా తెలుస్తుంది? ఆమెను బాస్ పాడుచేయకుండా కాపాడటం ఎలా? తనంత తానుగా ఏ పనీచేయలేని బానిస స్థితి తనది. మరి గత్యంతరం?

మరమనిషి నెమ్మదిగా శేఖర్, జగన్నాథ్‌ల కేబిన్ వైపు నడిచాడు.



## 8

తెల్లవారింది. వెచ్చటి సూర్యకిరణాలు శరీరానికి సోకడంతో శేఖర్ ముందుగా మేల్కొన్నాడు. ఇప్పుడిలా సూర్యుడు కనిపిస్తున్నాడూ అంటే తాము జలాంత ర్గామిలోని తమ కేబిన్‌లో లేరన్నమాట. మరి ఎక్కడ ఉన్నట్లు?

శేఖర్ ఆశ్చర్యంగా అటూ ఇటూ చూశాడు. సముద్రం, దూరాన ఇసుక తిన్నెలు కనిపిస్తున్నాయి. అవతల చెట్ల గుబుర్లు కనిపిస్తున్నాయి. సముద్రంలో ఒక వారగా జలాంతర్గామి ఉంది. కొందరు మనుషులు అటూఇటూ హడావుడిగా తిరు గుతున్నారు. ఎవరూఎవరితోనూ మాట్లాడ కుండా యంత్రాల్లా పని చేసుకుని పోతున్నారు. వాళ్ళు మాట్లాడగలరు. అయినా మాట్లాడుకోవటం లేదు. యంత్రాలు అసలే మాట్లాడలేవు. అంతే లేదా!

శేఖర్ అక్కడి వాతావరణాన్ని పరిశీ లిస్తూనే జగన్నాథ్ కోసం చూశాడు.

తనపక్కనే జగన్నాథ్ నిద్రపోతున్నాడు. వేకువఝామునే నిద్రలేచే అలవాటున్న జగన్నాథ్ ఇంకా లేవకపోవడం శేఖర్ కి ఆశ్చర్యంగానే ఉంది. పైగా ఒక్కడూ అలా కూర్చుని ఎంతసేపని ఆలోచించ గలడు? అందుకని జగన్నాథ్ ని తట్టి లేపాడు.

జగన్నాథ్ కళ్లు నులుముకొంటూ లేచాడు. సన్నటి సూర్యకిరణాల వేడి స్పర్శకే అతనికి అర్థం అయింది తాము జలాంతర్గామిలో లేమని. వెంటనే అటూ ఇటూ చూశాడు. అదేదో ద్వీపం అని భావించాడు. బహుశా అదే రాయ్ ముఠా కేంద్రస్థానం అయి ఉంటుంది. అయితే జలాంతర్గామి రాత్రంతా పయనించి ఇక్కడ చేరిందన్నమాట. మరి తమను ఇలా తీసుకువచ్చి ఈ ఇసుక తిన్నెలపై వదలినవారెవరు? మరమనిషా? శేఖర్ లోనూ, జగన్నాథ్ లోనూ ఇవే ప్రశ్నలు కదలాడుతున్నాయి.

"రాత్రంతా మనం మొద్దు నిద్ర పోయామా?'' అప్రయత్నంగా ఇద్దరూ ఒకరినొకరు ఈ ప్రశ్న వేసుకొన్నారు.

శేఖర్ బదులు పలకలేదు.

"రాత్రి మనకు పెట్టిన అన్నంలో మత్తుమందు ఏదో కలిపారు. అందుకే మనం మొద్దు నిద్రపోయాం. జలాంత ర్గామి ఎటు పయనించి వచ్చినదీ మనం ఏ విధంగానూ పసికట్టరాదని వారి ఆశ. అందుకే అలా చేశారు. ఇదేదో ద్వీపంలా ఉంది. ఇదే వాళ్ళ రహస్య స్థావరం అయి ఉంటుంది. శేఖర్...నువ్వేం భయపడకు. మన అవసరం వాళ్ళకుంది. కనక మన ప్రాణాలు తీయరు. మనం చేయవలసిం దల్లా ఒక్కటే. సమయస్ఫూర్తితో ప్రవ ర్తించి,వారి ఆనుపానులు తెలుసుకోవడం" జగన్నాథ్ దూరంగా చూస్తూ అన్నాడు.

అటువైపునుంచి ఇద్దరు మనుషులు వస్తున్నారు.

వారిద్దరూ ఆజానుబాహులు. దృఢకా యులు. యమకింకరులు పాంటూ, షర్టూ వేసుకొన్నట్లుగా ఉన్నారు వారు.

వారిద్దరూ సైనికులవలె నడిచివచ్చి జగన్నాథ్ కి, శేఖర్ కి శాల్యూట్ చేశారు.

"మాతోరండి...మీ బసకుచేరుస్తాం" వారిలో ఒకడు అన్నాడు. వాడి గొంతు కొబ్బరిబూరా వూదినట్లుంది.

"ఇది బాస్ ఆజ్ఞ" రెండవవాడివంత పాట. వాడి గొంతు కొమ్ము బూరాలోంచి మాట్లాడినట్లుంది. ఇద్దరూ తొందరచేస్తు న్నట్లు చూశారు.

"మీ బాస్ ఎవరు?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"మేం చెప్పం" ఇద్దరూ అన్నారు.

"చెప్పరా? మీకుతెలియదా??" శేఖర్ అడిగాడు.

"చెప్పకూడదని ఆజ్ఞ. మీరు మాతో రావాలి" వారు తొందరచేశారు.

ఆ ఇద్దరూ కేవలం సేవకులనీ, వారు తమకు ఏ వివరాలూ చెప్పలేరనీ శేఖర్, జగన్నాథ్ నిశ్చయించుకొన్నారు. "సరే.. పదండి" అని అడుగువేశారు. ఆ సేవకు లిద్దరూ ముందు నడవసాగారు. వెనక శేఖర్, జగన్నాథ్ అనుసరించారు.

"ఇదే ప్రాంతం?"

"తెలీదు"

"ఈ దీవి పేరేమిటి?"

"తెలీదు. దీని గురించి ఈ ప్రాంతం దేశాలకే తెలీదట. ఏడాదిక్రితం దీని ఉనికిని గుర్తించారు. ఇదేదో కొత్తగా ఆవిర్భవించిన దీవి అని చెప్పుకొంటుండే విన్నాం''

"అయ్‌సీ. మీరే ప్రాంతంవారు?"
"తెలీదు"
"ఇక్కడివారేనా?"
"ప్రస్తుతం ఇక్కడివారమే?"
"ఎక్కడినుంచి వచ్చారు?"
"గుర్తులేదు ... మాకు తెలిసిందల్లా ఒకటే....బాస్ ఆజ్ఞను పాటించడం"
"అంటే మీరు మరమనుషులా?"
"కాదు. మరలమైపోయిన మనుషులం. మామూలు మనుషులం"
"అంటే మిమ్మల్ని బానిసలుగా చేశారా?''
"మమ్మల్నికాదు...మా మెదడుల్ని. ఇంతకన్న మేం ఏమీ చెప్పలేం''
"మీలాంటివారెందరున్నారిక్కడ ?"
"చాలామందే ఉన్నారు. వేలమంది ఉండవచ్చు'' అంటూనే ఆ సేవకులిద్దరూ ఒకచోట ఆగిపోయారు.

అక్కడంతా చెట్లు బాగా పెరిగి చిన్న అడవిలావుంది. రకరకాల పెంపుడుజంతువులు తిరుగుతున్నాయి. పక్షులు చెట్లపై కిలకిలారావాలుచేస్తున్నాయి. ఆ చెట్లను, పక్షుల్ని, పశువుల్ని చూసి అదే ఖండానికి చెందిన ప్రాంతమో గుర్తించాలని శేఖర్ ప్రయత్నిస్తున్నాడు.

అక్కడ జరుగుతున్న కార్యకలాపాలు ఏమిటా అని జగన్నాథ్ పరిశీలిస్తున్నాడు. కానీ ఏమీ అంతుపట్టడంలేదు. తుఫానుకు ముందు సముద్రంలో ఏర్పడే ప్రశాంతతలా ఉందక్కడ. బానిస ప్రపంచపు రూపురేఖలు ఆ మనుషులలో కనిపిస్తున్నాయి. అంతే!

ఇంతలో ఎర్రటి సైనికదుస్తులు వేసుకొన్న ఇద్దరు వచ్చారు. వారు సేవకులతో ఏదో మాట్లాడి, పంపించారు. తమతో రండన్నట్లు శేఖర్‌కి, జగన్నాథ్‌కి సంజ్ఞ చేసి నడిచారు.

"మీరు కూడా మరలైపోయిన బానిస మనుషులేనా?'' జగన్నాథ్ వారిద్దరినీ ప్రశ్నించాడు.

"కాదు. మరల్ని, మనుషుల్ని కీలుబొమ్మల్లా తిప్పగల సైనికులం''
"అంటే...?''
"బాస్ స్థాపించబోయే నవమానవ సమాజ సంరక్షకులం. ప్రస్తుతం సైనికులం"
"ఎక్కడివారు?"
''మాకు దేశాల పేర్లు తెలీవు. రంగుల తేడాలు పాటించము. మాకు పేర్లే లేవు. అంతా అంకెలే''
"అంటే ఒకటి, రెండు, మూడు?''
''అలాకాదు. రసాయనశాస్త్రంలో అణు సంఖ్యలున్నట్లు మాకు అంకెలున్నాయి. అణుసంఖ్య, అణుభారం ఆ మూలకం స్థితినీ, శక్తినీ తెలియజేస్తుంది. అలాగే మా శక్తిసామర్థ్యం, సమయస్ఫూర్తి, ఆలోచనా పరిణతినిబట్టి మాకు నంబర్లు కేటాయించారు. ఆ ప్రకారం నా నంబరు 106, ఇతని నంబరు 102. ఇందాక మిమ్మల్ని తీసుకువచ్చినవాళ్ళు మహామూర్ఖులు. అందుకే వాళ్ళని మైనస్ 20, మైనస్ 26 అని పిలుస్తారు"

ఆ మనుషులిద్దరూ ఇక మాట్లాడక వేగం పెంచారు. ఆ ప్రాంతం ఆచూకీ, ఆ మనుషుల వివరాలు తెల్సుకోవడం కష్టం అనుకుంటూ శేఖర్, జగన్నాథ్ వారిని అనుసరించారు.

వందగజాలు అలా నడిచేసరికి వారికి అక్కడ ఒక పెద్ద భవనం కనిపించింది. అది ఈమధ్యనే నిర్మించినట్లు కొత్త కాంతులు వెదజల్లుతోంది.

అత్యాధునికమైన ప్రయోగశాలవలె




ఉందది. సువ్యవస్థితమైన రాజకీయ పరిస్థితి అక్కడ ఉంది. ఎవరూ పరిమితి మించి మాట్లాడని క్రమశిక్షణ అక్కడ నెలకొని ఉంది. ఒక దేశాధినేత కార్యాలయంవలె ఉందది.

శేఖర్, జగన్నాథ్‌లను తీసుకొని ఆ ఇద్దరు సైనికులు భవనంలో ప్రవేశించారు. అది పెద్ద హాలు. అక్కడనుంచి ఒకవైపు తిరిగి సైనికులు ఆ వరండా మీద నేరుగా నడిచారు. రెండు మూడు సందులు తిరిగారు. అక్కడ ఒక గదిముందు నిలిచి తాళం తీశారు.

అది హోటల్ గదివలె ఉంది. శేఖర్, జగన్నాథ్‌లకి విశ్రాంతి గది అది. ఆ సైనికులు వారిని గదిలో ప్రవేశపెట్టి-

"మీరు కాలకృత్యాలు తీర్చుకోండి. మేం మళ్ళీ వచ్చి బాస్ దగ్గరకు తీసుకు వెళతాం" అని బయటకు వెళ్ళిపోయి తలుపు తాళం వేసేశారు.

ఇద్దరూ కాలకృత్యాలు తీర్చుకొన్నారు. అప్పటికే అక్కడ వారికి ఫలహారాలు సిద్ధంచేసి ఉంచారు. వాటిని సేవించారు.

"సి. ఐ. డి. ఇంత నీరసంగా ఉంటాదని నేను ఏ క్రైమ్ నవలలోనూ చదవ లేదు" శేఖర్ జగన్నాథ్‌ని ఎత్తిపొడుస్తూ అన్నాడు.

"చెప్పేదేదో సూటిగా చెప్పు"

"సి. ఐ. డి. మెరుపులా ఆలోచించాలి. పిడుగులా విజృంభించాలి. పాదరసంలా పరుగుపెట్టాలి. వజ్రంలా శత్రువుల్ని నాశనం చేయాలి"

"అవేం నేను చేయడం లేదని, రాజఖైదీలా ఈ భోగాలన్నీ అనుభవిస్తున్నానని నీ అభిప్రాయం... అంతేనా?"





"ముమ్మాటికీ అంతే!"

"అయితే ఇప్పుడు ఏం చేయమంటావు?"

"ఇక్కడనుంచి బయటపడే మార్గం చూడు" శేఖర్ ఆజ్ఞా పూర్వకంగా అన్నాడు. జగన్నాథ్ వినయం ప్రదర్శించి తలుపు దగ్గరకు వెళ్ళి, హాండిల్ ఆడించాడు. తలుపు తాళం వేసినట్లు-అప్పుడు గుర్తించాడు. నిరాశగా వెనక్కు వచ్చాడు.

"చిన్న స్టీల్ వైరుంటే చాలు..తలుపు తెరుస్తా. మనం బయటకు పోవచ్చు" అన్నాడు. శేఖర్ గదంతా వెతికాడు. తాళం తీయడానికి ఉపకరించే మేకు ముక్క కూడా అక్కడ లేదు. అతని ప్రయాస చూసి జగన్నాథ్ నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావు? మన అసహాయతకు ఏడ్వక?" శేఖర్ వుక్రోషంగా అన్నాడు.

"అలా దిగాలుపడటం భీరువుల లక్షణం. చిక్కముఖం వేసి ఉక్రోషపడటం ఆడపిల్లల నైజం. కార్యశూరులు సమయంకోసం వేచి ఉండాలి. ఆవేశపడకూడదు. కృంగిపోకూడదు ... వెయిట్ ఫర్ ఎవైల్"

"ఇంతసేపూ నువ్వేం ఆలోచిస్తున్నావని?"

"ఇప్పటివరకు ఈ కథలో నువ్వే సూత్రధారివి. ఇంతవరకు నీ ఆలోచన ప్రకారం కథ నడిచింది. ఇకపై నేను పాత్రధారిని. నా పథకం ప్రకారం ఇక నాటకం నడుస్తుంది. ఇంకో సంగతి... మనం ఇక్కడ నుంచి పారిపోలేం. కారణం చెప్పనా...ఇది ద్వీపం. ఎటు వెళ్ళినా సముద్రమే. కనక మనం అంత సులభంగా ఇక్కడనుంచి పారిపోలేం. పారిపోనీయరు. కాల్చి చంపు

తారు వీళ్ళు. అందుకని వుపాయంతో అపాయం నుంచి తప్పుకోవాలి. అపాయం వస్తే మెరుపులా దూకాలి. ప్రతిఘటన వస్తే పిడుగులా విరుచుకుపడాలి. శత్రువు తలయెత్తకుండా వజ్రంలా దెబ్బ తీయాలి. అంతవరకు వేచి ఉండాలి. తొందరపడితే వీళ్ళ రహస్యాలు తెలీవు. మన ప్రాణాలు దక్కవు. వెయిట్ ఎ వైల్" జగన్నాథ్ శేఖర్‌కి హితోపదేశం చేశాడు. అతను కొంచెం శాంతించాడు.

ఇంతలో బయట తలుపు తాళం తీస్తున్న చప్పుడైంది. ఇద్దరూ అటు తిరిగారు. ఇందాకటి సైనికులు వచ్చారు. "వెళ్దాం పదండి" అన్నారు. నలుగురూ గది దాటి వరండామీద నడవసాగారు. చాలాసేపు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. చివరకు ఆత్రాన్ని అదుపు చేసుకోలేక శేఖర్ అడిగాడు—

"మా వెంట వచ్చిన మరమనిషి, రాయ్, శారద ఇక్కడే ఉన్నారా?"

"అంతా ఇక్కడే ఉన్నారు" ఒకతను బదులిచ్చాడు.

"మాకు కనిపించలేదేం?"

"మరమనిషి బాస్ దగ్గర ఉన్నాడు. శారదను ఎక్కడ ఉంచారో మాకు తెలీదు. రాయ్, సుధ, మాలవీయా బాస్ దగ్గర ఉన్నారు" ఆ సైనికుడు సమాధానం ఇచ్చి వేగం పెంచాడు.

కొంత దూరం నడిచేసరికి ఆ వరండా ఆఖరైపోయింది. అక్కడనుంచి ఏదో సొరంగ మార్గం కనిపిస్తోంది.

నలుగురూ సొరంగ మార్గంలో ప్రవేశించారు. అది వెండిలా మెరుస్తోంది. లోపల ఫ్లోరసెంట్ దీపాలు వెలుగుతున్నాయి. ఏదో వెన్నెల దారి వెంట నడుస్తున్నట్లుంది. ఇద్దరు మనుషులు యథేచ్ఛగా నడవచ్చు. అందుకని వారు నలుగురూ రెండు జట్లుగా నడిచి వెళుతున్నారు.

"మీ బాస్‌ని ఎప్పుడైనా చూశారా?"

"చూడలేదు. ఆయన ఎప్పుడూ మాకు మొహం చూపరు. రాయ్, మాలవీయా, సుధ తప్ప వేరే ఎవరూ ఆయనతో నేరుగా మాట్లాడటానికి అనుమతి లేదు. మరమనిషి మాత్రం ఆయన దగ్గరకు వెళ్ళగలడు. ఇప్పుడు మీకు బాస్‌ని చూసే అదృష్టం కలుగుతోంది" ఒక సైనికుడు అన్నాడు.

శేఖర్ ఇంకా ఏదో అనబోయాడు. అతన్ని మాట్లాడవద్దని వారు "హుష్" అని వారించారు. వారు మౌనం వహించారు. ఇక ఆ సొరంగమార్గంలో అక్కడ నుంచి ఎటువంటి ధ్వనులు చేయరాదని, అందుకే సైనికులు అలా హెచ్చరించారని శేఖర్, జగన్నాథ్ గ్రహించారు.

నలుగురూ మౌనంగా, గంభీరంగా, సాలోచనగా నడకసాగించారు. సొరంగం అంతం అయింది. అక్కడి నుంచి దీర్ఘ చతురస్రాకారపు భవనం ఉంది. అది భూగర్భ పరిశోధనాలయం అనిపిస్తోంది. కొన్ని గదుల దగ్గర పైన ఎర్రదీపాలు వెలుగుతున్నాయి. కొన్ని గదుల ద్వారాలపై ఆకుపచ్చ దీపాలున్నాయి.

సైనికులు ఒక గది గుమ్మం దగ్గర ఆగారు. చిన్న బటన్ నొక్కారు. క్షణం తర్వాత ఆ గుమ్మం తెరుచుకొంది. నలుగురూ లోపల ప్రవేశించారు.

ఆశ్చర్యం! అదంతా మంచు ప్రదేశం వలె ఉంది. కాని మంచు కాదు. సిలికాన్ కుప్పలు తాపడం చేసిన గోడలవి. అద్దాలు వివిధ కోణాలలో అమర్చిన

అలంకరణ అది. అక్కడ నిలబడి చూస్తే ఒక మనిషి వేల మనుషులుగా, వికృతాకారులుగా కనిపిస్తారు. అది సిలికాన్ స్ఫటికాలపై పడిన నీడల వక్రీభవన, పరావర్తనాల ఫలితం. అద్దాలను 180 డిగ్రీల కోణంలో అమర్చిన 'కెలిడోస్కోప్' ఏర్పాటు అది.

ఒంటరిగా ఆ గదిలో ప్రవేశిస్తే భయం వేసి మనిషి ఒంకరలు తిరిగిపోతాడు. భీతిల్లి పిచ్చెక్కిపోతాడు. వెర్రిగా కేకలు వేస్తాడు. అది ఒక ఆధునిక మయసభ. ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు భ్రమింప జేసే దర్పణాలు అమర్చిన మాయాగది అది.

సైన్స్ సూత్రాలు తెలియని సామాన్య పౌరుడు ఆ గదిలో ప్రవేశిస్తే అయోమయంతో చిందులు వేస్తాడు. తన శరీరం వేయి ముక్కలైనట్లు భయపడతాడు. కాళ్ళకు కళ్ళు మొలిచినట్లు ఫీలవుతాడు. చెవుల నిండా వేళ్ళు మొలచినట్లు వింతగా చూస్తాడు.నడ్డిమీద నోరు తెరుచుకొన్నట్లు, పొట్టమీద కనురెప్పలు ఆడుతున్నట్లు, నుదుటి మీద ముక్కు రంధ్రాలున్నట్లు భ్రమపడతాడు.

అందంగా కనిపించే మనిషి శరీరం ఎంత అస్తవ్యస్తంగా ఉంటుందో, ఎంత బీభత్సంగా ఉంటుందో ప్రత్యక్షంగా చూపే అద్దాల గది అది. అయినా శేఖర్, జగన్నాథ్ నిర్భయంగా ఆ గదిలో నడిచిపోతున్నారు. బింబ, ప్రతిబింబాల భ్రాంతిలో వారు, సైనికులు తమను విడిచి వెళ్ళారని గుర్తించలేదు.

ఎంతసేపు ఎటు నడిచారో వారికి తెలియలేదు. కలగాపులగం అయిన ఇంద్రధనుస్సు రంగులలోకం నుంచి వెలుగులోనికి వచ్చిన అనుభూతి కలగడంతో ఇద్దరూ హఠాత్తుగా అక్కడ నిలిచిపోయారు. అక్కడ రెండు నిలువుటద్దాలున్నాయి. ఒక అద్దంలో శేఖర్, మరొక దర్పణంలో జగన్నాథ్ ఉన్నారు. అచ్చం అద్దం ముందు నిలిచినట్లే ఉంది. ఒకరినొకరు చూసుకొన్నారు. సైనికుల కోసం చూశారు. వారెప్పుడో వెళ్ళిపోయారు.

వెనక్కు చూశారు. అక్కడ అద్దాల మందిరం వెలుగులు విరజిమ్ముతోంది. సిలికాన్ రేణువులు వజ్రపు తునకల్లా తళుకులీనుతున్నాయి. వేలాది బింబాలు, లక్షలాది ప్రతిబింబాలు, ఎంత మాయ అనుకొన్నారిద్దరూ.

ఎదురుగా అద్దాలపైకి చూశారు. దానిపై 'అణు ప్రయోగశాల' అని ఎర్రటి అక్షరాలు ప్రకాశిస్తున్నాయి. ఆశ్చర్యంగా చూస్తున్న వారికి ''పుష్ మి'' అని ఒక బటన్‌పై అక్షరాలు కనిపించాయి.

శేఖర్ బటన్ నొక్కాడు. మరు సెకనులో అద్దాలు రెండు జర్రున అటూ ఇటూ జరిగాయి.మధ్యన ఖాళీ ఏర్పడింది. ఇద్దరూ వెంటనే లోపల ప్రవేశించారు. అద్దాలు యధాస్థానాన్ని ఆక్రమించి,తలుపు మూసివేశాయి. వారు వెనక్కు చూశారు.

వెనుకవైపు కూడా అద్దాలున్నాయి. అవి బొడిపెల అద్దాలు. వాటిలో వారిద్దరి ప్రతిబింబాలు వందలాదిగా కనిపించాయి.

ఇద్దరూ కొంచెం ముందుకు నడిచారు. వారి కళ్ళు క్రమంగా అక్కడి సన్నని కాంతికి అలవాటుపడుతున్నాయి. ఇంతవరకు వారు వేలు కొవ్వొత్తుల కాంతిలో గడిపివచ్చారు. అందువల్ల వారి కనుపాపలు చిన్నవైనాయి. ఇప్పుడు మామూలు కాంతిలోకి హఠాత్తుగా వచ్చారు. కనక కంటిపాపలు వ్యాకోచించి ఎక్కువ

కాంతిని కంటిలోనికి ప్రసరింపజేస్తేతప్ప వారికి అక్కడి వస్తువులు స్పష్టంగా కనిపించవు.

అయినా ఆ చిరుకాంతిలోనే వారు కొన్ని అడుగులు అయోమయంగా వేశారు. వారికి అక్కడి పరిస్థితి క్రమంగా తెలుస్తోంది. అది విశాలమయిన హాలు. అక్కడ ఎందరో శాస్త్రవేత్తలు ప్రయోగాలు చేస్తున్నారు. రకరకాల యంత్రాలు, కంప్యూటర్లు అక్కడ నిర్విరామంగా తమ విధులు నిర్వర్తిస్తున్నాయి. కొన్ని యంత్రాలపై బల్బులు వెలిగి, ఆరిపోతున్నాయి.

కొన్ని కంప్యూటర్లపై రేఖామాత్రంగా విద్యుత్ గీతలు తళుక్కున మెరుస్తున్నాయి. ఆ యంత్రాలన్నింటికీ మధ్య మరొక విశిష్టమయిన యంత్రం వుంది.

అది 'క్లౌడ్ చాంబర్'. దాని చుట్టూ చిన్న చిన్న ఎలక్ట్రానిక్ యంత్రాలున్నాయి. 'క్లౌడ్ చాంబర్లో' ఎన్నో పందల వేల ఎలక్ట్రాన్‌లు, ప్రోటాన్‌లు, న్యూట్రాన్లు చిత్ర విచిత్ర గతులలో నర్తిస్తున్నాయి. అవి తటిల్లతలవలె మెరిసి, పరుగు పెడుతున్నాయి. వాటి వెనుక దేదీప్యమానం అయిన కాంతిరేఖలు ఉద్భవిస్తున్నాయి. ఆ యంత్రాన్ని అయిదారుగురు శాస్త్రవేత్తలు నడుపుతున్నారు. ఎవరూ వీరిని పట్టించుకోలేదు.

ఆ ప్రయోగశాల చుట్టూ చూశారు. అంతే! వారి ఆశ్చర్యానికి అంతంలేదు.

అక్కడ కొందరి శవాలు నిలబడి వున్నాయి. ఆ ప్రయోగశాలను కాపలా కాస్తున్న భంగిమలలో ఉన్నాయవి.

శేఖర్ నోట మాట రాలేదు. జగన్నాథ్ అప్రతిభుడయ్యాడు.

అవి శాస్త్రవేత్తల శవాలు. దేశ, విదేశాలలో పేరుపొందిన విజ్ఞానవేత్తలు వారు. ఒక్కొక్క శాస్త్రంలో తలలుపండిన బృహస్పతులు వారు. వారిలో ఒకరు ఇంగ్లండ్ శాస్త్రవేత్త జాన్ డగ్లస్, రసాయన శాస్త్రంలో దిట్ట. మరొకరు విన్‌స్టన్ విల్లీ, అంతరిక్ష విజ్ఞానంలో అందెవేసిన చెయ్యి. ఇంకొకరు జర్మనీకి చెందిన హూర్ గోల్బజ్, రొబొటిక్స్‌లో ప్రసిద్ధుడు. మరొకరు రేనాల్డ్ హావ్‌లాక్‌పరా, మనోవైజ్ఞానికుడు. ఆ పక్కనున్న వాడు ఫ్రాన్స్‌కు చెందిన అణుశాస్త్రవేత్త మైఖేల్‌సన్. అతనికి ఆ చివర నిలిచినవారు పెయిరీ, ఆమె జీవరసాయనశాస్త్రవేత్త. అదిగో ఆ గోడపక్క నిలచినవాడు డాక్టర్ వెంకట్రావ్. సిలికాన్ బాంబ్ నమూనా తయారు చేసిన దిట్ట. మరొకరు శారద భర్త రామనాథన్.

ఆ శాస్త్రవేత్తలందరూ ఇక్కడ శవాలై దిష్టిబొమ్మల్లా వున్నారు. వారి కళ్ళల్లో అసంతృప్తి, లాలస అలాగే వుంది. వారి చూపుల చివర మృతప్రాయమైపోయిన ఆశయాలు వేలాడుతున్నట్లుంది. శేఖర్ నెమ్మదిగా జగన్నాథ్‌కి వాళ్ళని గురించి చెప్పాడు. వీరంతా గుండెపోటుతో మరణించినవారు లేదా అదృశ్యం అయిన వారు అని లోకం నమ్మింది.

కాని వారు చనిపోలేదని, ఏదో అదృశ్య శక్తికి వారు చిక్కిపోయారని, తాను చేసిన వూహ నిజం అయిందని శేఖర్ జగన్నాథ్‌కి గుర్తుచేశాడు.

మమ్మీలుగా మార్చబడిన ఆ శాస్త్రవేత్తల్ని చూస్తే జాలి, భయం వేస్తోంది. పైగా మరొక భయంకరమయిన సంగతుంది. వారందరి చెవులపైన కపాలం లేదు. అది 'ఆపరేట్' చేయబడి వుంది. వారి మెదడులు తీసివేశారు. ఆ స్థానంలో గాజుపలక ఒకటి బోల్టించి వుంచారు.



అంటే వారి మెదడుల్ని వేరేచోట భద్ర పరిచారన్నమాట. ఎంత ఘాతుకం! ఎంత కుట్ర!

నెమ్మదిగా అడుగులువేస్తున్న వారికి ఎదురుగా తెల్లటి దుస్తుల్లోవున్న ఒక మహిళా శాస్త్రవేత్త వచ్చింది. ఆమె ముఖంలో నిర్లిప్తత పేరుకొని వుంది. ఆమె శేఖర్‌ని ఎగాదిగా చూసింది. అతనూ ఆమె గురించి జ్ఞాపకం చేసుకొందుకు ప్రయత్నించాడు.

"మీరు డాక్టర్ చంద్రశేఖర్ కదూ! ఫ్యూయల్ టెక్నాలజీలో మీ థీసిస్ పూర్తిఅయిందా?" ఆమె ఏదో గుర్తు వచ్చినట్లు అడిగింది.

"మీరు మిస్ మంజుల కదూ! అంగాల మార్పిడిలో మీరు సాధించిన విజయాలు సుపర్బ్! మీరిక్కడ చేరారా? నా పరిశోధనను మధ్యలోనే వదిలివేశాను" శేఖర్ ఆమెను గుర్తుపట్టి అన్నాడు.

"నేను ఇక్కడ చేరలేదు. బలవంతంగా చేర్చబడ్డాను. 'న్యూ జనరేషన్ క్లబ్' మెంబర్‌నయి వీళ్ళ చేతికి చిక్కాను" మంజుల బాధగా అంది.

"బయటపడే మార్గం లేదా?"

ఈ ప్రశ్నతో ఆమె శుష్కంగా నవ్వింది. ప్రాణాలు కోల్పోయి, మమ్మీలుగా నిలిచిన ఆ ప్రతిభామూర్తుల వైపు దృష్టి సారించింది.

"బాస్ మాట కాదంటే వాళ్ళ గతే పడుతుంది" అంది ముక్తసరిగా. తనను వ్యతిరేకించేవాళ్ళని బాస్ చంపేస్తాడని వారికి అర్థంఅయింది.

"అదిసరే! వీళ్ళ శవాల్ని ఎందుకీ లాబరేటరీలో అలంకరించాడు మీ బాస్?'' జగన్నాథ్ ప్రశ్నించాడు.

"ఇది ఒక విషవలయం. ప్రపంచాధిపత్యం సాధించి, చిరంజీవిని కావాలని మా బాస్ ఆశ. అందుకే ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తల్ని సమీకరించాడు. తనతో చేయికలిపినవాళ్లకి సకలవిధ సౌకర్యాలు, అధికారాలు, సుఖాలు కల్పించాడు. వ్యతిరేకించినవాళ్ళని శవాలుగా మార్చి దిష్టి బొమ్మల్ని చేశాడు. ఇక్కడ పరిశోధనలు చేసే అందరికీ తామెంత శ్రద్ధగా పనిచేయాలో ఈ శవాలు హెచ్చరిక చేస్తుంటాయి. వ్యతిరేకిస్తే బాస్ విధించే శిక్షను ఈ మమ్మీలు సూచిస్తుంటాయి. దట్సాల్! మీరు వెళ్ళిరండి" అని మంజుల ఒక యంత్రం వైపు వెళ్ళిపోయింది.

శేఖర్, జగన్నాథ్ పది అడుగులు ముందుకు వేశారు. అది ఒక గది గుమ్మం. వారు అటు ఇటు పరిశీలించి బజర్ నొక్కారు.

"కమిన్'' లోపల్నుంచి స్త్రీ కంఠం వినిపించింది. తలుపు తెరుచుకొని ఇద్దరూ లోపలకు వెళ్ళారు.

* * *

ఆ గదంతా పాలరాతితో నిర్మితం అయింది. గోడలకు 'ఎక్వేరియమ్'లు అమర్చబడి ఉన్నాయి. కాని చేపలు ఈదుతుండవలసిన ఆ గాజు తొట్టెలలో మనుషుల మెదళ్ళు నిశ్చలంగా ఉన్నాయి. వాటిచుట్టూ తెల్లటి పోషక రసాయనం ఉంది. కొన్ని గాజు తొట్టెలు ఖాళీగా ఉన్నాయి.

శేఖర్ ఆ దృశ్యాన్ని చూసి ముందు కొంచెం విహ్వలుడయాడు. తరువాత తమాయించుకొన్నాడు. జగన్నాథ్ ఆ గది నిర్మాణాన్ని పరిశీలిస్తున్నాడు.

ఇద్దరి దృష్టి ఒకేసారి గది మధ్యకు ప్రసరించింది. అక్కడ సోఫాసెట్ వుంది. ఒక సోఫాలో సుధ ఉంది. రెండవ సోఫాలో రాయ్ ఉన్నాడు. అతని పక్కన మాలవీయా ఉన్నాడు. వారి ఎదురుగావున్న సోఫా ఖాళీగా ఉంది. సుధ కూర్చున్న సింగిల్ సోఫా ఎదురుగా కొంచెం దూరంలో సన్నటి తెరకట్టివుంది. ఆ తెర వెనుక స్ప్రింగ్ కుర్చీ. కుర్చీలో బాస్ ఉన్నాడు. అతని రూపం స్పష్టంగా తెలియడంలేదు.

"అతిథుల్ని కూర్చోమనండి" బాస్ కంఠం ఆజ్ఞాపించింది. రాయ్ ఏదో అనబోయాడు. అది గుర్తించిన శేఖర్, జగన్నాథ్ మౌనంగా వచ్చి ఖాళీగా ఉన్న సోఫాలో కూర్చున్నారు. బాస్ వయస్సు ఎన్ని సంవత్సరాలు ఉంటుందా అని వారు ఊహిస్తున్నారు.

"సవసమాజ సంస్థాపనైకలక్ష్య సారథికి మా నమోవాకాలు" ఇద్దరూ ఒకేసారి అన్నారు.

బాస్ కుర్చీ చివాలున ఇటు తిప్పాడు.

విజ్ఞానం మూర్తీభవించిన ముఖ వర్చస్సు! లోకంపై తృణీకారభావం, ప్రపంచ నియంతను ఉండే అహంకారం ఆ ముఖంలో లీలామాత్రంగా కనిపిస్తున్నాయి.




"భావి ప్రపంచ నియంతకు మా జోహార్లు!" శేఖర్, జగన్నాథ్ అభివాదం చేశారు.

బాస్ ఉలిక్కిపడ్డాడు. వారి వ్యంగ్యం అతనికి అర్థం అయింది.

"జోహార్ కాదు...జే జే లు" బాస్ కంఠం సవరించుకొని అన్నాడు.

"ప్రజా సంక్షేమం కోసం పాటుపడే మహనీయులకు జేజేలు పలకడం, భస్మాసురులకైతే బతికుండగానే జోహారు లర్పించడం రివాజు" జగన్నాథ్ తిరస్కార పూర్వకంగా అన్నాడు.

బాస్ పకపకా నవ్వాడు.

"శబ్దార్థాలు, ఔచిత్య, అనౌచిత్యాలు, హెచ్చుతగ్గులు లేని నవ సమాజం నిర్మిస్తాన్నేను. అప్పుడు ఈ లోకం నాకు జేజేలే పలుకుతుంది. మీరు పలకకపోతే నాకొక లెక్కా?" అన్నాడు బాస్.

"మీ పేరు...?"జగన్నాథ్ అడిగాడు. బాస్ జవాబు చెప్పలేదు. అంతా నిశ్శబ్దం.

"విద్యాసాగర్!" శేఖర్ బిగ్గరగా అన్నాడు.

అందరూ ఆశ్చర్యపోయారు.

బాస్ కుర్చీలోనుంచి తటాలున లేచి తెర తొలగించుకొని బయటకు వచ్చాడు. రాయ్, మాలవీయా, సుధ తొట్రుపడి గౌరవ సూచకంగా లేచి నిలబడ్డారు. శేఖర్, జగన్నాథ్ లేవలేదు.నిర్లక్ష్యంగా కూర్చునే వున్నారు.

"మిస్టర్ విద్యాసాగర్!నీ అంతర్యాన్ని నీ డైరీ చెప్పింది. ఆ డైరీ నేను సంపాదించగలిగాను" శేఖర్ అన్నాడు.

విద్యాసాగర్ మరి మాట్లాడలేదు. ఒక్కసారి అందర్నీ పరికించి చూశాడు. అంతలోనే అతడిముఖం గంభీరంఅయింది.

ఇంతలో అక్కడకు మరమనిషి వచ్చాడు.

."హలో..గుడ్‌మార్నింగ్!"మరమనిషి వారికి విష్‌చేసి పక్కకు తప్పుకొన్నాడు.

"మిస్టర్ శేఖర్, మిస్టర్ జగన్నాథ్! మిమ్మల్ని ప్రాణాలతో ఇంతదూరం తీసుకువచ్చిన కారణం ఈపాటికి వూహించేవుంటారు" విద్యాసాగర్ అన్నాడు.

"తెలుసు. మమ్మల్ని బానిసలుగా మార్చివేయడానికి" ఇద్దరూ అన్నారు.

"కాదు. మాలో భాగస్వాములు కావాలని కోరడానికి. ఒక మహోత్కృష్ట సమాజ నిర్మాణంలో మీవంటివారి సహాయం ఎంతయినా అవసరం'' విద్యాసాగర్ అన్నాడు.

''మీతో చేయికలపకపోతే...?'' శేఖర్ సవాలుచేశాడు.

విద్యాసాగర్ పకపక నవ్వాడు.

''మా లేబరేటరీలోకి వస్తూ మీరు కొన్ని శవాల్ని చూశారుకదా! అలా అయిపోతారు. లేదంటే మీకు త్రిశంకు నరక శిక్ష విధిస్తాను" విద్యాసాగర్ హెచ్చరించాడు.

"త్రిశంకు నరకమా?" జగన్నాథ్ ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

''అవును...త్రిశంకు నరకమే. మిస్టర్ 242" అని పిలిచాడు విద్యాసాగర్.

అంతవరకు పక్కకు నిలబడి మౌనంగావున్న మరమనిషి ముందుకు వచ్చాడు. "యస్ బాస్" అన్నాడు వినయంగా.

మరమనిషిని చూడగానే శేఖర్‌కి ఇదివరకు అతనన్న మాటలు గుర్తుకు వచ్చాయి.

"నేను మరమనిషినే. కాని ఆలోచించే మెదడు వున్నవాణ్ణి. రక్త

మాంసాలు, వయోరూప లావణ్యాలువున్న యువతిని గాఢంగా ప్రేమిస్తున్నాను. ఆమె పేరు శారద" మరమనిషి మాటలే శేఖర్ చెవుల్లో గింగురులిసాయి.

వెంటనే శేఖర్‌కి ఒక ఆలోచన వచ్చింది. అది నిజమో కాదో తేల్చుకోవాలనుకొన్నాడు.

"మరమనిషీ! నీలో రామనాథన్ మెదడు ఉంది...అవునా?" అని ప్రశ్నించాడు.

మరమనిషి మౌనంగా తల వూపాడు.

ఈసారి విద్యాసాగర్ కర్కశంగా నవ్వాడు. తరతరాల స్వార్థం, అధికార దాహం ఆ నవ్వులో ప్రతిధ్వనిగా వెలువడ్డాయి. కోపం అతని ముఖంలో ఎర్రగా జేవురించింది.

"మిస్టర్ శేఖర్! నీవంటి తెలివయిన వాడే నాకు కావాలి. నువ్వూహించినట్లే ఈ మరమనిషిలో రామనాథన్ మెదడును ఇమిడ్చాను. ఇది త్రిశంకు నరకం కాదా? ఆలోచించు. నా మాట విని, మాతో చేయి కలుపుతావో లేకపోతే అదిగో చూశావా? ఆ గాజు తొట్టెలోవున్న మెదడు ముద్దగా మారిపోతావో లేకుంటే ఇలా ఈ రామనాథన్‌వలె తెలివుండి నాకు బంటువై పోతావో! ఏం మిస్టర్ జగన్నాథ్! నీకూ వర్తిస్తుంది" విద్యాసాగర్ మాటలు సీరియస్‌గా వున్నాయి.

వారిద్దరూ మాట్లాడలేదు. స్థాణువులై విద్యాసాగర్‌ని, మరమనిషిని మార్చి మార్చి చూస్తున్నారు.

"ఈ మరమనిషి లోపల 'ఎలక్ట్రానిక్' యంత్రపరికరాల్ని చూశాం. ఇతనికి మనిషి మెదడు ఎలా అతికానా? ఇది అసంభవం కాదా? అని మీ అనుమానం కదూ! కాని సృష్టిలో మనిషికి అసాధ్యం ఏమీలేదు" విద్యాసాగర్ సాఫీగా అన్నాడు.

"ఇది అసంభవం! అబద్ధం! అయినా అపూర్వం" శేఖర్ మొండిగా అరిచాడు.

"శాస్త్రవేత్తవై వుండి అసంభవం అంటావేమిటి? తప్పు! అబద్ధం అన్నావు నేను అంగీకరించను. అపూర్వం అన్నావు సెహభాష్!" విద్యాసాగర్ తాపీగా అన్నాడు. ఇద్దరూ మౌనంగా అతనివేపు చూడసాగారు. అందర్నీ ఒక ప్రశ్న వేధిస్తోంది.

మనుషుల్ని మమ్మీలుగామార్చివేయడం సులభమే. అలాగే మెదడును లేబరేటరీలో భద్రపరచడంవరకు జీవసాంకేతిక పరికరాలు తయారయాయి. కాని ఒక మనిషి మెదడును తీసి మరమనిషిలో బిగించి, దానిని తన అధీనంలో ఎలా ఉంచుకోగలుగుతున్నాడు విద్యాసాగర్? ఈ అనుమానం వారిలో తలఎత్తింది.

మనిషిమెదడు కపాలంలో సురక్షితమై సువ్యవస్థితమై ఉంటుంది. శరీరంలేని మెదడు ఉండదు. మెదడులేనిదే శరీరంలోని జీవరసాయన కార్యకలాపాలు సాగవు. అవి పరస్పర ఆధార ఆధేయాలు. శారీరక చర్యలకు మెదడే ప్రేరకం. మెదడు ఇచ్చే సందేశాలకు అనువుగా శరీరావయవాలు పనిచేస్తాయి.

అలాంటిది మరమనిషిలో మెదడు ఎలా జీవిస్తోంది. మరమనిషిలో ప్రేమానురాగాలు వంటివి ఉండవు. అవి ఉన్నాయంటే, ఉండాలంటే మెదడు ఉండాలి. అందుకే ఈ మరమనిషిలో ఆలోచన ఉంది. భావనలు ఉన్నాయి. అంటే మనిషికి వారసత్వంగా సంక్రమించిన ఒక మెదడు మనిషి సృష్టించిన మరని నడుపుతోందన్నమాట. ఎంత వింత? అయితే విద్యాసాగర్ ఆ మెదడును తన

అధీనంలో ఎలా ఉంచుకోగలిగాడు? ఆ మెదడు సజీవంగా ఉండి సంవేదనశీలమై, భావానుగతికలిగి ఉన్నట్లయితే మరొకరికి దాస్యం ఎలాచేస్తోంది? సొంతంగా ఆలోచించగలిగితే అది తనకు శత్రువైన విద్యాసాగర్‌కి లోబడి ఎందుకు పని చేస్తోంది? శారదనే ప్రేమిస్తున్నట్లయితే రామనాథన్ మెదడు విద్యాసాగర్‌కోసం ఆమెను ఎందుకు అపహరించుకొని వస్తుంది?

అన్నీ సందేహాలే! గదంతా నిశ్శబ్దంగా ఉంది. ఎవరూ ఏమీ మాట్లాడటంలేదు. అందరిదృష్టి విద్యాసాగర్‌పై కేంద్రీకృతం అయివుంది.

"బాహ్యదృష్టికి ఇది అసంభవం అని పిస్తుంది. కాని మనిషి మెదడు నిర్మాణం గురించి క్షుణంగా తెలిస్తే ఈ మార్పిడి ఈ నియంత్రణ కష్టం అనిపించదు"

అందరూ తన సమాధానానికే ఎదురు చూస్తున్నారని గ్రహించిన విద్యాసాగర్ చివరికి అలా అన్నాడు.

అందరూ అతను ఇంకా ఏంచెప్తాడో నని ఆత్రంగా చూడసాగారు.

"డాక్టర్ రామనాథన్ మెదడు ఇప్పుడు పోజిట్రోనిక్ శక్తిమధ్య ఇమిడి ఉంది. ఆ శక్తి మెదణ్ణి జీవించివుంచుతుంది. పోతే మెదడులో రకారకాల కేంద్రాలు న్నాయి. అవి శరీరంలోని వివిధ అవయవాల్ని కంట్రోలు చేస్తుంటాయి. కోరిక జన్మించడం వేరు. కోరికను అను భూతిగామార్చుకొనడంవేరు. అంటే కోరిక ఉన్నమనిషి దానిని తీర్చుకోలేని అశక్తుడైతే అది యంత్రస్థితి కదా. ఉదాహరణ చెప్తాను. ఎవరినైనా అవమానించాం అను కోండి. అతనికి తననవమానించినవాణ్ణి హత్య చేయాలనే కోరిక కలుగుతుంది. అయితేకాక అతనిలో అలాంటి ప్రతీకారేచ్ఛ ఉత్పన్నం కాలేదనుకోండి. అతని శరీరం క్రియాశూన్యం అవుతుంది. అతడు అవమానాన్ని భరించి, ఘూర్ణిల్లి మౌనంగా ఉండిపోతాడు. రామనాథన్ మెదడుకూడా అదే స్థితిలో ఉంది. మెదడులోని 'థెలామస్' అనే భాగం ఇటువంటి కోరికలకు ప్రేరణ ఇచ్చే కేంద్రం. నేను ఆ 'థెలామస్'లో సన్నటి తీగ దించేశాను"

విద్యాసాగర్ తను చేసిన ఘనకార్యం గురించి చెప్తుంటే అందరూ అప్రతిభులై వింటున్నారు. అందరిదృష్టి అతనివైపే కేంద్రీకృతమై ఉంది.

అదే అదనని శేఖర్ అక్కడ డ్రాయర్‌మీద వున్న చిన్న స్టీల్ వూచని అతిలాఘవంగాతీసిజేబులోవేసుకొన్నాడు. అది ఎవరూ గమనించలేదు.

"ఆ సూది గుచ్చడంవల్ల 'పోజోట్రానిక్' శక్తి కేంద్రంవరకు ప్రసరించదు. అంతేకాదు మెదడులో ఉత్పన్నం అయే కోరికల్ని అది చంపివేస్తుంది. మెదడు కణాలు చచ్చిపోకుండా ఇటువంటి అమరిక చేయడం చాలాకష్టం. హెచ్చు తగ్గులులేకుండా శక్తిప్రసారం జరుపుతుం డటం మెదడును ప్రాణంతో ఉంచడానికి ముఖ్యం. శక్తితరంగాల ప్రసారంలో ఎలాంటి మార్పులువచ్చినా మెదడుకణాలు మరణిస్తాయి. అయితే న్యూరో స్కోప్‌లోని న్యూరోసర్జన్‌తో కలిసి విశేషపరిశోధన చేసి నేను ఈ ప్రక్రియను రూపొందించ గలిగాను. ఆ ప్రయోగ విజయమే నన్ను ఈ పనికి ప్రోత్సహించింది. మనిషి మెదడుతో మరమనిషిని నడపవచ్చని నిరూపించాను. అయితే మనిషి మెదడుతో పనిచేసే యంత్రవ్యవస్థగల మరమనిషిని రూపొందించడం పెద్ద సమస్య అయింది.

'రొబొటిక్స్'లో నిష్ణాతులైన వారిద్వారా నేనీ మరమనిషిని సృష్టించి మెదడును ప్రతిష్ఠించాను."

క్షణం ఆగాడు విద్యాసాగర్. "నా ప్రయత్నం ఫలించింది. పోజిట్రానిక్ శక్తిమధ్య ఆ మెదడు సజీవంగా ఉండి పని చేయసాగింది. 'థెలామస్'లోనికి సన్నటి సూదిని దింపడంద్వారా మెదడులో కోరికలు జన్మించకుండా నిరోధించడం సాధ్యమనికూడా ప్రయోగాలు ధ్రువపరిచాయి. ఈ ప్రయోగఫలితమే శారద పట్ల నా అసక్తి.

"ఆమెను నేను ప్రేమించాను. కాని ఆమె నన్ను తిరస్కరించింది. పైగా రామనాథన్‌ను వివాహం ఆడింది. అప్పట్లో విరక్తిచెంది విదేశాలకు వెళ్ళి ఈ పరిశోధనలు చేసాను. రామనాథన్ మెదడును మరమనిషిలో బంధించి నాకు బానిసను చేసుకోవాలనుకొన్నాను. అప్పుడే శారద నాదవుతుందని ఆశించాను.

"అప్పటికే రాయ్, మాలవీయా, సుధ 'నవమానవ సమాజ' ఆవిర్భావానికై ఒక వ్యూహం తయారుచేశారు. పని ప్రారంభించారు. ఎందరో వారికి చేయూతనిచ్చారు. కొందరు వ్యతిరేకించారు. ఫలితం అనుభవించారు. ఆ సమయంలో వెంకట్రావు సిలికాన్ బాంబు పథకం వారి దృష్టికి వచ్చింది. నేను వారితో చేతులు కలిపాను.

రామనాథన్‌ని కలిశాను. మా ప్రణాళిక గురించి వివరించాను. అతను కలసి రానన్నాడు. అతనికి గుండెపోటు వచ్చే మందుఇచ్చాం. అనుకొన్నట్లే అతను మరణించాడు. మా పథకం ప్రకారం శవాన్ని సంపాదించాం. మెదడును తీశాం. పోజిట్రానిక్ శక్తి ప్రసారం జరిపి దానిని మరల జీవింపజేశాం. ఈ మరమనిషిలో దానిని అమర్చాను. రామనాథన్ నా బానిస అయ్యాడు. శారద నా సొంతం కాబోతోంది. త్వరలోనే ఈ ప్రపంచం కూడా మా స్వంతం కాబోతోంది"

విద్యాసాగర్ ఒక్కసారిగా పగలబడి నవ్వాడు. ప్రపంచంలోని నవజీవన కోలాహలాన్ని గుప్పిట బంధించాలనుకొంటున్న ఒక హిరణ్యాక్షుడు చేసిన లయవిన్యాసం అది. నవనవోన్మేషమైన యవ్వన ప్రాంగణంలోని యువతి తన కౌగిట ఇమిడిపోతుందన్న సంతృప్తి చేసిన ఆనంద వాక్య విన్యాసం అది. మనిషి ఏకకాలంలో ఆనందప్రియుడూ, లయంకరుడు కూడా అవగలడు మరి.

విద్యాసాగర్ అందర్నీ ఓసారి పరికించి శేఖర్, జగన్నాథ్‌లపై దృష్టి నిలిపాడు.

"చూశారా! తనతో కాపురం చేయవలసిన భార్య, తను అమితంగా ఆరాధించిన యౌవ్వన సౌందర్యం మరొకరికి అంకితం అయినా ఈ మెదడులో ఎలాంటి ప్రతీకారం ఉత్పన్నంకాదు. కాని ఆ పరిస్థితిని చూసి ఈ మెదడు విలవిలలాడుతుంది. ఇదీ త్రిశంకు నరకం అంటే''

విద్యాసాగర్ మరమనిషి వైపు కఠినంగా చూశాడు. అతను నిస్సహాయంగా నిలబడి ఉన్నాడు.

"మిస్టర్! నా ప్రయోగం సంగతి వివరించాను. మరొక సంగతి కూడా వినండి. ఈ చుట్టూ ప్రత్యేక పేటికలలో మీకు కనిపిస్తున్న మెదడులన్నీ జీవించే ఉన్నాయి. ఎప్పుడు కావాలంటే అప్పుడు పేటికి పోజిట్రానిక్ శక్తిని అందించి జీవింపజేసి నాకు దాస్యం చేయించుకొంటాను. అనుభూతి ఉన్నా క్రియాశక్తి,




ప్రతీకారేచ్ఛ లేని మరమనుషులుగా మార్చి వేస్తాను" ఈ మాటలు అని విద్యాసాగర్ శేఖర్ వైపు, జగన్నాథ్ వైపు సాభిప్రాయంగా చూశాడు.

వారిద్దరూ ఏమీ మాట్లాడలేదు.

"మీరు మాతో చేయికలపండి. జీవితం అంతా అంతులేని ఆనందాల మల్లిపందిరి అవుతుంది. లేదంటే ఈ మరమనిషిలా భయంకర జీవితం గడపాలి.ఈ ప్రపంచం గురించి అనుభవం వుంటుంది. అనుభూతి వుంటుంది. కాని బానిసలై వుంటారు. ప్రపంచంలోని ప్రతి వస్తువూ మీకు అర్థహీనంగా కనపడుతుంది... ఆలోచించండి" అన్నాడు విద్యాసాగర్.

శేఖర్, జగన్నాథ్ ఒక్కసారి కళ్ళు మూసుకొన్నారు. విద్యాసాగర్ మాట కాదంటే తమగతి ఏమిటో వారికి స్ఫురణకు వచ్చింది.

"కొంచెం వ్యవధి ఇస్తారా?" శేఖర్ అన్నాడు.

"ఆలోచించి చెప్తాం" జగన్నాథ్ అన్నాడు.

"ష్యూర్...ష్యూర్! కాని మిస్టర్ జగన్నాథ్! మీ గూఢచారి మనస్సుతో ఆలోచించకండి. తెలివైన ఒక పౌరుడిగా ఆలోచించండి. అతితెలివి ప్రదర్శిస్తే త్రిశంకు నరకం తప్పదు" విద్యాసాగర్ అన్నాడు.

"మేం మా సమాధానం ఎప్పుడు చెప్పాలి?" శేఖర్ అడిగాడు.

"ఇప్పుడే తొందరలేం లేదు. బాగా ఆలోచించండి. అంతవరకూ మీరు మాకు సామాన్య అతిథులుగా ఉంటారు. మిస్టర్ 2421...వీరిని వారి గదికి తీసుకువెళ్ళు" విద్యాసాగర్ ఆజ్ఞాపించి గబగబ ఆ గదిలో ఎడమవైపు వెళ్ళిపోయాడు. క్షణంలో అతను అదృశ్యం అయాడు.

"మమ్మల్ని ఇలా వదిలివేశాడు. విద్యాసాగర్ ధీమా ఏమిటి?" జగన్నాథ్ అడిగాడు–రాయ్‌ని, మాలవీయాని, సుధని మార్చిమార్చి చూస్తూ.

"బాస్‌కి తన శక్తి మీద విశ్వాసం" మాలవీయా అన్నాడు. అది రాజకీయ నాయకుడి ఫక్కీ జవాబు.

"ఇక్కడకు వచ్చినవాళ్ళు తిరిగి పోరన్న ధీమా" రాయ్ అన్నాడు. అది సైనికాధికారి అంచనా.

"త్రిశంకు నరకం గురించి భయపడి ఎవ్వరూ తన మాట కాదనరని ఆయన నమ్మకం" సుధ అంది. ఒక శాస్త్రవేత్త భావన అది.

"అదిసరే! మీలో నవమానవ సమాజానికి అధినేత ఎవరు? చివరకు అందరూ త్రిశంకు నరకానికే పోతారా?"జగన్నాథ్ ఈ ప్రశ్న వేసి వారి సమాధానానికి ఎదురుచూడకుండా మరమనిషికి ''రా!" అన్నట్లు సంజ్ఞచేశాడు.

మరమనిషి ముందు నడవగా వారు అనుసరించారు.




జగన్నాథ్ ఆ మాట నిశ్చింతగా అనేసి వెళ్ళిపోయాడు. కాని ఆ ఒక్కమాటే ఆ ముగ్గురిలో సంచలనం లేవదీసింది. రాయ్ సైనికాధికారి. మాలవీయా రాజకీయ

నాయకుడు. సుధ విజ్ఞాన శాస్త్రవేత్త. వారితో ఆ కేంద్ర స్థావరానికి రాని చందన్‌లాల్ ఆర్థికంగా కుబేరుడు. వీరిలో ఎవరికివారు తమతమ రంగాలలో మకుటంలేని మహారాజుల్లా వెలుగుతున్నారు. మరొకరి అధికారాన్ని వారు భరించలేరు. స్వతంత్ర ప్రవృత్తి వారి నైజం. అందుకే ప్రభుత్వ ఉద్యోగాలు వదిలి వచ్చారు.



కేంద్రప్రభుత్వంలో మంత్రి పదవిని ఇస్తామంటే మాలవీయా తిరస్కరించాడు. ఏదో ఒక దేశానికి రాయబారిగా నియమిస్తామంటే కెప్టెన్ రాయ్ వద్దన్నాడు. ఆయిల్ అన్వేషణలో పెద్ద కాంట్రాక్టు ఇప్పిస్తామంటే చందన్‌లాల్ ఒప్పుకోలేదు. సుధ పేరుకు రిసెర్చి అసిస్టెంట్ గానీ ఆమె ఆలోచనలు ఆమెకున్నాయి.

సైనిక వ్యూహరచనలో అందెవేసిన



చెయ్యి రాయ్‌ది. అతని సలహా, సహకారాలు లేనిదే విద్యాసాగర్ పథకం అమలుజరగదు. అలాగే ప్రజలలో పలుకుబడివున్న మాలవీయా అండదండలు లేనిదే వారికి ప్రజాబలం అందిరాదు. డబ్బు కావాలంటే చందన్‌లాల్‌పై

ఆధారపడవలసిందే. ఇక సుధ. అన్ని రకాల వైజ్ఞానిక ఉపకరణాల మీద ఆమెకు కమాండ్ ఉంది. సిలికాన్ బాంబును ప్రయోగించాలంటే ఆమె చేయూత లేనిదే సాధ్యం కాదు.

ఇందరి సలహా, సహకారాలతో విద్యాసాగర్ భావి కార్యక్రమం ఆధారపడి ఉంది. వీరిలో ఏ ఒక్కరు ఎదురు తిరిగినా అతని శ్రమ వృధా!

అసలు వీరిలో ఎదురు తిరిగే ధైర్యం ఉందా? విద్యాసాగర్ పన్నిన విజ్ఞాన వ్యూహాన్ని వీరు ప్రతిఘటించగలరా? అంతటి శక్తి సామర్థ్యాలు వీరికున్నాయా?

"రేపు మనం ఏర్పరిచే 'నియో హ్యూమన్ కింగ్‌డమ్'లో సర్వాధికారాలు నాకే ఉండాలిగదా'' కెప్టెన్ రాయ్ అన్నాడు. సుధ, మాలవీయా ఆశ్చర్యంగా అతనివైపు చూశారు.

"ఉత్తర అట్లాంటిక్ కూటమి దేశాల్ని వార్సా సంధి దేశాల్ని, అలీన దేశాల మండలిని ఎలా విచ్ఛిన్నం చేయాలో నాకు తెలుసు. అమెరికా తాజాగా తయారుచేస్తున్న అణుక్షిపణుల్ని, రష్యా రూపొందిస్తున్న న్యూట్రాన్ బాంబుల్ని, క్షణంలో మట్టుపెట్టగల సైనిక వ్యూహాన్ని రచించగలను. నాకు ఆయా దేశాల సైనికాధిపతులతో రహస్య సంబంధాలున్నాయి. వారిని ఎటు తిప్పాలన్నా నావల్లే అవుతుంది" అన్నాడు కెప్టెన్ రాయ్.

అతని మాటలు విని మాలవీయా పకపక నవ్వాడు.

"పిచ్చివాడా! నువ్వు యుద్ధతంత్రం వేయగలవంతే! కాని రాజకీయతంత్రం పరిపాలనకు ముఖ్యం. ఆ తెలివితేటలు నాకున్నాయి. కనక ఆధిపత్యం నాకు కావాలి. పిచ్చిపిచ్చిగా పగటికలలు కన వద్దు. దేశాలలో కల్లోలం సృష్టించడాని కై సైన్యాధిపతులు కుట్రలు పన్నుతున్నారని ఆయా దేశాధినేతలకు రహస్యంగా వూదానంటే చాలు... నీ చెప్పుచేతల్లో ఉన్నారనుకొంటున్న సేనానాయకుల్ని పాలకులు కాల్చి చంపిస్తారు. పరిపాలన అంటే 'డిప్లమసీ' ఉండాలి. మెషీన్ గన్‌లా పేలడంగాదు" అన్నాడు మాలవీయా.

సుధ ఏమీ మాట్లాడలేదు. ఆమెకు తెలుసు- ఈ రాజకీయ లయవిన్యాసంలో అధికారపిపాసకు కొందరు నెత్తురు ధార పోయాలని, ఏ ఒక్కరో ఇద్దరో మాత్రమే ఆధిపత్యసాధనా పోరాటంలో చివరి వరకు నిలుస్తారని. అందుకే ఆమె ఏమీ అనలేదు.

రాయ్, మాలవీయాలు పరస్పరం అనుమానంగా చూసుకొన్నారు. వారిద్దిరిలో 'నియోహ్యూమన్ సొసైటి' రూపురేఖలే మెదులుతున్నాయి.

ఆ సొసైటీలో అంతా నిత్య యవ్వనులేవుంటారు. రోగాలు ఉండవు. జనాభా సమస్య ఉండదు. స్త్రీ, పురుషులు యథేచ్ఛగా అన్నీ అనుభవించినా వారికి పిల్లలు పుట్టరు. వారిలో లైంగికసామర్థ్యం ఉంటుంది గానీ పిండోత్పత్తికి అవసరమైన బీజకణాలుండవు. కృత్రిమ గర్భ నిరోధ సాధనాలు, మాత్రల అవసరం ఏమీ ఉండదు. సంతానం కావాలంటే సాధారణ జీవకణాలను తీసి లేబరేటరీలో పెంచవచ్చు. వారు జీవకణదాతలకు నకళ్ళుగా ఉంటారు. సంతానాన్ని కనడం, పెంచడం వంటి సమస్యలుండవు. రోగాలు ఉండవు. కనుక ఆ మానవులు కళల్ని విశేషంగా అభిమానిస్తారు. గోళాంతర

 

యాత్రలకు, పరిశోధనలకు ఎక్కువగా సమయాన్ని వెచ్చిస్తారు. ఒక రకంగా ఆ సమాజం దేవసమాజం అవుతుంది. మృత్యువు నిష్క్రమిస్తుంది.

మనిషి అవయవాలు ఏ కారణం చేతనైనా దెబ్బతింటే అటువంటి అవయవం నకలునే తయారుచేసి అతుకుతారు. అందుచేత అంగాల మార్పిడిలో ఎటువంటి వైఫల్యాలూ ఉండవు.

నవనవోన్మేషంగా, నిత్యానంద సంధాయకంగా ఉండే అటువంటి మహోత్కృష్ట మానవ సమాజానికి అధిపతికావడం దేవేంద్రపదవితోసమానం. కనక ఆ పదవిని కాంక్షించడం ఎవరికైనా సహజం అని సుధ భావిస్తోంది.

అటువంటి అపూర్వఅధికారపీఠం తను అధివసించాలంటే, తను అధిరోహించాలని రాయ్, మాలవీయాలలో ఆశ పడగ విప్పుతోంది.

జగన్నాథ్ వేసిన ఒక్క ప్రశ్న ఇంతటి భావసంఘర్షణకు దారి తీసింది.

* * *

శేఖర్‌ని, జగన్నాథ్‌ని వాళ్ళ గదిలో దింపి వెళ్ళిపోబోయాడు మరమనిషి.

"డాక్టర్ రామనాథన్" శేఖర్ పిలిచాడు. గుమ్మం దాటబోతున్న మరమనిషి ఆగిపోయి వెనక్కు తిరిగి, నాలుగు అడుగులు ముందుకు వచ్చాడు.

"యస్ సార్" అన్నాడు మంద్ర స్వరంతో.

"నువ్వు నిజంగా రామనాథన్‌వేనా?"

"నిస్సందేహంగా"

"నీ గతం అంతా జ్ఞాపకం ఉందా?"

"ఉంది"

"ఇప్పటికీ శారదపై ప్రేమ పోలేదా?"

"అది అచంచలమైన ప్రేమ. శారద నా ఆత్మ"

"ఆమె నీ భార్య అని, విద్యాసాగర్ నీకు బద్ధశత్రువని తెలుసా?"

"తెలుసు. కాని నాలో ఇప్పుడు ఎటువంటి కోరిక ఉత్పన్నంకాదు. ఇప్పుడు నాకు శరీరంలేదు. కేవలం మెదడుంది. అంతే! శరీరంద్వారా, నాడుల ద్వారా పొందే స్పర్శ సుఖంవంటివి నాకు గుర్తులేవు. నాలో కోరిక కలిగినా..యంత్రాన్ని కదా ఏం చేయగలను?"

"నిజమే! నీది దుర్భర జీవితం"

"కాదు...త్రిశంకు నరకం నా జీవితం. వస్తా...గుడ్‌నైట్" మరమనిషి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోతూ ఆ గదికి బయట తాళం వేసేశాడు.

"మనంచూసిందంతా నిజమా?కలా?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"కలా కాదు. కల్లా కాదు. నూటికి నూరుపాళ్ళు నిజం. విజ్ఞాన పరిశోధనలు మానవజాతికి అందించిన అద్భుతవరాలివి. అయితే విద్యాసాగర్‌వంటి స్వార్థపరులు వీటిని మానవాళి వినాశనానికి ఉపయోగించే ప్రయత్నం చేస్తున్నారు. ఇప్పుడు మనం ఏం చేయాలో ఆలోచించు" శేఖర్ అన్నాడు.

"ఆలోచించడానికి ఏమీలేదు. విద్యాసాగర్ వ్యూహంలో మనమూ భాగస్వాములం కావాలి. లేకపోతే త్రిశంకు నరకం అనుభవించాలి"

"అవును. నువ్వు ఈ నవ మానవ సామ్రాజ్యానికి అధినేత ఎవరు అని వాళ్ళని ప్రశ్నించావెందుకు ?" శేఖర్ అడిగాడు జగన్నాథ్ వృధాగా మాట వదలడని.

"ఆ ప్రశ్నతో వాళ్ళలో వాళ్ళు అధిపత్యానికై పోరాడుకొంటారు. ఒకరిపై

ఒకరు అనుమానాలు పెంచుకొంటారు. ఇన్నాళ్ళూ వాళ్ళకి విద్యాసాగర్ వ్యూహం గురించి సరిగా తెలీక అన్ని విధాలా సహకరిస్తూ వచ్చారు. అతను మనిషి మెదడును నియంత్రించే కర్కోటకుడని ఇప్పుడే వారికి అర్థమయింది. కనక ఇక తమ జాగ్రత్తలో తాముంటారు పరస్పరం కీచులాడుకొంటారు. అదిమనకు లాభం" జగన్నాథ్ తన ప్రశ్నసృష్టించే వివాదం విశ్వరూపాన్ని వివరించేసరికి శేఖర్ ఆశ్చర్యపోయాడు.

"అయితే ఈ విలయ కాండలో మనమూ భాగస్వాములంకాక తప్పదం టావా?" శేఖర్ ప్రశ్నించాడు.

"మరమనిషిలో మెదడుగా మారి పోయి బానిసత్వం చేయాలనిలేదు. విద్యాసాగర్ సృష్టించే విలయాన్ని సమర్థించా లనిలేదు. అందుకని ఆత్మహత్య చేసు కోవడం ఉత్తమం అనిపిస్తోంది."

"పెద్ద సి.ఐ. డివైపుండి నువ్వుచెప్పే సలహాయిదా !" శేఖర్ దెప్పిపొడిచాడు. జగన్నాథ్ ఏమీ మాట్లాడలేదు.

"ఆత్మహత్య చేసుకొన్నా ప్రయో జనంలేదు. విధ్యాసాగర్ మనమెదడుల్ని సేకరించి, వాటిని జీవింపజేసి హింసి స్తాడు. మనల్ని బానిసల్ని చేస్తాడు" శేఖర్ అన్నాడు.

"ఈ గదిలోంచి బయటపడి రెండు పిస్తోళ్ళు సంపాదించగలిగితే ఎంతపనైనా చేయవచ్చు" జగన్నాథ్ దీర్ఘంగా ఆలో చిస్తూ ఉపాయం తట్టినట్లు అన్నాడు.

"అదెలా?" ఆశ్చర్యంగా అడిగాడు శేఖర్.

"ఇక్కడ చాలామంది తమకిష్టంలేక పోయినా పని చేస్తున్నారు, నీ స్నేహితు రాలు మంజులముఖం చూశావుగా! ఆమెలా ఎందరో ఇక్కడఉన్నారు. మనం బయట పడితే వారందరినీ సమీకరించి తిరుగు బాటు చేయవచ్చు. దురదృష్ట వశాత్తూ మనం విఫలులం అయాంఅనుకో....వీర మరణం పొందుతాం. ఆసమయంలో మనం అప్రమత్తంగా వ్యవహరించి మన తలను మనమే పేల్చివేసుకొందాం అప్పుడు వాళ్ళకి తునాతునియలైన ఆమెదడు ఎం దుకు పనికిరాదు" జగన్నాథ్ తనపథకం వివరించాడు.

ఒక గూఢచారి పాదరసంలా ఎలా ఆలోచిస్తాడో శేఖర్‌కి అప్పుడర్థంఅయింది అతనిప్లాన్ శేఖర్‌కి నచ్చింది.

ఒక విపత్తునుంచి ప్రపంచాన్ని కాపాడడానికి తమ జీవితాలు బలిఅయి పోయినా ఫర్వాలేదు. విద్యాసాగర్‌ముఠా చేస్తున్న ఘాతుకాలు అంతంఅయితే అదే తమ జీవితానికి చరితార్థత అనిపించింది.

"మరి ఈ పథకం ఎప్పుడు అమలు చేద్దాం" శేఖర్ ప్రశ్నించాడు.

"రాత్రి! అయినా మనం బయటపడే మార్గం ఏదీ?" జగన్నాథ్ నిరాశగా అన్నాడు.

"ఇదిగో! నాదగ్గర స్టీలు వూచముక్క ఉంది" అని శేఖర్ జేబులోంచి దానిని తీసి జగన్నాథ్‌కి ఇచ్చాడు.

"ఇదెక్కడిది?"

"విద్యాసాగర్ రూమ్‌లోంచితెచ్చా. నువ్వు ఎలాంటి తాళాన్ని అయినా తెరవ గల సమర్థుడివి. ఉదయం ఈ తలుపు తెరవడానికి చిన్న మేకైనా లేదని బాధ పడ్డావుగా ఎందుకైనా ఉపయోగిస్తుందని దీన్ని సేకరించాం" శేఖర్ వివరించాడు.

"సెభాష్ ! మనం విజయంసాధించ గలం. రాత్రివరకు వేచిఉందాం" అని జగన్నాథ్ వాచీచూసుకొన్నాడు. సమ

యం రాత్రి పదిగంటలైనట్లు ముళ్ళుచూపి స్తున్నాయి.

"బాప్‌రే! అప్పుడే రాత్రి పదిగంట లైంది. అంటే ఇంతసేపు మనకు టైము ధ్యాసలేకుండా గడిచిపోయిందన్నమాట" అన్నాడతను.

"ఇంకెంత? రెండుగంటల్లో పన్నెండవు తుంది. మనకు విముక్తివస్తుంది. మనదేశా నికికూడా అర్థరాత్రేగా స్వాతంత్ర్యం వచ్చింది." శేఖర్ హుషారుగా అన్నాడు.

* * *

సెకన్లు నిమిషాలలో నిమిషాలు గంట లలో లయమైపోయాయి. కాలం వూహ లతో లయవిన్యాసం చేస్తోంది. కాలం, వూహ కలసిపోయినట్టు గడియారంలో నిమిషాలముల్లు గంటల ముల్లును కప్పి వేసింది. సెకండ్లముల్లుమాత్రం కాలాన్ని ముక్కలుచేస్తూ గిరగిర తిరుగుతోంది. మెదడుకణాలు మాత్రం ఆలోచనల్ని రసాయన అక్షరాలుగా ముద్రించుకొంటు న్నాయి.

ఆ సమయంలో జగన్నాథ్ నెమ్మదిగా తలుపుదగ్గరకు చేరాడు. తాళంపెట్టె రంధ్రం దగ్గర చెవిపెట్టాడు. బయట కాపలాదార్ల బూట్లచప్పుడేంలేదు.

అంటే వాళ్ళు నిద్రపోయారన్నమాట. మరి మరమనిషి? ఎక్స్-రే కళ్ళతో తమ కార్యకలాపాల్ని పసికట్టగలడు. అతని జాడ కూడా లేనట్లుంది. అదే సరయిన అదను. ఇంక జాగుచేయకూడదు.

జగన్నాథ్ తన చేతిలోని స్టీల్ వూచని తాళం కన్నంలోకి జొప్పించాడు. ఎలాంటి తాళాన్నయినా అతి లాఘవంగా, సునా యాసంగా తీయగల నైపుణ్యం జగన్నాథ్‌కి వృత్తిరీత్యా వచ్చింది. కాని ఆ వూచ బాగా సన్నం కావడంతో కొంచెం శ్రమ పడితేకాని తాళం వూడిరాలేదు. తాళం తీసేశాడు.

నెమ్మదిగా తలుపుతెరిచి బయటకు చూశాడు. గుమ్మానికి అటూ ఇటూ ఇద్దరు మనుషులు కాపలాగా ఉన్నారు. వారు ఇద్దరూ స్టూల్స్‌పై కూర్చుని కునికిపాట్లు పడుతున్నారు. జగన్నాథ్ శేఖర్‌కి సంజ్ఞ చేశాడు. ఇద్దరూ ఒకేసారి బయటకు వచ్చారు. జగన్నాథ్ అతి లాఘవంగా కరాటే దెబ్బలుకొట్టి ఆ ఇద్దర్నీ స్పృహ లేకుండా చేశాడు.

వారిద్దరినీ గదిలోకి లాగి, తలుపువేయ బోయి ఏదో ఆలోచించి మరల లోపలకు వచ్చారు. ఆ సెంట్రీల దుస్తులు విప్పేసి తాము ధరించారు. వారిదగ్గరవున్న పిస్తోళ్లు తీసుకున్నారు.

ఇద్దరూ విజయగర్వంతో ఒకరినొకరు చూసుకొని గదిబయటకు వచ్చి తలుపు వేసేశారు. వరండా పొడవునా దీపాలు పాలకాంతిని ప్రసరిస్తున్నాయి. ఎక్కడా ఎవ్వరూ తిరుగుతున్న అలికిడిలేదు.

"శేఖర్! ఇది మన జీవన్మరణసమస్య. ముందు మనం మరమనిషిని కలుసు కోవాలి. అతని ద్వారానే ఈ భవనం ఆయువుపట్టు తెలుసుకోవాలి. పద...మర మనిషి ఎక్కడ వున్నాడో తెలుసు కొందాం" జగన్నాథ్ ముందడుగు వేశాడు. శేఖర్ అనుసరించాడు.

ఉదయం వెళ్ళిన సొరంగమార్గంవేపు వారు అతి జాగ్రత్తగా నడవసాగారు. ఏ క్షణంలో ఎటువంటిప్రమాదం ఎదురయినా అతి సమర్థవంతంగా ఎదుర్కొనడానికి ఇద్దరూ సర్వసన్నద్ధంగావుండి, వేటకు బయలుదేరిన సింహాల్లా అడుగులువేస్తూ వెళుతున్నారు.

కొంత దూరంవెళ్ళేసరికి ఇద్దరు కాపలా

దాళ్లు పహరా ఇస్తుండటం కనిపించింది. వారటుతిరిగి క్రమబద్ధంగా అడుగులు వేస్తున్నారు. ఇటుతిరిగి, తమను పసిగట్టే లోగానే వారి పనిపట్టాలని జగన్నాథ్ నిశ్చయించాడు.

అనుకొన్నట్లుగానే ఆ కాపలాదాళ్లు ఒక చోట తక్కున ఆగి, సైనికులవలె వెనక్కి తిరిగారు. వారిదృష్టి శేఖర్, జగన్నాథ్‌లపై పడేలోగానే జగన్నాథ్ తపీమని కరాటే విద్య ప్రదర్శించి ఇద్దరిమీద బలంగా దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు వారి ముక్కుల నుంచి నెత్తురు కారి నేలకూలారు. ఆ శవాల్ని ఎక్కడా దాచడానికి అవకాశం లేదు. అది సొరంగమార్గం. అందుకని వాటిని అక్కడే వదిలివేసి ఇద్దరూ ముందుకు సాగారు.

* * *

కొన్ని అడుగులు వేసేసరికి వారికి కరకరమనే ధ్వని వినవచ్చింది. అటు దృష్టి సారించారు. అక్కడ సొరంగ మార్గంలో ఎడమవేపు గోడదగ్గర చిన్న ద్వారం తెరుచుకొంది. అది ఆటోమేటిక్ షట్టర్. అంటే ఆ ద్వారంలోపల ఏదో గది వుందన్నమాట. శేఖర్, జగన్నాథ్ మౌనంగా నిలబడిపోయారు.

వారూహించినట్లుగానే ఆ ద్వారంలో నుంచి మరమనిషి నడుస్తున్నాడు. అంటే అతని ఎక్స్-రేకళ్లు తమ ఉనికిని గుర్తించాయన్నమాట. అతను అణుధార్మిక కిరణాలు ప్రసరిస్తే తాము భస్మం అయిపోతారు. తమ ప్లాన్ వృధా. అతని నుంచి తప్పించుకొనే ఆస్కారంలేదు. ఇలా ఆలోచిస్తూ వారిద్దరూ వూపిరి బిగపట్టి చూస్తున్నారు.

మరమనిషి ఇదివరకటికంటే బరువుగా అడుగులు వేస్తున్నాడు. అతను ఇటువేపు రావడంలేదు. అటువేపు వెళ్తున్నాడు. అతని చేతులలో శారద వుంది. శేఖర్, జగన్నాథ్ విస్తుపోయారు. ఆమె స్పృహలో లేదు. మరమనిషి వీరిని చూడనేలేదు. తదేకంగా నడిచివెళుతున్నాడు.

శేఖర్, జగన్నాథ్ 'హమ్మయ్య' అనుకొని నిట్టూర్చారు. ఒకరినొకరు ప్రశ్నార్థకంగా చూసుకొన్నారు.

"శారదని బాస్ దగ్గరకు తీసుకువెళుతున్నాడు కాబోలు, మనం అనుసరిద్దాం. మన పని సులభంఅవుతుంది" జగన్నాథ్ అన్నాడు.

"కానిమరమనిషి మనల్ని పసికడ్తే?"

"మృత్యువు ఏ క్షణంలో అయినా మనల్ని కబళిస్తుందన్న నిశ్చయంతోనే మనం ముందుకు సాగాలి. పద" జగన్నాథ్ నడిచాడు.

శేఖర్ అనుసరించాడు.

మరమనిషి తదేకంగా నడిచి వెళ్తున్నాడు.

"ఒకవేళ మరమనిషి మనల్నిగుర్తిస్తే వెంటనే పిస్తోలు కాల్చి అతనిలోని యాంత్రిక వ్యవస్థల్ని భగ్నంచేయవచ్చు కదా!" శేఖర్ ప్రశ్నించాడు.

"అదేం లాభంలేదు. అతడి శరీర కవచాన్ని ఈ తుపాకిగుళ్ళేం చేయలేవు. పద" జగన్నాథ్ వేగం పెంచినడవసాగాడు.

అల్లంత దూరంలో మరమనిషి ఆగిపోయాడు. అతని ఎదురుగా రాయ్, మాలవీయా వస్తున్నారు. వారి ఆంతర్యం మరమనిషికి తెలిసినట్లుంది. వారు శారదను కాంక్షిస్తున్నారని అతను అనుకొన్నాడు కాబోలు. వెనుదిరగబోయాడు.

"రామనాథన్... ఆగు!" అని రాయ్ పిస్తోలు కాల్చబోయాడు అంతే! మరు క్షణంలో మరమనిషిలోనుంచి మృత్యు

కిరణాలు ప్రసరించాయి. అవి రాయ్‌ని, మాలపీయాను నిర్జీవంచేశాయి. మరమనిషి ముందుకుసాగాడు. అతని లోహ పాదాలు పడి మాలపీయా శరీరం, రాయ్ దేహం మాంసం ముద్దలా నలిగిపోయాయి.

"మరమనిషి లయవిన్యాసం ప్రారంభించాడు. పద" జగన్నాథ్ అన్నాడు.

ఇద్దరూ నడకసాగించారు. మరమనిషి వెనుకచూపులేకుండా, ముందుకు సాగిపోతున్నాడు.

* * *

మరమనిషి ఒకచోట ఆగాడు. కాలి వేలితో అక్కడి నేలమీదవున్న చిన్న బటన్ నొక్కాడు. కరకర చప్పుడుతో అక్కడి షట్టర్ తెరుచుకొంది.మరమనిషి లోపలకువెళ్ళిపోయాడు. షట్టర్ దడదడ తిరుగుతూ కిందకుపడింది.

శేఖర్, జగన్నాథ్‌అక్కడకు వచ్చారు. బటన్ నొక్కాడు జగన్నాథ్. షట్టర్ తెరుచుకొంది. ఇద్దరూ లోపలకు ప్రవేశించారు. షట్టర్ మూసుకొనిపోయింది.

అది పెద్ద గది. అక్కడ నాలుగు పక్కలవెండిరంగులోమెరుస్తున్న గోడలు, వెలుగు ప్రసరిస్తున్న దీపాలుతప్ప ఏంలేవు. మరమనిషి ఎటు వెళ్ళినట్లు? వారిద్దరూ నాలుగుపక్కల వెతికారు. ఒకచోట పీప్ హోల్ కనిపించింది.

జగన్నాథ్ దానిలోనుంచి చూశాడు. లోపల సన్నటి వరండావుంది. మరమనిషి ఆ వరండా చివరకు వెళ్ళిపోయాడు. ఆ లోపల విద్యాసాగర్ గది ఉండివుంటుంది. జగన్నాథ్ అక్కడి గోడల్ని తడిమి చూశాడు. కుడివైపు గోడకు వెండిరంగు లోనే ఒక బటన్‌వుంది. దానిని నొక్కాడు. అక్కడ తలుపు తెరుచుకొంది.

ఇద్దరూ ఆ వరండాలో ప్రవేశించారు. చకచక ముందుకుసాగారు. ఒకచోట చిన్న గది, దానివెనుక పెద్దగదివున్నాయి. మరమనిషి చిన్నగది దాటి పెద్ద గదిలో ప్రవేశించాడు. శేఖర్, జగన్నాథ్ చిన్న గదిలో నిలబడిపోయారు. ఆ రెండు గదులకుమధ్య తలుపు వుంది. తలుపునకు పైన పీప్‌హోల్ ఉంది.

* * *

లోపల దృశ్యం చాలావిచిత్రంగా వుంది అది పడకగది. ఎంతో విలువైన ఫర్నిచర్ అక్కడ అలంకరించి ఉంది. ఒకవైపు డబుల్‌కాట్ ఉంది. ఆ మంచంమీద శారద పడుకొనివుంది.విద్యాసాగర్ ఆమెపై వాలి ఆమె యవ్వనసోయగాల్ని కప్పివుంచిన బట్టలు విప్పే ప్రయత్నం చేస్తున్నాడు. అక్కడ డ్రస్సింగ్‌టేబుల్‌పై బ్రాందీ సీసా ఉంది. పక్కన గ్లాసులో సగం తాగిన బ్రాందీ వుంది. గదిలో రెండవ వైపున మరమనిషి మౌనంగా నిలబడి ఉన్నాడు.

బొమ్మకు వేసిన బట్టలు విప్పినట్లు విద్యాసాగర్ శారద వొంటిమీది చీర విప్పుతున్నాడు. నిద్రపోతున్న వీనస్‌లా, స్పృహలోలేని సౌందర్యరసాధి దేవతలా, చైతన్యం కోల్పోయిన చిద్విలాసంలావున్న శారద సోయగాలు అతని మనస్సులోని కోరికను విజృంభింపజేస్తున్నాయి. సంవత్సరాల తరబడి అణుచుకొనివున్న అతని కోరిక ఇప్పుడు పడగవిప్పుతోంది. శారదను అనుభవించాలనే విద్యాసాగర్ ఆశ ఆవిర్లు చిమ్ముతోంది.

"శారదా" అంటూ తాగిన నిషాలో ఉన్న విద్యాసాగర్ ఆమె శరీరాన్ని పిచ్చిగా ముద్దుపెట్టుకొన్నాడు.

అతనిలోని కోరిక అగ్నిజ్వాలలు రేపుతోంది.

ఇంతలో ఏదో జ్ఞాపకం వచ్చినట్లు హఠాత్తుగా తల పైకెత్తి మరమనిషి వైపు వెటకారంగా చూశాడు:

"హలో రామనాథన్! నువ్వు శారద



మొగుడివి. నీ ఎదురుగానే నీ భార్యను తనివితీరా అనుభవిస్తాను. నాకు దక్కవలసిన శారదని నువ్వు పెళ్ళిచేసుకొన్నందుకు ఇది నా ప్రతీకారం"

విద్యాసాగర్ నవ్వుతోంటే గాజుసీసాలు దొర్లుతున్నట్లుంది. అతని వికటాట్టహాసానికి శారదకు మెలకువ వచ్చింది. మెల్లగా కళ్ళు తెరిచింది. పరిస్థితిని అర్థంచేసుకొంది. తాను అర్ధనగ్నంగా ఉన్నాననే స్పృహ వచ్చేసరికి సిగ్గుగా చేతులు రెండూ గుండెలకు అడ్డం పెట్టుకొంది.

విద్యాసాగర్ తటాలున ఆమె వైపు తిరిగాడు. శారద సిగ్గుతో కుంచించుకొని పోతోంది.

"హలో డార్లింగ్! నువ్వు కోలుకొన్నావన్నమాట ... వెరీగుడ్" అని విద్యాసాగర్ ఆమె మీదకు రాబోయాడు. ఆమె శరీరంపై మిగిలిన బట్టలు కూడా వూడదీయాలని అతని ప్రయత్నం.

"నన్ను ముట్టుకోకు" ఆమె వెనక్కు-

జరిగింది. అయినా విద్యాసాగర్ పట్టు విడవలేదు. ఆమెను మంచం మీద నొక్కి మీద పడబోయాడు.

"నన్ను విడిచి పెట్టు... నన్ను విడిచి పెట్టు" ఆమె అసహాయంగా అరుస్తోంది. లక్ష్యపెట్టని విద్యాసాగర్ శారద మీదకు వాలాడు. మరమనిషి ఇదంతా చూస్తున్నాడని అతనికి తెలుసు. చూడాలనే అతని కోరిక.

గదిబయటనుంచి ఈ ఘాతుకాన్ని చూస్తున్న శేఖర్, జగన్నాథ్‌లకు కోపం వచ్చింది. ఒక స్త్రీని కాపాడటం తమవంతు అని భావించారు. తలుపు హేండిల్ తిప్పి తెరిచారు. లోపలకు అడుగువేయబోయి లోపలి భయంకర దృశ్యంచూసి అక్కడే నిలబడిపోయారు.

* * *

శారద శరీరంపైవాలి, మానభంగం చేయాలని ప్రయత్నిస్తున్న విద్యాసాగర్ మెడను మరమనిషి ఉక్కుచేయి పట్టుకొంది. బలంగా పైకి ఎత్తి తనవైపు తిప్పుకొంది. తరువాత వెనక్కు తిరిగింది.

శారద గబగబ లేచి బట్టలు కట్టుకొని భయంగా చూడసాగింది.

మరమనిషి ఉక్కు హస్తాలు విద్యాసాగర్ పీకను పిసికివేశాయి. అతను మెడ వేలాడవేశాడు. ప్రపంచాన్ని సిలికాన్ బాంబుతో నాశనంచేయాలనుకొన్న ఒక పైశాచిక విజ్ఞానవేత్త తాను సృష్టించిన మరమనిషి చేతుల్లో దారుణంగా హత్య చేయబడ్డాడు.

శారదను కామంతోచూసిన విద్యాసాగర్ కళ్ళు నెత్తుటి పల్లేరులయాయి. ఈ ప్రపంచాన్ని తనకు బానిసగా చేసుకోవాలనుకొన్న అతని మెదడు ముక్కముక్కలయింది. మేధావుల్ని చంపి, వారి మెదడుల్ని బంధించిన అతని చేతులు ఇప్పుడు నిర్జీవంగా వేలాడుతున్నాయి.

మరమనిషి విద్యాసాగర్‌ని కసితీరా ఉక్కుగోళ్ళతోచీల్చి వికటంగా నవ్వాడు.

ఆ భయంకర దృశ్యం చూసిన శారద కెవ్వున అరిచి మంచంమీదపడి స్పృహ కోల్పోయింది. మరమనిషి ఆమెవైపు జాలిగా చూశాడు. ఇదంతా గుమ్మందగ్గరే నిలబడి చూస్తున్న శేఖర్, జగన్నాథ్ స్థాణువులై ఉండిపోయారు.

"మీరు లోపలకు రావచ్చు" మరమనిషి సౌమ్యంగాఅన్నాడు. హిరణ్యకశిపుణ్ణి చంపిన నరసింహస్వామి, ప్రహ్లాదునివైపు కృపా దృష్టితో చూసినట్లుంది మరమనిషి కంఠం.

వారిద్దరూ నెమ్మదిగాలోపలకువచ్చారు. వారిలో ఆశ్చర్యం విప్పారింది. మరమనిషిని వింతగా చూస్తున్నారు.

"నీలో ఇచ్ఛాశక్తి విజృంభించిందా?" శేఖర్ ప్రశ్నించాడు.

మరమనిషి తల పంకించాడు.

"అవును. ఇంతకాలం చేతనామాత్ర జీవిగావున్న నాలో క్రియాశక్తితోబాటు ఇచ్ఛాశక్తి మేల్కొంది. బానిస భావాలు అంతరించాయి. స్వతంత్ర ఆలోచన వచ్చింది. ఇప్పుడు నా మెదడు నా అధీనంలో ఉంది" మరమనిషి అన్నాడు.

"ఇదెలా సాధ్యం? నీ మెదడులోని థెలామస్‌లో తీగ బిగించినట్లు విద్యాసాగర్ చెప్పాడు. ఇప్పుడా తీగయేమైంది? నీకు ఈ స్పృహ ఎలా కలిగింది? ఎప్పుడు కలిగింది?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"ఇదంతా ఎలా జరిగిందో నేనూ చెప్పలేను. ఆ సూది అమరికలో లోపం ఏదైనా జరిగి ఉండాలి. లేదా శారద మీద నాకున్న ప్రేమ బలీయమైనది

కనుక ఆమెకు అపకారం జరగరాదన్న భావన విజృంభించి పోజిట్రానిక్ శక్తిని తలదన్ని ఉండాలి. ఏమైనా కానివ్వండి... ఇప్పుడు నా మెదడు సంకల్ప వికల్పాలు నా చేతిలో ఉన్నాయి. నా గతం, నా ఆలోచనలు, నా పరిశోధనాంశాలు అన్నీ నాకు యధాతథంగా జ్ఞాపకం ఉన్నాయి. నన్నిలా హింసించిన విద్యాసాగర్‌ని చంపాలనుకొన్నాను....చంపేశాను"

"ఈ కోరిక ఎప్పుడు జన్మించింది?"

"కొన్ని క్షణాలక్రితం. శారద శీలాన్ని ఈ దుర్మార్గుడు హరించబోతున్న తరుణంలో నా మెదడులో ఏదో సంచలనం కానవచ్చింది. అది సెకనులో వెయ్యవవంతు కాలం అయి ఉంటుంది. మరునిమిషంలో నా కర్తవ్యం గుర్తుకువచ్చింది"

"ఇది ప్రేమభావనా చమత్కారం. అంతేకాదు–మెదడు చేసే అపూర్వ లయ విన్యాసానికిది తార్కాణం. సాంకేతిక సాధనాల క్రియాశక్తికన్న సజీవ మేధస్సులోని ఇచ్ఛాశక్తి బలం అయినదని రుజువైంది"

"శారదపై నీ ప్రేమ బలమైనది. ఆమె నిస్సహాయంగా వేసిన కేక నీ మెదడులోని పోజిట్రానిక్ తరంగశక్తిని కల్లోల పరిచింది. థెలామస్‌లో గుచ్చిన సన్నటి సూది కల్లోలంలో చెదిరి స్థానం తప్పింది. నీలో ఇచ్ఛాశక్తి, సంకల్పశక్తి తిరిగి జీవించాయి. మేం ఇక్కడ ఉన్నట్లు నీకెలా తెలిసింది?" శేఖర్ ప్రశ్నించాడు.

"నా శక్తి అంతా విద్యాసాగర్ వైపే కేంద్రీకరించాను. తర్వాత పరిసరాల్ని అంచనా వేసుకోవడం నా విధి అని భావించాను. మరుక్షణంలో నా ఎక్స్‌రే కళ్ళు మీ ఉనికిని పసికట్టాయి. నా ఆలోచన, వివేచనా శక్తులు వచ్చాయి. కనుక ఇప్పుడు ఎవరు శత్రువులో, ఎవరు మిత్రులో గ్రహించగలను. మీరు విద్యాసాగర్ వ్యూహాన్ని వ్యతిరేకిస్తున్నారని గ్రహించాను. అందుకే మీరు నాకు మిత్రులు" అని మరమనిషి షేక్‌హాండ్ ఇవ్వాలని చేయిచాపాడు. వారిద్దరూ సందేహించారు.

"నేను డాక్టర్ రామనాథన్‌ని. విజ్ఞానం మనిషి శ్రేయస్సుకు ఉపకరించాలని ఆశించినవాణ్ణి. నను నమ్మండి. మిమ్మల్ని ఏమీ చేయను" మరమనిషి కంఠస్వరం సౌమ్యంగా, స్నేహశీలంగా ఉంది.

అప్పుడు వారిద్దరూ అతనికి స్నేహపురస్సరంగా షేక్‌హాండిచ్చారు.

"రాయ్‌ని, మాలవీయాని మాడ్చి చంపేశావేం?" శేఖర్ ప్రశ్నించాడు.

"విద్యాసాగర్ ఆధిపత్యాన్ని అంతం చేయాలని వారాశించారు. నువ్వు 'మీలో ఎవరు అధిపతి?' అని వేసినప్రశ్న వారిలో సంచలనం కలిగించింది. నా సహకారంతో విద్యాసాగర్‌ని చంపాలని, అధికారంతో బాటు, శారదను పంచుకోవాలనివారు ప్లాన్ వేశారు. అప్పటికి విద్యాసాగర్ అధీనంలో ఉన్న నామెదడు వారినిఅంతంచేసేసింది" రామనాథన్ మెదడులోని ఆలోచనలు ఇప్పుడు మరమనిషి ముఖతః వెలువడుతున్నాయి. అప్పటికే సమయం మించిపోతోందని శేఖర్, జగన్నాథ్ గ్రహించారు.

"మేం బయటకు ఎలా వెళ్ళగలం?" వారు ప్రశ్నించారు.

"హెలికాప్టర్ నడపడం మీలో ఎవరికయినా వచ్చా?" మరమనిషి ప్రశ్నిం

చాడు.

"నాకు వచ్చు" జగన్నాథ్ అన్నాడు.

"అయితే నేను మీకు ఒక హెలికాప్టర్ చూపిస్తాను. దానిలో శారదని, సుధను తీసుకొని మీరు వెళ్ళిపోండి" మరమనిషి అన్నాడు.

''సుధనా?" జగన్నాథ్ ఆశ్చర్యంగా అన్నాడు.

"విద్యాసాగర్ మాటల్ని నమ్మిన సుధ తానెంత మోసపోయిందీ గ్రహించింది. నేను ఆమె మెదడులోని థెలామస్‌లో ఇమిడ్చిన సూదిని కరిగించివేయగలను. అప్పుడు ఆమె మామూలు మనిషి అవుతుంది. అలాగే శారద ఇంకా వయస్సులోవున్నది. నెమ్మదిమీద ఆమెను వివాహానికి ఒప్పించండి. పదండి" అని మరమనిషి శారదను తన రెండు చేతుల మీద ఎత్తుకొని నడవసాగాడు. వాళ్ళు ఇద్దరూ అనుసరించారు.

"ఇక్కడివారు మనల్ని ఎదిరిస్తే?" జగన్నాథ్ ప్రశ్నించాడు.

"వారెవ్వరూ నాముందు నిలువలేరు. నాలోని రేడియో థార్మిక కిరణాలు వారందరినీ నాశనంచేస్తాయి. అంతేకాదు — ఇక్కడవున్న నమూనా సిలికాన్ బాంబుని నేనే పేల్చివేస్తాను. దీనితో వీరందరి ఆట కడుతుంది" మరమనిషి వేగంగా అడుగులువేస్తూ తన పథకం వివరించాడు.

ఆ కేంద్రంలోని ప్రతిభాగం, ప్రతి మలుపు బాగా తెలిసిన మరమనిషి చకచక నడిచిపోతున్నాడు.

* * *

"అదే సుధ ఉండే గది" అని చెప్పి మరమనిషి అక్కడ ఆగి తలుపు తట్టమని సంజ్ఞచేశాడు. శేఖర్ తలుపుతట్టాడు. సుధ ఆవులిస్తూ లేచివచ్చి తలుపు తెరిచింది. ఎదురుగా మరమనిషి, అతని చేతుల్లో నిద్రిస్తున్నట్లున్న శారద! సుధ ఆశ్చర్యంగా చూసింది.

మరమనిషి ఆమె తలపైపు నిశితంగా చూశాడు. ఏదో అనబోయిన సుధ అలాగే నిలబడి, రాతిబొమ్మలా అయిపోయింది. తృటికాలం ఆమెలో ఏదో సంచలనం కానవచ్చింది. మరు సెకనులో ఆమె మామూలుగా అయింది.

"ఏడీ...ఆ సాగర్? వాణ్ణి అంతం చేస్తాను" అని ఆమె అరిచింది. మరమనిషి చూపులోని ఎక్స్‌కిరణాలు ఆమె మెదడులోని థెలామస్‌కు గుచ్చిన అతి సూక్ష్మమైన సూదిని కరిగించివేశాయి. దానితో ఆమె మామూలుమనిషి అయింది. సాగర్‌పై ప్రతీకారంతో బుసకొట్టింది.

అప్పుడు శేఖర్, జగన్నాథ్ ఆమె ఎదురుగావచ్చారు. వారిద్దరికీ ఆమె గౌరవ సూచకంగా నమస్కరించింది. ఆమెకు వారు సంగతి అంతా చెప్పారు.

అందరూ కలిసి సొరంగమార్గం దాటి ద్వీపంమీదకు వచ్చారు. అక్కడ రెండు కొండలమధ్య హెలికాప్టర్ ఉంది. మరమనిషి శారదను అక్కడ పడుకోబెట్టాడు. అతనిలో అనిర్వచనీయమైన తృప్తియేదో కనిపిస్తోంది. ఒక మంచిపని చేయగలిగానన్న తృప్తి అది.

"మీరంతా ఈ హెలికాప్టర్‌లో వెళ్ళిపోండి" మరమనిషి అన్నాడు.

"మరి నీ సంగతేమిటి రామనాథన్?" శేఖర్ భావోద్వేగంతో అన్నాడు.

"మీరూ మాతో రావాలి" సుధ అభ్యర్థించింది.

"మానవసమాజంమధ్యకునేను రావడం వృథా. నేను మనిషినికాను. కేవలం మెదడుని...యంత్రంలో బంధించబడిన

మెదడును. జీవకళతో ఉట్టిపడే ప్రపంచం లోకి వచ్చి ఒక వింతవస్తువుగా నేను ఉండలేను. నాలో ఇప్పుడు ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి వచ్చాయి. కనుక రాగద్వేషాలు నన్ను వేధిస్తాయి. కోరికలు నన్ను వెంటాడుతాయి. కాని ఈ యాంత్రిక దేహంతో నేను వాటిని అనుభవించలేను. అలా అని కోరుకోకుండా ఉండలేను. ఈ ద్వీపంతోబాటే నా ఈ యాంత్రిక అవతారంఅంతంకావాలి. శారదనుమాత్రం మీతో తీసుకు వెళ్ళండి. ఆమె జీవితం హాయిగా గడవాలి. అంతే నా ఆఖరి కోరిక" రామనాథన్ గద్గద స్వరంతో ఈ మాటలు అన్నాడు.

"నో!" శారద అరిచింది. అంతకు ముందే ఆమె స్పృహలోనికి వచ్చి వారి మాటలు వింది. అందరూ ఆమెవైపు ఆశ్చర్యంగా చూశారు. శారద లేచి వారి వైపు వచ్చింది.

''శారూ!" మరమనిషిలోని రామనాథన్ మెదడు లాలనగా పిలిచింది.

"నేనంతా విన్నాను. మీరంటే నాకెంతో ప్రేమ. మీరు పోయాక ఈ ప్రపంచం అంటేనే విరక్తి కలిగింది. ఇప్పుడు మీతోనే నేనూనూ" ఆమె మరమనిషి దగ్గరగా వచ్చి తలను అతడి గుండె ఫలకం మీద ఆన్చి అంది. ఆమె కనుల వెంట ధారాపాతంగా నీరుకారుతోంది.

మరమనిషి ఆమెను సముదాయిస్తున్నట్లు తలనిమిరాడు. భుజాలుతడిమాడు.

"శారూ! నువ్వుమనిషివి. నేను మరను" రామనాథన్ మెదడు అంటోంది.

"నాకన్నీ తెలుసు. నేను ఈ ద్వీపం లోనే మీ మెదడుతోబాటే కన్నుమూస్తాను. ఇదే నా ఆఖరి నిర్ణయం" శారద మరమనిషిని కౌగలించుకొన్నంత పనిచేసింది.

"ఆల్ రైట్! డియర్ ఫ్రెండ్స్! మీరు బయలుదేరండి" రామనాథన్ మెదడు ఆజ్ఞాపించింది.

జగన్నాథ్ పైలెట్ స్థానంలో కూర్చున్నాడు. సుధ ఎక్కింది. తర్వాత శేఖర్ హెలికాప్టర్ ఎక్కడం, శారద వింత తృప్తితో, కళ్ళనీళ్ళతోనే చేయి వూపింది.

''డియర్ ఫ్రెండ్స్! నేనుశాస్త్రవేత్తనని మరిచిపోకండి. శాంతి, సౌభాగ్యాలతో మానవజాతి కలకాలం వర్ధిల్లాలన్నదే నా ఆశ'' అని మరమనిషి శారదను తన బాహువులమీదకు ఎత్తుకొని సొరంగం లోకి వెళ్ళిపోయాడు.

హెలికాప్టర్ ఆకాశంలోకి లేచింది. కొంతదూరం వెళ్ళేసరికి వారికి పెద్ద పేలుడు ధ్వని వినిపించింది. సెకను సేపు బ్రహ్మాండమైన కాంతి కనిపించింది. మరు క్షణంలో ఆకాశంఅంతా నీటికణాలతో ధూళి మేఘం ఆవరించింది. ఆ మృత్యు ధూళి మధ్య తటిల్లతలవలె శారద, మర మనుషుల రూపాలు అమృతమూర్తులవలె కనిపించాయి.

ఒక ద్వీపం సముద్రంలో మునిగిపోయిన ప్రళయకేళిఅది. మనిషి మెదడున్ను గుప్పిట బంధించి భూగోళాన్ని విలయ కీలలలో ముంచివేద్దామనుకొన్న భయంకర లయవిన్యాసానికి భరతవాక్యం అది. ఆ మహా సముద్రంలో ద్వీపం ఉండవలసిన చోట ఇప్పుడంతా అపార జలరాశి. అవిశ్రాంత తరంగకేళి.



["రొబొటిక్స్" సృష్టికర్త 'అసిమోవ్'కి అంకితం ఈ 'లయ']



# రంగుల ఫోటోగ్రఫీ

మనదేశంలో కొద్ది సంవత్సరాల క్రితం రంగుల ఫోటోగ్రఫీ సంపన్నవర్గానికే అందుబాటులోవుండేది. నూటికి ఏ ఒక్కరో ఇద్దరో పెళ్ళిళ్ళకి రంగుల ఫోటోలు తీయించుకునేవారు. ఫోటోలు తీశాక వాటిని డెవలప్‌చేసేందుకూ, ప్రింట్లు వేసేందుకూ కనీసం ఓ నెల పట్టేది. బొంబాయిలోని 'కోడక్' కంపెనీ మాత్రమే రంగుల ఫోటోల ముద్రణను ఎక్కువగా చేపట్టేది. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి ఫోటోలు తీసిన రీల్సు సరాసరి ఆ కంపెనీకి విరివిగా వస్తుండేవి. కొందరు భారతీయులు తమకున్న అవకాశాల్నిబట్టి విదేశాలకు రోల్స్ పంపి ఫోటోలు వేయించుకోవడం కూడా జరిగేది. మద్రాస్, కలకత్తాలాంటిచోట్ల కొన్ని ప్రైవేట్ ఫోటోస్టుడియోలు కలర్‌వర్క్ చేస్తున్నా వాటికి అంతగా గిరాకీ ఉండేదికాదు.

ప్రస్తుతం పరిస్థితులు అందుకు విరుద్ధంగా మారాయి. మనుషులకి సహజంగా రంగులపట్ల వుండే ఆకర్షణకి తోడు, ఆ రంగంలోని పోటీవల్ల ఖర్చు కూడా తగ్గటంతో ఇప్పుడు నలుపు తెలుపుల ఫోటోగ్రఫీ స్థానాన్ని కలర్ ఫోటోగ్రఫీ ఆక్రమించుకుని, గొప్ప జనాకర్షణ పొందింది.

ఇదివరకు వివాహం లాంటి అరుదైన, గుర్తుంచుకోదగిన సందర్భాలలోనే కలర్ ఫోటోలు తీసేవారు. కాని, ఇప్పుడు ఔత్సాహిక ఫోటోగ్రాఫర్లు సైతం కలర్ ఫోటోలు తీసేందుకే ఎక్కువ ఉబలాట పడుతున్నారు. అందుకు తగినట్లే ఇదివరకటిలా ఫోటోల ప్రింటింగ్‌కి ఎవరూ ఎక్కువ సమయం తీసుకోవడం లేదు. కలర్ లేబ్స్‌లో ఉదయం 'రోల్' ఇస్తే సాయంత్రానికల్లా ఫోటోలు చేతికొచ్చేస్తున్నాయి.

నేడు కలర్ లేబ్, స్టూడియోల మధ్య ఏర్పడిన తీవ్రమైన పోటీవల్ల పోస్ట్‌కార్డు సైజు రంగుల ఫోటో ప్రింటింగ్ ఖర్చు 15 రూపాయల నుంచి 3 రూపాయలకి తగ్గిపోయింది. 1983 మధ్యలో ఢిల్లీలోనూ, ఇతర పెద్దనగరాలలోనూ కలర్ ఫోటోలేబ్‌లు కుక్కగొడుగుల్లా వెలిశాయి. దాని ఫలితంగా కలర్ ప్రింటుల ధర ఇలా పడిపోయింది.

'భారతదేశంలో కలర్ ఫోటోగ్రఫీ ఇంతగా ఎలా అభివృద్ధిచెందింది?' అని ఈ సందర్భంలో ఎవరైనా ఆశ్చర్య పడతారు. 1978లో భారత ప్రభుత్వం కలర్ ఫోటోగ్రఫీ పరికరాల దిగుమతిపై అంతదాకా వున్న నిబంధనలను సడలించింది. ఆ పరికరాలను దిగుమతి చేసుకునేందుకు ఢిల్లీలోని 'కలర్‌క్రాఫ్ట్', 'మిధాస్' సంస్థలకి మూడు లైసెన్సులు లభించాయి. 'కలర్‌క్రాఫ్ట్' గత 30ఏళ్లపై

నుంచీ కలర్ ఫొటోగ్రఫీలో తక్కిన సంస్థలకు మార్గదర్శకంగా వుంటోంది. 'మిథాస్' దాని అనుబంధ సంస్థ. అయితే ఇప్పుడా రెండూ దేనికవే స్వతంత్రంగా వ్యవహరిస్తున్నాయి.

1982 చివరికి కలర్ ఫొటోగ్రఫీ రంగంలోమిథాస్ సంస్థదేపైచేయిగా ఉంది. కాని, అనతికాలంలోనే ఢిల్లీలోని చాలా సంస్థలు పెద్దయెత్తున కలర్ ఫొటోగ్రఫీ పరికరాలను దిగుమతి చేసుకోవడం ప్రారంభమైంది.

1982లో మిథాస్‌లో పోస్ట్‌కార్డ్ కలర్ ప్రింటుకి 7 రూపాయలు ఛార్జి చేసేవారు. 1982 డిసెంబర్ 31 నాటికి ఆ ధరను 5కి తగ్గించారు. ఇతరులు 1983 సెప్టెంబర్ 1 నుంచీ 4 రూపాయలకీ, 1984 సెప్టెంబర్ 6 నుంచీ మూడున్నరకీ పోస్ట్ కార్డు సైజులో కలర్ ప్రింటు వేసివ్వసాగారు. మొదట్లో రోజుకి 30 వేల ప్రింట్లువేసే మిథాస్ సంస్థ నేడు 60 వేల ప్రింట్లు వేస్తోంది.

కలర్ ప్రింటింగ్‌లో 3 రకాల పద్ధతులను అనుసరిస్తున్నారు. మొదటి పద్ధతిలో ప్రింట్లువేయడంలో మానవ పాత్ర హెచ్చుగా వుంటుంది. రెండవది సెమీ ఆటోమేటిక్ పద్ధతి. దీనిలో ఫిల్మ్ కడగటం, ఫొటోల ప్రింటింగ్ విడివిడిగా చేయబడుతుంది. పూర్తి కంప్యూటరైజ్‌డ్ ఆటోమేటిక్ యంత్రం ద్వారా ప్రింట్లు వేయడం మూడో పద్ధతి. ఇందులో ఫిల్మ్ కడగటం, ప్రింటింగ్, ఫొటోలనుసమంగాకత్తిరించడం మొదలైనవన్నీ మేలైన విదేశీ యంత్రం ద్వారా జరిగిపోతాయి.

పూర్తి ఆటోమేటిక్ కంప్యూటరైజ్‌డ్ కలర్ ప్రింటింగ్ యంత్రం ఖరీదు దాదాపు 20 లక్షల రూపాయలుంటుంది. దాని స్థాపన, ఇతర ఖర్చులకి మరో 15, 20 లక్షలవుతుంది. వాస్తవానికి ఫొటోగ్రఫీ రంగంలో ఇంత పెట్టుబడి చాలా ఎక్కువే అనుకోవాలి. కాని వ్యాపారం, లాభాలు కూడా అదే స్థాయిలో వుంటాయి.

ఇటీవల జపానీయులు ప్రవేశపెట్టిన 'క్విక్ సర్వీస్ పద్ధతి' భారతీయ కలర్ లేబ్‌ల దృష్టిని ఆకట్టుకుంది. ఈ పద్ధతిలో పూర్తి ఆటోమేటిక్ కంప్యూటరైజ్‌డ్ యంత్రాన్ని వుపయోగిస్తారు. అది 1 గంటలో 16వందల ప్రింట్లు వేస్తుంది. ఆ యంత్రంలో 110, 120, 35 ఎమ్.ఎమ్. సైజుల్లోని రోల్స్ ప్రింట్లు వేసుకోవచ్చు. ఆ యంత్రంలో అత్యధిక సైజు ప్రింటు 8 × 10 అంగుళాలు వుంటుంది.

మనుషులే ప్రింట్లు వేసే పద్ధతిలో కావల్సిన ప్రింటింగ్ పరికరాల విలువ 30 వేల రూపాయలే. అయితే ఈ పద్ధతిలో ప్రింట్లు వేసేందుకు ఎక్కువ సమయం తీసుకుంటుంది. సెమీ ఆటోమేటిక్ యంత్రాన్ని 10 లక్షల రూపాయల ఖర్చుతో నెలకొల్పవచ్చు.

మన దేశంలో ఉపయోగిస్తున్న యంత్రాలు చాలామటుకూ జపాన్, ఇంగ్లండ్‌ల నుంచి దిగుమతి చేసుకున్నవే. వాటిపై మన ప్రభుత్వం 65 నుంచి 130 శాతంవరకూ దిగుమతి సుంకంవిధిస్తోంది. కలర్ ప్రింటింగ్ కాగితం, కెమికల్స్ ఫిల్ములపై ఆ సుంకం 200, 135, 160 శాతం వుంటోంది.

మనకు చాలాకాలంగా 'కోడక్'కంపెనీ నుంచి కెమికల్స్ సరఫరా అవుతున్నాయి. కాని, వాటి ఖరీదు మరీ ఎక్కువ. ప్రస్తుతం భారతదేశంలోని ఫొటో లేబ్‌లు పశ్చిమ జర్మనీ, జపాన్‌ల నుంచి కెమికల్స్‌ను దిగుమతి చేసుకుంటున్నాయి. పశ్చిమ



జర్మనీ కంపెనీలు సరఫరాచేసే కెమికల్స్ ఖరీదు కోడక్ కెమికల్స్ ఖరీదులో సగం మాత్రమే.

ప్రస్తుతం ఢిల్లీలో 2 డజన్లదాకా కలర్ లేబ్‌లు వున్నాయి. వాటిలో డజను వరకూ పూర్తి ఆటోమేటిక్ లేదా సెమీఆటోమేటిక్ లేబ్‌లే. మిగిలిన డజను లేబ్‌లూ ప్రింట్లు వేసేందుకు మనుషులపై ఆధారపడేవి. భారతదేశంలో కలర్ లేబ్‌లు అత్యధికంగా గల నగరాల్లో మొదటిది బొంబాయికాగా, ఢిల్లీ రెండవది.

నేడు ఢిల్లీలోని లేబ్‌లు పోస్ట్‌కార్డ్ సైజు కలర్ ప్రింటుకి 3,4 రూపాయలు, ప్రాసెసింగ్‌కి 4 రూపాయలు తీసుకుంటుండగా, బొంబాయిలో ప్రాసెసింగ్‌కి 12 రూపాయలు వసూలు చేస్తున్నారు.

నలుపు తెలుపుల ఫొటోగ్రఫీపై కలర్ ఫొటోగ్రఫీ ప్రభావం తీవ్రంగా పడింది. అయితే ఇక్కడ గమనించాల్సిన విషయం ఒకటుంది. నలుపు తెలుపు ఫొటోలను భద్రపరచుకుంటే జీవిత పర్యంతం పాడవకుండావుంటాయి. కాని, రంగుల ఫొటోల్లో అయిదేళ్ళ తర్వాత రంగులు వెలిసిపోవడం ప్రారంభం అవుతుంది. అయినా ఖర్చు తగ్గిపోవడంతో రంగుల ఫొటోగ్రఫీకి జనాదరణ ఎక్కువగానే వుంటోంది.

ఢిల్లీలోని మిధాస్ కంపెనీకి భారతదేశమంతటా 125 బుకింగ్ కేంద్రాలు వున్నాయి. అవి 'ఫిల్మ్ రోల్సు' సేకరించి విమానం ద్వారా ఢిల్లీకి పంపుతాయి. అక్కడ వేయబడిన ప్రింట్లను బుకింగ్ కేంద్రాలు 4 రోజుల్లో కస్టమర్లకి అందిస్తాయి. ఢిల్లీ నగరంలోనే ఇచ్చిన ప్రింట్లను మిధాస్ కంపెనీ సాయంత్రాని కల్లా తిరిగి ఇచ్చేస్తుంది.

మిధాస్ కంపెనీకి 6 పూర్తి ఆటోమేటిక్ కంప్యూటర్లు, 8 సెమీ ఆటోమేటిక్ కలర్ ప్రింటింగ్ యంత్రాలు వున్నాయి. వారు డీలర్‌ని నియమించడానికి ముందు 10 వేల రూపాయలు ధరావతు కట్టించుకుంటారు. వాళ్లు వేసే పోస్ట్‌కార్డ్ సైజు ప్రింటుకి డీలర్‌కి 75 పైసల కమీషన్ ఇస్తారు. అంతేకాక డీలర్‌కి అయ్యే ప్రకటన ఖర్చుల్లో సగం మిధాస్ కంపెనీ భరిస్తుంది. ఇతర పట్టణాల నుంచి విమానం ద్వారా వచ్చి వెళ్లే ఫిల్మ్ రోల్సు, ప్రింట్ల రవాణా ఖర్చును కూడా మిధాస్ కంపెనీయే భరిస్తుంది.

"కలర్ ఫొటోగ్రఫీని భారతదేశంలో మొదలుపెట్టి, నిలబెట్టింది మేమే. ఫొటో ప్రింటింగ్ నాణ్యతలో ఎవరూ మాకు పోటీ కాలేరు. పోస్ట్‌కార్డ్ సైజు ప్రింటుకి నాలుగు రూపాయలు వసూలు చేస్తున్నా, అందరికంటే మాకొచ్చే కస్టమర్లు ఎక్కువ" అంటారు ఈ సంస్థవారు.

కలర్ ఫొటోగ్రఫీ రంగంలో విపరీతంగా కలర్ లేబ్‌లు పుట్టుకురావడం, ఫొటోగ్రఫీ వృత్తిలో వున్నవారికి పొట్ట మీద కొట్టినట్టయింది. మొదట్లో ఒక రంగుల ఫొటోతీసి పోస్టుకార్డు ప్రింటు చేసి ఇస్తే ఫొటోగ్రాఫర్లకి 15 రూపాయలు గిట్టేది. కాని, ఇపుడు కస్టమర్స్ తెలివి మీరిపోయి కేవలం ఇంత అని ఇచ్చి ఫొటోగ్రాఫర్స్ చేత ఫొటోలు తీయించుకుని రోల్‌ని తమే స్వయంగా కలర్ లేబ్‌కి ఇచ్చుకుని డబ్బు ఆదా చేసుకుంటున్నారు. దానివల్ల అదే వృత్తిగా బతుకుతున్న ఫొటోగ్రాఫర్లు చాలా నష్టపోతున్నారు.

రంగుల ఫొటోగ్రఫీ నలుపు తెలుపుల ఫొటోగ్రఫీని పూర్తిగా రూపుమాపేసిం




దని, రెండవది ఇప్పుడు కేవలం వార్తా పత్రికలకే పరిమిత మైపోయిందని భావిస్తున్నారు. రంగుల ఫొటోగ్రఫీలో పూర్వంలా ఏ ఒక్క సంస్థ ఆధిపత్యానికీ వీల్లేకుండా పోయిందనీ, ఇప్పుడు ప్రతివారూ ఈ వ్యాపారంలో పెట్టుబడి పెట్టేందుకు ఉత్సాహం ప్రదర్శిస్తున్నారని, దీనివల్ల చివరికి నాణ్యత దెబ్బ తినడం జరుగుతోందని అంటున్నారు.

మిథాస్ కంపెనీవాళ్లు కూడా ఈ వాదాన్ని సమర్థిస్తున్నారు. వాళ్లకి వచ్చే రోల్స్‌లో సరిగ్గా తీయనివి, సాంకేతిక లోపాలున్నవి ఎక్కువగా వుంటున్నాయట.

మరో కలర్ లేబ్‌వారు తమ కలర్ లేబ్ భారతదేశంలో మొదటిసారిగా 'క్విక్ సర్వీస్ పద్ధతి'ని ప్రవేశపెట్టిందని సగర్వంగా చెబుతారు. ఆ పోటీతో మిగతా కలర్ లేబ్‌లు తమ రేటును తగ్గించక తప్పలేదు. ప్రస్తుతం వీరు ప్రింటుకి 4 రూపాయలు తీసుకుంటున్నారు. ఆ రేటు ఇంకా తగ్గిస్తే నాణ్యత కూడా దిగజారుతుందని వారి వుద్దేశం.

ఢిల్లీలోని ఒక అతి పెద్ద, ప్రతిష్టాత్మకమైన ఫొటోగ్రఫీ పరికరాల దుకాణంవారు ఈ రంగంలోని పోటీ భవిష్యత్తులో ఇంకా పెరుగుతుందని అంటున్నారు. కాని, ఎంత పెరిగినా పోస్ట్ కార్డు సైజు ప్రింటు ధరను 3 రూ॥ లకంటే తగ్గించడం సాధ్యపడదని అంటున్నారు. తమ దుకాణంలో కలర్ ఫొటోగ్రఫీ వస్తువులకి గిరాకీ గత ఏడాదిలో అయిదు రెట్లకు పైగా పెరిగిందని, తాము చేపట్టే ఫొటోగ్రఫీ పనిలో 80శాతం వరకూ రంగుల్లోనే జరుగుతుందని వివరించారు.

జనానికి సహజంగా రంగులపట్ల గల ఆకర్షణే వారు రంగుల ఫొటోగ్రఫీపట్ల అంతగా ఆకర్షితులయేట్టు చేసింది. పైగా రంగుల ఫొటోగ్రఫీలో ఫొటో తీయడంలో ఫొటోగ్రాఫర్ చేసిన అనేక పొరపాట్లు కనబడవు. ఇంతకుముందు పెళ్లిళ్లలో నలుపు తెలుపుల ఫొటోలకి అయిన వ్యయంతో ఇప్పుడు రంగుల ఫొటోలు వచ్చేస్తున్నాయి.

మనుషులే కలర్ ప్రింట్లు వేసేపద్ధతిపై వివిధ కలర్ లేబ్‌ల వారి అభిప్రాయాలు భిన్నంగా వున్నాయి. ఆ పద్ధతి ఉత్తమమే గానీ, దానికి ఎక్కువ వ్యవధి పడుతుందంటున్నారు. కంప్యూటరైజ్‌డు కలర్ లేబ్‌లలో వేసిన ప్రింట్లు చవకేగాక నాణ్యమయినవని అభిప్రాయపడుతున్నారు.

రంగుల ఫొటోగ్రఫీ ఇంతగా అభివృద్ధి చెందడంతో కెమేరాలకి కూడా గిరాకీ బాగా పెరిగింది. ఇప్పుడు నాణ్యమైన కొన్ని విదేశీ కెమేరాలను భారతదేశంలోనే తయారుచేసేందుకు కృషి జరుగుతోంది.

గత రెండుదశాబ్దాలుగా న్యూ ఇండియా ఇండస్ట్రీస్, నేషనల్ ఇన్‌స్ట్రుమెంట్స్ లిమిటెడ్ అనే రెండు భారతీయ కంపెనీలు మటుకే 110, 120 మోడల్ బాక్స్ కెమేరాలను తయారుచేస్తున్నాయి. కెమేరాలతయారీలో సంచలనం సృష్టించిన ఘనత ఫొటోఫోన్ కంపెనీకి చెందుతుంది. 1983 వరకూ వాళ్ళు ప్రొజెక్షన్ పరికరాలను మాత్రమే తయారుచేసేవారు. కాని, 1983లో జపాన్ సహకారంతో వారు గోవాలోని మపూసా ప్రాంతంలో ఓ కెమేరాఫ్యాక్టరీని స్థాపించి, నేడు విస్తృత ప్రచారంలో ఉన్న 'హాట్‌షాట్' కెమేరాలను తయారుచేస్తున్నారు.

—జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్

# చతుర కథలు

## లహరి

తెలుగు సినిమా పాటలు వినడమంత తల నొప్పి మరొకటి లేదంటాడు సుబ్బారావు. హిందీ సినిమా పాటలైతే మరో రెండు చెవులు అరువు తెచ్చుకుని మరీ వింటా నంటాడు. కిషోర్‌కుమార్ పాటలంటే ఒక చెవి, ఆశాభోంస్లే పాటలంటే మరో చెవి కోసేసుకుంటానంటాడు. హిందీ సినిమా పాటల గురించి తప్ప తెలుగు సినిమా పాటల గురించి తన దగ్గర మాట్లాడవద్దంటాడు. ఏదోవిధంగా హిందీ సినిమాల గురించి, పాటల గురించి తన విషయ పరిజ్ఞానాన్ని ఎదుటివాళ్ళదగ్గర చాటుకోవాలని తాపత్రయపడిపోతుంటాడు. ఆ తాపత్రయంలో ఒక్కొసారి ఉన్నవి లేనట్లూ, లేనివి ఉన్నట్లూకూడా చెప్పే స్తుంటాడు. అతని స్వభావం తెలిసిన వాళ్ళెవరూ అతను చెప్పేది తప్పని అతనితో వాదం పెట్టుకోరు.

నేనారోజు అనుకోకుండా సుబ్బారావు ఇంటికి వెళ్ళవలసివచ్చింది. సుబ్బారావు సంగతి తెలిసిన నేను ఆ సమయంలో అతని ఇంటికివెళ్ళడానికి సంశయించాను. కాని వెళ్ళకతప్పలేదు.

నేను ఊహించినట్లే సుబ్బారావు ఇంటికి వెళ్ళేసరికి రేడియో సిలోన్‌నుంచి కాబోలు హిందీ పాట మహాజోరుగా విన్పిస్తోంది. మా ఫ్రెండ్ రామం కూడా అక్కడే వున్నాడు. అప్పటికే సుబ్బా రావు కిషోర్‌కుమార్ పాటల్ని గురించి ప్రసంగిస్తున్నాడు. తాను ఏదైనా చెప్పే టపుడు ఎదుటివాళ్ళు చెప్పేది పట్టించు కోకపోవడం సుబ్బారావు ముఖ్యలక్షణం. నన్ను చూసేసరికి తనకు మరో శ్రోత దొరికాడన్న ఆనందంతో అతనిఉత్సాహం రెట్టింపుఅయింది.

హిందీ సినిమాల గురించి, పాటల



గురించి తనకి తప్ప ఇతర్లకి ఏమీ తెలియదన్నట్లుగా ప్రవర్తిస్తాడు సుబ్బారావు. ఎవరైనా మాట్లాడితే అది తనకు అవమానంగాకూడా భావిస్తాడు. ఎదుటి వాళ్లు గనుక హిందీ సినిమాలగురించి తెలియని అమాయకులైతే వారి దీనస్థితి, సుబ్బారావు ఉత్సాహం వర్ణనాతీతం.

కాసేపు సుబ్బారావు అలా అలా మాట్లాడి విషయాన్ని సంగీత దర్శకుల వైపు మళ్ళించాడు. ఆర్. డి. బర్మన్, లక్ష్మీకాంత్-ప్యారేలాల్, కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీల గురించి మాట్లాడటం ప్రారంభించాడు.

ఇంతలో రామం "ఈమధ్య బప్పీలహరి పాటలు బాగుంటున్నాయి" అన్నాడు.

నేను మాట్లాడబోయేంతలో సుబ్బారావు కలుగజేసుకుని "అవునవును. ఆ కార్యక్రమంలో పాటలు చాల బాగుంటాయి. నేనూ విన్నాను ఆమధ్య. భావలహరి, రాగలహరి, గానలహరి అంటూ మన వివిధ్‌భారతివాళ్ళు ఏవేవో కార్యక్రమాలు ప్రసారం చేస్తున్నారుగానీ వాటికన్నా బాంబే వివిధ్‌భారతి వాళ్ళు ప్రసారంచేసే బప్పీలహరి కార్యక్రమానికి అవేవీ సాటిరావు. అసలు నన్నడిగితే మన వివిధ్‌భారతివాళ్ళకు కార్యక్రమాలను ఎలా రూపొందించాలన్నది తెలియదంటాను" అంటూ ఏవేవో చెప్పుకుపోసాగాడు.

ఆ సమాధానంవిని నవ్వుతున్న రామంతో నేనుకూడా శ్రుతికలిపాను. మేము ఎందుకు నవ్వుతున్నామో అర్థం కాక తెల్లమొహం వేశాడు సుబ్బారావు.

—తమ్మినీడి సత్యప్రసాదరావు

# కట్టుకథ

సరిహద్దుల్లో ఎలాంటి అవాంఛనీయ సంఘటనలూ లేవు. ఇదే అదననుకొని సైనికులు తమ స్వగ్రామాలకు వెళ్ళడానికి ఆతృత పడసాగారు.

మేజర్ విశాలహృదయుడు కావడంతో సైనికులు అడిగిందే తడవుగా సెలవులు మంజూరు చేశాడు. సైనికులంతా ఆనందంగా మూటాముల్లె సర్దుకొని తమ స్వగ్రామాలకు ప్రయాణమయ్యారు.

ఓ నెల్లాళ్ళు గడిచాయి. గడువు పూర్తయినా సైనికులు డ్యూటీకి తిరిగి రాలేదు. మేజర్‌కి ముచ్చెమటలు పోశాయి. అర్జంటుగా బయల్దేరి రండంటూ సైనికుల ఇళ్ళకి టెలిగ్రాములు పంపించాడు.

ఓ వారం తరువాత ఒక్క సైనికుడు హాజరయ్యాడు మేజర్ ఎదుట.

"సెలవు అయిపోయాక వెంటనే వచ్చి డ్యూటీలో జాయినవ్వాలని తెలీదూ?" అన్నాడు మేజర్ కోపంగా.

"తెలుసు సార్! కానీ ఏం చేయను? సెలవయిపోయిన వెంటనే రైలెక్కాను ఇక్కడకొద్దామని. కొంతదూరం వచ్చాక రైల్వేవారి సమ్మెవల్ల రైలాగి పోయింది. ఏం చేయాలో తోచక ఓ టాక్సీ అద్దెకు తీసుకొని ప్రయాణమయ్యాను అక్కడి నుంచి. మధ్యదారిలో టాక్సీ చెడిపోయింది. ఏం చేయాలో దిక్కు తోచని పరిస్థితిలో ఆ ఊళ్ళో ఓ గుర్రాన్ని అద్దెకు తీసుకుని ప్రయాణం సాగించాను. దురదృష్టవశాత్తు గుర్రం మార్గమధ్యంలో చనిపోయింది. ఇక అక్కడి నుంచి నడిచి వచ్చేటప్పటికి ఇంత ఆలస్యమయింది" అన్నాడు సైనికుడు రొప్పుతూ.



మేజర్‌కి అతడి కట్టుకథ నమ్మక తప్పలేదు.

"మరి నీ సంగతి ఏమిటి?" గర్జించి అడిగాడు అప్పుడేవచ్చిన రెండో సైనికుని.

"సెలవు ముగిసాక ఇక్కడికి రావడం కోసంరైలెక్కాను సర్. కొంత దూరం రాగానే రైల్వే సమ్మె వల్ల రైలాగిపోయింది. ఓ టాక్సీ అద్దెకు తీసుకుని వస్తూండగా దారిలో టాక్సీ చెడిపోయింది. ఓ గుర్రాన్ని అద్దెకు తీసుకొని దానిపై వస్తూండగా అది చనిపోయింది. అక్కడి నుంచి నడిచి రావడం మూలాన ఈ వేళయింది" అన్నాడు రెండో సైనికుడు తడుముకోకుండా.

మేజర్‌కి మతిపోయింది. అయినా చేసేది లేక ఊకొట్టాడు.

వరుసగా ఆతర్వాత వచ్చిన సైనికులంతా కూడా అదే కథ చెప్పి దాటుకొన్నారు.

"ఇప్పుడు చెప్పు...నీకు లేటెందుకయ్యింది?" అడిగాడు ఆఖర్న వచ్చిన సైనికుడి వంక చూస్తూ మేజర్.

"సార్! సెలవు అయిన వెంటనే ఇక్కడికి త్వరగా చేరుకోవాలని రైలెక్కా కొంత దూరం రాగానే రైల్వే సమ్మె వల్ల రైలాగి పోయింది...!!"

"అప్పుడు నువు టాక్సీ అద్దెకు తీసుకొని బయల్దేరావు. మధ్యలో టాక్సీ చెడిపోతే ఓ గుర్రాన్ని అద్దెకు తీసుకొని ప్రయాణం సాగించావు. దురదృష్టవశాత్తు గుర్రం చనిపోయింది. అక్కడ నుంచి నువ్వు నడిచి రావడం వల్ల లేటయింది.. అంతేనా?" అన్నాడు మేజర్ జుట్టు పీక్కొంటూ.

"అబ్బే...కాదండి. రైలు ఆగిపోగానే టాక్సీ అద్దెకు తీసుకుని బయల్దేరాను. అయితే మార్గమధ్యంలో చచ్చి పడున్న అనేక గుర్రాల్ని దాటుకొంటూ రావడం వల్ల లేటయింది!!" ప్రశాంతంగా చెప్పాడా సైనికుడు.

కళ్ళు తిరిగి పడిపోయాడు మేజర్.

—కె. హరిబాబు

**Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderabad - 500 004.**

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం !



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!



## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం